# ఆయనతో డేటింగ్‌కు రెడీ

## –అమీజాక్సన్



**ఎక్కడో పుట్టి ఎక్కడో పెరిగి కోలీవుడ్ ఒడిలో వాలిన విదేశీ నటి అమీజాక్సన్. నటిగా సూపర్ డూపర్ సక్సెస్‌లు లేకపోయినా అవకాశాల విషయంలో మాత్రం కొదవలేకుండా పోయింది. వరుసగా స్టార్ హీరోలతో నటిస్తోంది. స్టార్ హీరోలతో నటించే అవకాశం కొత్తగా వచ్చిన హీరోయిన్లకు అంత త్వరగా రాదు. కానీ తనకు చాలా త్వరగానే అలాంటి ఛాన్సులు వచ్చాయి అంటున్న అమీజాక్సన్‌తో...**

**'రోబో 2' షూటింగ్ పూర్తయినట్టుంది?**

నా పార్ట్ అయిపోయింది. వేరే సినిమా షూటింగుల్లో పాల్గొంటున్నాను. రోబో 2 కోసం ఫైట్లు నేర్చుకున్నాను. ఈ సినిమా కోసం నాన్‌వెజ్‌ని త్యాగం చేశాను. పూర్తి శాకాహారిగా మారిపోయాను. యోగా, ధ్యానం వంటివి అలవాటు చేసుకున్నాను. ఒక్క మాటలో చెప్పాలంటే నన్ను నేను పూర్తిగా మార్చుకున్నాను. అది తెర మీద కచ్చితంగా కనిపించి తీరుతుంది.

**శంకర్‌గారితో రెండోసారి చేయడం ఎలా అనిపిస్తోంది?**

సాధారణంగా శంకర్ సార్ తన సినిమాలో హీరోయిన్‌కి రెండో అవకాశం ఇవ్వరట! చాలా మంది చెబితే విన్నాను. 'ఐ' ఫలితం ఎలా ఉన్నా, 'రోబో 2'లో నాకు ఛాన్స్ ఇచ్చినప్పుడు చాలా మంది ఆశ్చర్యపోయారు. అదంతా నా అదృష్టం. ఆయనకు నా మీద నమ్మకం ఉంది. నాకు ఆయన మీద నమ్మకం ఉంది. 'ఐ' నిరాశ పరిచినా, ఈ సినిమా నాకు మంచి విజయాన్ని అందిస్తుంది.

**తమిళం బాగా వచ్చేసినట్టేనా?**

భాష బాగా అర్థమవుతోంది. చిన్న చిన్న పదాలు మాట్లాడగలుగుతున్నాను. ఒక్క తమిళమే కాదు, హిందీ కూడా నేర్చుకుంటున్నాను. నా స్నేహితులందరూ లండన్‌లో విందులూ వినోదాల్లో మునిగి తేలుతుంటే నేను ఇక్కడ భాష నేర్చుకోవడంలో కుస్తీ పడుతున్నాను. అయినా సంతోషంగానే ఉంది.

**బాలీవుడ్‌లో సల్మాన్‌తో చేస్తున్నట్టున్నారు?**

సినిమా కాదు. వాణిజ్య ప్రకటనలో నటిస్తున్నాను. ఓ రోజు ఓ ఫోన్‌కాల్ వచ్చింది. చేసింది నా అభిమాన నటుడు సల్మాన్ ఖాన్. తనతో కలిసి సినిమా చేయాలన్నది నా చిరకాల కోరిక. అయితే సినిమాలో కాకుండా వాణిజ్య ప్రకటనలో నటించే అవకాశం ముందుగా వచ్చింది. ఏ అవకాశం అయితేనేం, తనతో నటిస్తున్నాను. అది చాలు నాకు.

**సల్మాన్‌తో డేటింగ్ చేయడానికి రెడీ అన్నారు కదా?**

ఆయనతో డేటింగ్ చేయడానికి ఏ ఆడపిల్ల సై అనదు...! దానికి నేనేమీ మినహాయింపు కాదు. ఆయనతో నాకున్నది మంచి స్నేహమే తప్ప మరొకటి కాదు. డేటింగ్ విషయంలో నా అభిప్రాయం చెప్పాను అంతే! అంతకు మించి మా ఇద్దరి మధ్యా ఏదీ లేదు. బాలీవుడ్‌లో ఆయన నాకు మార్గదర్శి. నాకు తెలియని చాలా విషయాలు చెప్పారు. ఈ ఫీల్డులోకి వచ్చిన తరువాత నాకు అలా చెప్పిన మొట్టమొదటి వ్యక్తి సల్మాన్. అందుకే ఆయనంటే నాకు అంత అభిమానం.

**విజయ్ సేతుపతితో చేయబోతున్నారట?**

అవును. ఆయన సక్సెస్‌ఫుల్ స్టార్. ఆయన పక్కన ఛాన్స్ రావడం ఆనందంగా ఉంది. గత సంవత్సరం ఆయన సినిమాలన్నీ సూపర్ డూపర్ హిట్. ఈ సంవత్సరం కూడా అలాగే ఉంటుందని అనుకుంటున్నాను. ఆయన పక్కన చేస్తున్నందుకు నాకూ సక్సెస్ గ్యారంటీ!

**సీక్వెల్ సినిమాల్లో ఎక్కువగా చేస్తున్నట్టుంది?**

అదేం లేదు. కథ నచ్చితే చేస్తున్నాను తప్ప అది సీక్వెలా? కాదా? అన్నది చూడడం లేదు.

**తెలుగులో చేయకపోవడానికి కారణం?**

అవకాశం రాక చేయలేదు తప్ప మరో కారణం లేదు. అయినా 'ఐ' సినిమాతో తెలుగువారిని పలకరించాను. ఇప్పుడు 'రోబో 2'తో మరోసారి వారి ముందుకు వస్తున్నాను. తెలుగు ప్రేక్షకులకి ఎప్పుడూ దూరంగా లేను. మంచి కథతో ఎవరైనా వస్తే చేయడానికి నాకు ఎలాంటి అభ్యంతరం లేదు.

–కె.రామకృష్ణ

## సరదాగా....

### ఒక్కమాట

"పట్నంలో చదివే మా అబ్బాయి ఏదో ఫేస్ బుక్ కొనాలంట. రేటు చాలా ఎక్కువ. ఇరవై వేలు పంపమంటే ఇప్పుడే బ్యాంకులో వేసి వస్తున్నా" అన్నాడు శీనయ్య.

"మరీ ఇంత అమాయకుడివి ఏంటయ్యా నువ్వు. ఈ కాలంలో కూడా లోకం తెలియకుండా ఉన్నావే?" అంటూ ఆశ్చర్యపోయాడు పక్కింటి జగన్నాథం.

**శీనయ్య:** ఏమయింది? ఏమయినా తప్పు జరిగిందా?

**జగన్నాథం:** మీ అబ్బాయి నిన్ను బాగా మోసం చేస్తున్నాడు. ఒకసారి వాణ్ణి గట్టిగా నిలదీయి. అప్పుడు బయటపడుతుంది అసలు కథ.

**శీనయ్య:** నువ్వసలు ఏంచెబుతున్నావు?

**జగన్నాథం:** నువ్వు చెప్పిన ఆ ఫేస్‌బుక్ రేటు పదిహేనువేలే! నిన్ననే నాకొడుక్కి డబ్బు పంపించా. నువ్వు డబ్బు పంపేముందు నన్నొక్కమాట అడిగి ఉండాల్సింది. సరేలే జరిగిందేదో జరిగిపోయింది. అదేదో స్కైప్ కొనాలని మావాడు చెప్పాడు. ఇరవై ఐదు వేలు పంపిస్తున్నా. మీవాడు కూడా అడుగుతాడు. అప్పుడు ఐదువేలు తగ్గించి పంపు. సరేనా...

**శీనయ్య:** అలాగేలే... నువ్వు చాలా తెలివైనవాడివి. నువ్వు చెప్పకపోతే నిజంగా నాకు తెలిసేది కాదు.

### ఒక ప్రశ్న?

రామాయమ్మ పేరు చెబితే చాలు ఆ ఊళ్లో అందరికీ మామిడిపళ్ళే గుర్తొస్తాయి. ఆమె ఇంటి పెరట్లో ఓ పెద్ద మామిడిచెట్టు ఉంది. వేసవి వచ్చిందంటే చాలు విరగకాస్తుంది. ఇంట్లోకి పోను... చుట్టుపక్కల వారికి పంచిపెట్టినా కూడా ఇంకా చాలా మిగులుతాయి. వాటిని ఆ ఊర్లోనే ఉన్న సుబ్బిశెట్టికి అమ్మేస్తుంటుంది. ఆ ఊరంతటికీ సుబ్బిశెట్టి కొట్టు నుంచే సరుకులన్నీ వెళతాయి. ఈసారి వాతావరణం అనుకూలించటం వల్లనేమో రామాయమ్మ మామిడి చెట్టు పళ్ళతో కళకళలాడిపోతోంది. కాయ ఎక్కువగా ఉండటంతో, ఆ విషయమే సుబ్బిశెట్టికి చెప్పింది. సుబ్బిశెట్టి కాస్తంత ఆలోచించి, ఎన్ని పళ్ళు పంపించగలరు? అని అడిగాడు. రామాయమ్మ మదిలో చెట్టు రూపం ప్రత్యక్షమైంది. చెట్టుకి మొత్తం 19 కొమ్మలున్నాయి. ప్రతీ కొమ్మకు 7 రెమ్మలున్నాయి. ప్రతీ రెమ్మకు 2 పళ్ళు ఉన్నాయి. అనుకుంటూ మొత్తం లెక్కలు వేసి ఎన్ని పళ్ళు వస్తాయో చెప్పింది. మరి మీరు కూడా లెక్కలు వేసి మొత్తం ఎన్ని నారింజకాయలను రామాయమ్మ సుబ్బిశెట్టికి అమ్మగలదో చెప్పగలరా? ప్రయత్నించండి.

### సమాధానం

జీరో నారింజకాయలు. ఎందుకంటే రామాయమ్మ ఇంట్లో ఉన్న మామిడిచెట్టుకి నారింజ కాయలు కాయవు కదా.



## 8

## ఒత్తిడిని తరిమేద్దాం

ఒత్తిడి సమస్య మహిళల్లోనే ఎక్కువ. ఇది దీర్ఘకాలిక ఆరోగ్య సమస్యలు సృష్టిస్తుంది. అయితే ఒత్తిడి కొన్నిసార్లు మంచి కూడా చేస్తుందట! మరి ఒత్తిడి వల్ల కలిగే ఆ మంచి ఏమిటో, ఆ సమస్యలేమిటో మీరూ తెలుసుకోండి!

**30**

### రివ్యూ

ఇప్పుడు కాంగ్రెస్ పార్టీ ఉనికికీ, అస్తిత్వానికే ప్రమాదం ముంచుకువచ్చింది. ఆ పార్టీకి దిశానిర్దేశం లేకుండాపోయిందంటున్న రాజశుక రివ్యూ..

**72**

### ఇంటర్వ్యూ

విలన్‌గా కొత్త తరహాలో తెలుగువారిని ఆకట్టుకున్న నటుడు ప్రదీప్ రావత్. బాలీవుడ్‌లో మోసాలవల్లే తారలు దక్షిణాదికి వస్తున్నారంటున్న ఆయన ఇంటర్వ్యూ...

## సీరియల్స్



## కథలు



## ఫీచర్స్



ముఖచిత్రం: రకుల్‌ప్రీత్‌సింగ్
ఫొటో: గోపీకృష్ణ


రచనలు, కథలు పంపవలసిన చిరునామా
నవ్య వీక్లీ, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం.76, అశ్వనీ లేఅవుట్, హుడా హైట్స్, రోడ్ నెం.70, జూబ్లీహిల్స్, హైదరాబాద్33. email: navyaweekly@andhrajyothy.com





### సేమ్ టు సేమ్

ఇద్దరు ముసలివారు పార్కులో కూర్చుని పాప్ కార్న్ చప్పరిస్తున్నారు.

**మొదటివ్యక్తి:** మొన్ననే తొంభై రెండు వెళ్ళి, తొంభై మూడొచ్చింది. ఏంటోలా ఉంది. నీది కూడా నా వయసే కదా? నీ పరిస్థితేంటి?

**రెండోవ్యక్తి:** నాకేం! ఇప్పుడే పుట్టిన పిల్లాడిలా సుఖంగా ఉన్నాను.

**మొదటివ్యక్తి:** ఇప్పుడే పుట్టిన పిల్లాడిలా సుఖంగా ఉన్నావా? అదెలా సాధ్యం?

**రెండోవ్యక్తి:** సాధ్యమే! పళ్ళులేవు, జుత్తులేదు, డైపర్స్ వాడుతున్నాను. అంతా సేమ్ టు సేమ్.

### సాహసం

కొండశిఖరం మీద నాలుగు దేశాలకు చెందిన నలుగురు వ్యక్తులు నిల్చున్నారు. వారిలో ఒకరు ఏషియన్. ఒకరు మెక్సికన్. ఇంకొకరు బ్లాక్. మరొకరు వైట్. అందులో ముందుగా ఏషియన్‌వ్యక్తి శిఖరం మీద నుంచి దూకేస్తూ అరిచాడిలా.

నా ప్రజలకోసం నేను ఈ సాహసం చేస్తున్నాను.

మెక్సికన్ కూడా దూకేస్తూ అదే మాట వల్లె వేశాడు. నా ప్రజలకోసం నేను ఈ సాహసం చేస్తున్నాను అన్నాడు. బ్లాక్ వంతు వచ్చింది. అతను శిఖరం మీద నుంచి కిందికి చూశాడు.

నా ప్రజలకోసం నేను ఈ సాహసం చేస్తున్నాను.

అని గట్టిగా అరచి దూకలేదతను. పక్కనున్న వైట్‌ను బలంగా కిందికి తోసేశాడు.

### వన్‌మోర్

హడావుడిగా బార్‌కి చేరుకున్నాడతను. బీర్ ఆర్డర్ చేశాడు. వచ్చింది. గడగడా తాగేశాడు. తాగేసి, జేబులోని పర్స్ తెరిచి చూశాడు. మళ్ళీ మరో బీర్ ఆర్డర్ చేశాడు. వచ్చింది. దానినీ లాగించేశాడు. మళ్ళీ పర్సు తెరిచి చూశాడు. మరో బీర్ ఆర్డర్ చేశాడు. వచ్చింది. తాగేశాడు. మళ్ళీ పర్స్ తెరిచి చూశాడు. మరో బీర్ ఆర్డర్ చేశాడు. అలా ఆరు బీర్లు తాగాడతను. ఏడో బీర్ ఆర్డర్ చేశాడు. తెచ్చి ఇచ్చి అప్పుడు అడిగాడు బార్ టెండర్.

"బీర్ ఆర్డర్ చేస్తారు. తాగుతారు. పర్సు తెరిచి చూస్తారు. మళ్ళీ బీర్ ఆర్డర్ చేస్తారు. పర్సులో ఏంవుంది సార్? పదే పదే పర్స్ ఎందుకు చూస్తున్నారు?"

"ఎందుకు చూస్తున్నానంటే...ఇందులో మా ఆవిడ ఫొటో ఉంది. ఆవిడ బాగుంది అనిపించేంత వరకూ తాగి, ఇంటికి బయల్దేరదామని...వన్ మోర్ బీర్.." ఆర్డర్ చేశాడు.

-వైనతేయ

www.navyaweekly.com

పుస్తక పఠనం ఎంతటి
బాధనయినా మరపిస్తుంది.

# నవ్య

సంపుటి: 14 సంచిక: 7
19-4-2017



మేనేజింగ్ డైరెక్టర్
వేమూరి రాధాకృష్ణ

ఎడిటర్
ఎ.ఎన్.జగన్నాథశర్మ

## మొదటి పేజి

# ఎవరికి ఎవరు? చివరికి ఎవరు?

అయిపోయింది. ఈ ఊరితోనూ ఆ ఇంటితోనూ అనుబంధం తెగిపోయింది. ఇక ఇక్కడ ఉండడం అనవసరం. వెళ్ళిపోవాలి. దూరంగా...చాలా దూరంగా వెళ్ళిపోవాలనుకున్నాడతను. రైల్వేస్టేషన్‌కి చేరుకున్నాడు. ఓ రైలు వచ్చింది. ఆ రైలు చేరుకునే చివరి స్టేషన్‌కి టిక్కెట్ తీసుకున్నాడు. రైలెక్కాడు. కంపార్ట్‌మెంటంతా కిక్కిరిసి ఉంది. నిలబడే ప్రయాణిస్తున్నారంతా. అతనూ నిలబడ్డాడు. కాసేపటికి ఆ మూలన ఓ సీటు ఖాళీ అవుతున్నట్టనిపిస్తే ఆ సీటును అందుకునేందుకు రెండు అడుగులు వేశాడో లేదో కాలికింద ఏదో మెత్తగా తగిలింది. దాంతో ఆగిపోయాడతను. వంగి, కాలికిందికి చూశాడు. మనీపర్సు! పాతది. చేతిలోనికి తీసుకుని తెరచి చూశాడు. అయిదువందలనోట్లు రెండు, ఓ రెండువేల నోటు, వందనోట్లు నాలుగు, పదిరూపాయలనోట్లు మూడుసహా ఆ పర్సులో అభయాన్నిస్తున్న శ్రీరాముని ఫోటో ఉంది. పర్సు మూసి, ప్రయత్నించిన సీటువైపు చూశాడు. దానినెవరో భర్తీ చేశారు. ఖాళీగా లేదిప్పుడు. నవ్వుకున్నాడతను. నవ్వుకుని చేతిలోని పర్సును చూపిస్తూ, ఇదెవరిది? అడిగాడు. నాదంటే నాది అని అంతా మీద పడతారనుకున్నాడతను. అలా జరగలేదు. ఎవరూ ముందుకు రాలేదు. క్షణం తర్వాత ఓ ముసలాయన లేచి, పర్సు తనదన్నాడు. మీది అని మీరు ఎలా చెప్పగలరు? అడిగాడతను. అందులో రాముడిఫోటో ఉంటుంది అన్నాడాయన. దేవుడిఫోటో పర్సులో అందరూ పెట్టుకుంటారు. అది ఉన్నంత మాత్రాన పర్సు మీది ఎలా అవుతుంది? అడిగాడతను. అందరూ పెట్టుకోరు. కోరుకున్నవాళ్ళే పెట్టుకుంటారు. నేను రాముణ్ణి కోరుకున్నాను, అందుకే ఆ ఫోటో పెట్టుకున్నాను. అందుకు పెద్దకథ ఉంది. వింటానంటే చెబుతాను అన్నాడాయన. చెప్పండి అడిగాడతను. వినండి అంటూ చెప్పసాగాడాయన.



నేను టెన్త్‌క్లాస్ ఫస్ట్‌క్లాసులో పాసైనప్పుడు, నన్ను అభినందిస్తూ మానాన్నగారు నాకు కానుకగా కొనిచ్చిన పర్సది. అప్పుడు మా అమ్మానాన్నలఫోటో పెట్టుకున్నానందులో. పర్సు తెరిస్తే, అమ్మానాన్నలు కనిపిస్తే, ఆనందంగా ఉండేది. పదేపదే వాళ్ళను చూసుకునేవాణ్ణి. నేను ఇంటర్మీడియెట్‌లో జాయినైనప్పుడు, అమ్మానాన్నలఫోటో పర్సులో అవసరమా? అనిపించి తీసేశాను. నల్లటి కర్లింగ్ హెయిర్‌తో, నవ్వుతూ మెరిసిపోతున్న నా ఫోటో పెట్టుకున్నానక్కడ. రోజుకి కనీసం పది పదిహేనుసార్లు నన్ను నేను చూసుకుని, పొంగిపోయేవాణ్ణి. పీజీలో ఓ అమ్మాయి పరిచయమైంది. చాలా అందమైన అమ్మాయి. ఇద్దరం ప్రేమించుకోసాగాం. అప్పుడు, నా ఫోటో తీసేసి, ఆ అమ్మాయి ఫోటో పెట్టుకున్నానందులో. రాత్రీపగలూ ఆమె ఫోటో చూసుకోవడంలోనే కాలం గడిచిపోయేది. పీజీ అయిపోయింది. ప్రేమించిన అమ్మాయితో పెళ్ళి అయిపోయింది. ఉద్యోగంలో చేరాను. బాబు పుట్టాడు. బోసినవ్వులబాబును పదేపదే చూడాలనిపించి, నా భార్యఫోటో తీసేసి, బాబు ఫోటోపెట్టుకున్నానప్పుడు అని పొలమారాడు. చెమర్చిన కళ్ళను ఒత్తుకున్నాడు. దాహం వేసిందేమో! నీళ్ళకోసం చూస్తోంటే ఎవరో వాటర్‌బాటిల్ అందించారు. అందుకుని నీళ్ళు తాగాడాయన. కాసేపటికి గొంతు సవరించుకుని, మళ్ళీ చెప్పసాగాడిలా.

ఇప్పుడు నాకు డెబ్బయిరెండేళ్ళు. మా అమ్మానాన్నా లేరు. పోయారు. నా యవ్వనం పోయింది. అలాగే నా భార్య కూడా పోయింది. పోయి చాలా రోజులైంది. కొడుకు ఉన్నాడు. అయితే ఇక్కడ లేడు. అమెరికాలో ఉన్నాడు. నన్ను చూడడానికి వాడిక్కడికి రాడు. వాణ్ణి చూడడానికి నేను అక్కడికి పోను, పోలేను. ఒంటరివాణ్ణి అయిపోయాను. ఆకలి వేస్తుందా? అన్నం తింటావా? అని అడిగే మనిషి లేడు. బాధగా ఉందా? భయంగా ఉందా? అంటూ దగ్గరగా తీసుకునే మనుసు లేదు. అదిగో! అప్పుడు...అప్పుడే ఆ రాముడు దిక్కయ్యాడు. అయిదు రూపాయలు పెట్టి ఆ ఫోటో కొనుక్కున్నాను. బాబు ఫోటో పర్సులోంచి తీసేసి, రాముణ్ణి పెట్టుకున్నానక్కడ. చూస్తున్న కొద్దీ చూడాలనిపించే బొమ్మ. వేడుకుంటున్నకొద్దీ వరాలిచ్చే బొమ్మ. ఏడుస్తున్నకొద్దీ ఓదార్చే బొమ్మ. ఇంతకంటే ఇంకేం కావాలి? రోజులు గడచిపోతున్నాయి అన్నాడాయన. చేతిలోని పర్సును మళ్ళీ తెరచి, అందులో రాముణ్ణి చూశాడతను. ఆ ఫోటోను చేతి వేళ్ళతో ఆరాధనగా నిమిరాడు. పర్సు మూసి, ఇచ్చేశాడాయనకి. ఏదో స్టేషన్ వచ్చింది. రైలాగింది. పెద్దస్టేషనే! పది నిముషాలు పైగానే ఆగుతుందన్నారెవరో! రైలు దిగాడతను. ఆధ్యాత్మికపుస్తకాలు అమ్మే షాపుదగ్గరగా నడిచాడు. ఏం కావాలి సార్? అడిగాడు షాపులోని వ్యక్తి. ఓ రాముడిఫోటో. చిన్నది, అయిదు రూపాయలది కావాలన్నాడతను. ఇచ్చాడు షాపులోని వ్యక్తి. రాముణ్ణి ప్రేమగా చూసుకుని, పర్సులో పెట్టుకున్నాడతను. రైలెక్కాడు.



ప్రముఖ నటుడు గొల్లపూడి పుస్తకాన్ని ఆవిష్కరిస్తున్న దృశ్యం

# జియోలక్ష్మణ్ కథలు పుస్తకావిష్కరణ

కళింగాంధ్ర ప్రాంత రచయిత జియోలక్ష్మణ్. ప్రవృత్తిరీత్యా మూడు దశాబ్దాలుగా రచనారంగంలో ఉంటూనే ఆధ్యాత్మిక రచయితగా పదహారు పుస్తకాలు వెలువరించి ఎందరికో మార్గదర్శనం చేశారు. వేలాది ప్రవచనాలతో శ్రోతలను అలరించిన ఈ రచయిత 'జియోలక్ష్మణ్ కథలు' శీర్షికన తొలి కథా సంకలనం వెలువరించారు. ఈ కథలన్నీ నవ్య వీక్లీలో ప్రచురితమైనవే! విజయనగరంజిల్లా పార్వతీపురం లయన్స్‌క్లబ్ వేదికపై ఏప్రిల్ రెండవతేదీ ఆదివారం ఉదయం ప్రముఖ రచయిత, నటుడు, కళారత్న అవార్డు గ్రహీత గొల్లపూడి మారుతీరావు ఈ పుస్తకం ఆవిష్కరించారు. 'సాహితీ లహరి' సాంస్కృతిక సంస్థ ప్రధాన కార్యదర్శి డాక్టర్ మంచిపల్లి శ్రీరాములు అధ్యక్షతన జరిగిన ఈ సభలో డాక్టర్ డి.వి.జి శంకరరావు, బాలల కథా రచయిత గంగిశెట్టి శివకుమార్, పుస్తక రచయిత జియోలక్ష్మణ్ ప్రభృతులు పాల్గొన్నారు.

అంతకుముందు మార్చి 29వ తేదీ హేవళం బినామ సంవత్సర ఆరంభదినాన ఉగాదినాడు హైదరాబాద్ హుస్సేన్‌సాగర్‌లో బుద్ధవిగ్రహం పాదాల చెంత ఇదే పుస్తకాన్ని ప్రముఖ రచయిత వి.రాజారామమోహనరావు ఆవిష్కరించారు. అరుదైన జీవిత సంఘటనలను కథలుగా మలిచిన జియోలక్ష్మణ్ జీవితాన్ని, జీవిత సంఘర్షణలను ఎంతో క్లారిటీతో మన కళ్ళముందు ఆవిష్కరించారని రాజారామమోహనరావు ప్రశంసించారు.

### మానవీయ, తాత్త్విక కథలు

ప్రముఖ రచయిత్రి, జర్నలిస్టు కె.బి.లక్ష్మి ఈ కథల్ని సమీక్షించారు. మానవీయ, తాత్త్విక దృక్కోణం గల ఈ కథలు మనం కోల్పోతున్న జీవన మూలాలను ఒడిసిపట్టి ఒకే కేన్వాస్‌పై చూపించాయన్నారు. 'అమలాపురం టూ వైజాగ్ కథలో యంగ్ జనరేషన్ ఎలా ఆలోచించాలో చెప్పారన్నారు. మూడు దృశ్యాలు, నాలుగు మందులు కథలు సమాజ స్థితిగతులను, కన్నతల్లి ఆలోచనలను కళ్ళకుకడితే, 'భగవద్గీత' కథ ఆధ్యాత్మికతను ఒక సైన్స్‌లా, జీవితాల్ని నడిపించే ఒక జ్ఞానంలా బోధించిందన్నారు.

జియోలక్ష్మణ్ కథలన్నీ జీవితంలోంచి, వేదనలోంచి వచ్చినవేనన్నారు సభకు అధ్యక్షత వహించిన రచయిత శరత్‌చంద్ర. పుస్తక రచయిత జియోలక్ష్మణ్ మాట్లాడుతూ, ఎంతో అనుభవించి, పలవరించి, కలవరించి రాసినవే ఈ కథలన్నీ అన్నారు. యండమూరి వీరేంద్రనాథ్ ప్రేరణ, నవ్య వీక్లీ ప్రోత్సాహంతో నా మొదటి కథల పుస్తకాన్ని చిరకాల వాంఛగా బుద్ధుని సమక్షంలో ఆవిష్కరించినట్టు చెప్పారు. 'అమలాపురం టూ వైజాగ్', 'భగవద్గీత' కథలు హిందీలోకి అనువాదంకాగా, 'భగవద్గీత' కథ కన్నడంలోకి కూడా వెళ్ళిందన్నారు. ఈ సందర్భంగా జియోలక్ష్మణ్‌ను ప్రముఖ రచయిత వాణిశ్రీ శాలువాతో సత్కరించారు. రచయితలు నండూరి సుందరీ నాగమణి, పి.వి.డి.ఎస్.ప్రకాష్ ప్రభృతులు పాల్గొన్నారు. జియోలక్ష్మణ్ కుమార్తె పి. అధర్వణ

## మెయిల్ బాక్స్

### ప్రభ చెప్పడం బాగుంది

ఎన్టీఆర్ గుడి, ఏఎన్నార్ బడి అని ప్రభ చెప్పడం బాగుంది. దానవీరశూర కర్ణ, క్షేత్రయ్య సినిమాల్లో నటించి ప్రేక్షకులను మురిపించింది. రివ్యూ బాగుంది. కాంగ్రెస్ మెడలో గంట ఎవరూ కట్టలేరు.

—వాస్తు రామచంద్ర, నెల్లూరు

### తీన్మార్ నవ్వించింది

మార్నింగ్ కాఫీలో తీన్‌మార్ భలే నవ్వించింది. మొదటిపేజీ 'దేవుడు' అంటే ఎవరో హృద్యంగా సెలవిచ్చారు. 'అంటరాని వసంతం' కథాకర్త తటవర్తి నాగేశ్వరి గారికి అభినందనలు. మెట్టా నాగేశ్వరరావుగారి కవిత మానవ సంబంధాలకు పెద్దపీట వేసింది. కొత్త భావజాలానికి రంగస్థలమే ఊపిరి అంటున్న మొదలి నాగభూషణశర్మ గారి మనోభిప్రాయంతో శృతి కలుపుతున్నాం. ఏఎన్నార్ బడి, ఎన్టీఆర్ గుడి అని ఒక్కమాటలో ఆ మహానుభావులు, మహనటుల పట్ల గౌరవం ప్రభ మాటల్లో కనిపించింది.

—నేమాన సుభాష్ చంద్రబోస్, విశాఖపట్నం

### రాంపా కథలపేర్లు విచిత్రంగా ఉన్నాయ్

వారం వారం సరదా కథలుతో రాంపా కొత్త ఒరవడికి శ్రీకారం చుట్టారు. కేవలం కథల్లోనే కాకుండా కథల పేర్లు, పాత్రల పేర్లు కూడా చాలా విచిత్రంగా పెట్టి హాస్యం సృష్టిస్తున్న రాంపా గారికి కృతజ్ఞతలు.

—జి.రమేష్, మణుగూరు. కొత్తగూడెం జిల్లా

### వెరైటీ సీరియల్

సినీవాలి సీరియల్ ఆసక్తికరంగా చదివిస్తోంది. ఇంత వెరైటీ సీరియల్ పాఠకులకు అందించిన ప్రభాకర్ జైని గారికి అభినందనలు. నవ్య నా ఇష్టమైన పత్రిక.

—ఎస్.టి.పి.రంగనాయకమ్మ, విజయవాడ

### నవ్య వీక్లీ నాకెంతో ఇష్టం



నవ్య వీక్లీ అంటే నాకెంతో ఇష్టం. ప్రతివారం వీక్లీ చదువుతాను.

వీక్లీలో భక్తిపరమైన సీరియల్స్ ప్రధానంగా చదువుతాను. భారతం, భాగవతం, రామాయణం వీక్లీలో చదివాను. ఎంతో బాగున్నాయి. ఇప్పుడు 'హరివంశం' సీరియల్ చదువుతున్నాను. నాకు ఎంతగానో నచ్చింది. నవ్య వారపత్రిక రచనల్లో ఒక పవిత్ర భావన నాకు కనిపిస్తుంది. వారం వారం ప్రచురిస్తున్న కథలు ఎంతో బాగుంటున్నాయి. సీరియల్స్, వింతలూ విడ్డూరాలూ నాకు ఎంతగానో నచ్చుతాయి.

—భానుప్రియ, నటి, హైదరాబాద్

## హెపటైటిస్ కట్టడి హోమియోతో సాధ్యం

**హెపటైటిస్** వైరస్...మానవాళిని భయపెడుతున్న వైరస్‌లలో ఇదొకటి. దీని మూలంగా కాలేయంలో కణాలు వాచిపోయి ఫైబ్రోసిస్, సిర్రోసిస్‌కు దారితీస్తుంది. దీంతో కాలేయ పనితీరు మెల్లగా తగ్గి ప్రాణాంతకంగా మారుతుంది. ఈ వ్యాధి వచ్చిన తర్వాత శాశ్వత పరిష్కారాన్ని చూపే చికిత్స ఇతర వైద్యవిధానాలలో లేదు. కానీ హోమియో వైద్యంలో అద్భుతమైన చికిత్స ఉంది.

**ఇవీ కారణాలు** : ఎక్కువ మందితో సెక్సువల్ కాంటాక్ట్ పెట్టుకోవడం, అపరిచితుల నుంచి సేకరించిన రక్తం అంటే హెపటైటిస్ వైరస్ ఉన్న రక్తాన్ని ఎక్కించడం, స్వలింగ సంపర్కం, ఒకరు వాడిన సిరంజీలు మరొకరు వాడటం వల్ల కూడా హెపటైటిస్ వచ్చే అవకాశం ఉంటుంది. తల్లి గర్భవతిగా ఉన్నపుడు ఈ వ్యాధి సోకినట్లయితే కడుపులోని బిడ్డకు కూడా సంక్రమించే అవకాశం ఉంటుంది.

**లక్షణాలు** : ఆకలి లేకపోవడం, వాంతి వస్తున్నట్లుగా ఉండటం, ఒళ్లంత నొప్పులు, మూత్రం పచ్చగా రావడం జరుగుతుంది. తరువాత నెమ్మదిగా కామెర్లు మొదలవుతాయి. దీంతో పాటు చర్మంపై దద్దుర్లు కనిపిస్తాయి. హెపటైటిస్ బి వ్యాధి చాలా ఆలస్యంగా బయటపడుతుంది. కొన్ని సందర్భాలలో సంవత్సరాల తర్వాత బయటపడవచ్చు. దీన్ని క్రానిక్ హెపటైటిస్ అంటారు.

**హోమియో చికిత్స** :

హెపటైటిస్ బి, సి వైరస్‌లు కాలేయంలో మల్టిపుల్ అయ్యే అవకాశం ఎక్కువగా ఉంటుంది. దీన్ని రెప్లికేషన్ అంటారు. ఈ రెప్లికేషన్ అయ్యే పద్ధతిని హోమియోపతి మందుల ద్వారా అడ్డుకోవచ్చు.

## హెచ్‌ఐవి, హెర్పిస్‌లకు దీటైన వైద్యం

**హెచ్‌ఐవి** సోకితే మరణం తప్పదనే భావన ఇప్పటికి చాలా మందిలో ఉంది. నిజానికి హోమియోలో హెచ్‌ఐవి వైరస్‌ను కట్టడి చేసే మందులు ఉన్నాయి. హెచ్‌ఐవి ఎక్కువ విస్తరిస్తుండటానికి కారణం దీని లక్షణాలు కొన్ని ఏళ్ల తరువాత బయటపడటమే. అప్పటి వరకు వారికి హెచ్‌ఐవి ఉన్న విషయం కూడా తెలియదు. రోగనిరోధక శక్తి తగ్గినపుడు వ్యాధి లక్షణాలు బయటపడతాయి. విరేచనాలు కావడం, బరువు తగ్గడం, అవకాశవాద వ్యాధులు విజృంభించడం, వాతావరణ మార్పులను తట్టుకోలేకపోవడం, త్వరగా వ్యాధులు వస్తుండటం జరుగుతుంది.

**హెర్పిస్**

పురుషాంగంపైన చెమట పొక్కుల మాదిరిగా నీటి పొక్కులు కనిపిస్తాయి. నీటిపొక్కులు ఎర్రగా ఉండి దురద ఉంటుంది. నీటిపొక్కులు పగిలి ఎర్రగా పుండు పడుతుంది. ఇటువంటి సమయంలో తగు చికిత్స తీసుకోకపోతే ఇతరులకు సోకే ప్రమాదం ఉంది. లైంగిక కలయిక ద్వారా సంక్రమించే ఈ వ్యాధిని హెర్పిస్ అని అంటారు.

**హోమియో చికిత్స**

హోమియో మందులతో రోగనిరోధక శక్తి బలపడుతుంది. తద్వారా హెచ్‌ఐవి రోగుల్లో అవకాశవాద వ్యాధులన్నీ దూరమవుతాయి. వైరల్‌లోడ్ బాగా తగ్గిపోతుంది. ఆరోగ్యవంతమైన జీవనం గడపడానికి ఆస్కారం లభిస్తుంది. హెర్పిస్ సింప్లెక్స్ వంటి లైంగిక వ్యాధుల నివారణకు కూడా హోమియో చికిత్సపనిచేస్తుంది. హోమియో చికిత్స మూల కారణాన్ని తొలగిస్తుంది.


**Dr. K Ravikirane**

M.D.,M.sc(psych), P.G(virology)LONDON

గోల్డ్‌మెడల్ ఫర్ ఎక్సలెన్సీ ఇన్ మెడిసిన్

మాస్టర్స్ హోమియోపతి

అమీర్‌పేట్, కూకట్‌పల్లి, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్,

విజయవాడ, కరీంనగర్, విశాఖపట్నం,తిరుపతి

ఫోన్ : 7842 106 106, 9032 106 106




V6లో ప్రతి మంగళవారం మధ్యాహ్నం 2:30కి

సాక్షిలో ప్రతి శనివారం మధ్యాహ్నం 2:30కి

10టీవీలో ప్రతి ఆదివారం మధ్యాహ్నం 4:30కి డాక్టర్‌గారి లైవ్ కార్యక్రమం ఉంటుంది.

## తల తిరుగుతుంటే...!

**తల** తిరగడం అనేది ఈ ఆధునిక యుగంలో సాధారణ సమస్యగా మారింది. కానీ అది దీర్ఘకాలికంగా బాధిస్తున్నప్పుడు అది రావడానికి కారణాలు కచ్చితంగా కనుక్కుని చికిత్స ఇవ్వాలి

**సెంట్రల్ వర్టిగో** : కొన్నిసార్లు తలతిరగడానికి మెదడులోని సమస్యలు లేక నాడీమండలం కారణం కావచ్చు. ఈ కారణాల వల్ల తలతిరిగితే సెంట్రల్ వర్టిగో అంటారు.

**1) సర్వైకల్ స్పాండిలోసిస్** : మెడనొప్పి ఉన్న వారికి నొప్పితో పాటు తలతిరగడం కూడా కొంతమందిలో ఉంటుంది. మెడ తిప్పినపుడు తలతిరిగి కొన్నిసార్లు తూలినట్టు అవుతుంది. వెన్నెముక ఎముకల మధ్యలో ఉండే డిస్క్ దెబ్బతిని నరాల మీద ఒత్తిడి వల్ల ఇలా జరుగుతుంది.

**2) పార్శ్వపునొప్పి** : ఈ వ్యక్తులలో ఒకవైపు తలనొప్పితో పాటు కొన్ని సార్లు తలతిరగడం కూడా ఉంటుంది. నొప్పితో పాటు వికారం, వాంతులు వంటి లక్షణాలుంటాయి. శబ్దాన్ని, కాంతిని భరించలేరు.

**పెరిఫెరల్ వర్టిగో** : ఇక్కడ తలతిరగడం చెవి సమస్యల వల్ల వస్తుంది.

**1) బిపిపివి (బినైన్ పారాక్సిస్మల్ పొజిషనల్ వర్టిగో)**: 32 శాతం మందిలో తలతిరగడానికి ప్రధాన కారణం ఇదే.

**2)మినియర్స్ డిసీజ్** : ఈ సమస్యలో తలతిరగడం, చెవిలో హోరుమని శబ్దాలు, వినికిడి తగ్గడం లాంటి మూడు లక్షణాలుంటాయి.

**హోమియో చికిత్స** : తలతిరగడం ఎందువల్ల వస్తుందో తెలుసుకోవాలి. ఈ లక్షణాలతో పాటు రోగి మానసిక, శారీరక లక్షణాలను తెలుసుకుని చికిత్స ఇవ్వాలి.

## సుఖవ్యాధులు ఇక బాధించవు

**గనేరియా** : యుక్తవయస్సు వారిలో ఎక్కువగా కనిపిస్తుంది. జననాంగాలు, నోరు, ఆనస్ వరకు వ్యాప్తి చెందుతుంది. భాగస్వామిలో ఒకరికి ఈ వ్యాధి ఉన్నా మరొకరికి సంక్రమిస్తుంది. గర్భిణిగా ఉన్నప్పుడు గనేరియా ఉంటే పిల్లలకు వచ్చే అవకాశం ఉంటుంది. మూత్రంలో మంట, ద్రవం కారడం, దుర్వాసన వంటి లక్షణాలు కనిపిస్తాయి. స్త్రీలలో నెలసరి మధ్యలో రక్తస్రావం, మూత్రనాళంలో మంట, గర్భకోశ వ్యాప్తి ద్వారా సంతానలేమి, అండాశయ వాపు, గర్భకోశ వాపు, ట్యూబులు మూసుకోవడం జరుగుతుంది.

**సిఫిలిస్** : శృంగారం ద్వారా వ్యాపించే మరో వ్యాధి ఇది. యోని, మలద్వారం,మూత్రాశయం, పురుషాంగం, నోరు వంటి ప్రదేశాల్లో వచ్చే అవకాశం ఉంటుంది. జబ్బు వచ్చినట్లు తెలియకుండానే ఇతరులకు వ్యాప్తి చెందడం జరుగుతుంది. పుండ్లు ఒకటి లేక రెండు, మూడు ఉండవచ్చు. పుండ్లు తగ్గినట్లే తగ్గి మళ్లీ తిరగబెడతాయి.

**ట్రైకోమోనియాసిస్** : శృంగారం ద్వారా వ్యాపించే ప్రోటోజువ పారసైట్ వ్యాధి. మూత్రకోశ ం , జననాంగాలకు వ్యాప్తి చెందుతుంది. యోని, మూత్రనాళంపై ప్రబావం ఎక్కువగా ఉంటుంది. పురుషాంగం, యోని భాగంలో మంట, దురద, కలయికలో ఇబ్బంది, మూత్ర విసర్జన సమయంలో బాధ వంటి లక్షణాలు కనిపిస్తాయి.

**హోమియోవైద్యం** : హోమియో వైద్యవిధానం ద్వారా సుఖవ్యాధులను సమూలంగా తరిమేయవచ్చు. ఎలాంటి దుష్ఫలితాలు లేకుండా చికిత్స అందించవచ్చు. రోగి శారీరక లక్షణాలు, మానసిక స్థితిని బట్టి చికిత్స అందించడం వల్ల మంచి ఫలితం ఉంటుంది. అనుభవజ్ఞులైన వైద్యుల పర్యవేక్షణలో చికిత్స తీసుకుంటే సుఖవ్యాధులు సమూలంగా పోతాయి.



# ఒత్తిడిని తరిమేద్దాం

**ఈరోజుల్లో 'ఒత్తిడి' అనే మాట ప్రతి ఒక్కరి నోటా ఏదో ఒక సందర్భంలో వినబడుతూనే ఉంటుంది. ఉరుకులు పరుగుల జీవితంలో ఇవన్నీ సర్వసాధారణమే కదా అని కొంతమంది లైట్ తీసుకుంటారు. అయితే ఇది సరికాదు. అధిక ఒత్తిడి మన ఆరోగ్యాన్ని దెబ్బతీస్తుందని మీకు తెలుసా ? ఇప్పటికే ఈ విషయం చాలా సర్వేల్లో వెల్లడైంది..**

వ్యక్తిగతంగా, వృత్తిపరంగా కారణమేదైనా అప్పుడప్పుడూ రకరకాల ఒత్తిళ్లకు గురవడం సహజం. అయితే పురుషుల కంటే మహిళలే ఎక్కువ ఒత్తిడికి గురవుతున్నారని పలు అధ్యయనాలు చెబుతున్నాయి. ఈ ఒత్తిడి వల్ల కొన్ని మానసిక, శారీరక ఆరోగ్య సమస్యలు వచ్చే అవకాశం ఉంది. ఎప్పుడైతే మనం ఒత్తిడికి గురవుతామో అప్పుడు శరీరంలో కార్టిసాల్ హార్మోన్లు విడుదల అవుతాయి. ఇవి రోగనిరోధక, జీర్ణవ్యవస్థలతో పాటు చర్మంపై ప్రతికూల ప్రభావం చూపుతాయి. ఇలా క్రమంగా మహిళల ఆరోగ్యంపై చెడు ప్రభావం పడి అవి దీర్ఘకాలిక ఆరోగ్య సమస్యలకు దారితీస్తాయి. అదే ఒత్తిడి కొన్నిసార్లు మంచి చేస్తుందని కూడా నిపుణులు చెబుతున్నారు. మరి ఒత్తిడి వల్ల వచ్చే సమస్యలు, అది ఏ విధంగా మేలు చేస్తుందనే అంశాలు మీరూ చదివేసేయండి!

### అజీర్ణ సమస్య

ఒత్తిడి వల్ల ఎదురయ్యే సమస్యల్లో అజీర్తి కూడా ఒకటి. జీర్ణవ్యవస్థ పనితీరుపై ఒత్తిడి బాగా ప్రభావం చూపిస్తుంది. దీనివల్ల జీర్ణవ్యవస్థలో ఆమ్లాలు ఎక్కువ మొత్తంలో విడుదల అవుతాయి. జీర్ణకోశంలోకి చేరిన ఆహారాన్ని ఈ ఆమ్లాలు జీర్ణం కానీయకుండా చేసి అసౌకర్యానికి గురిచేస్తాయి. వీటివల్ల కొన్ని సందర్భాల్లో అల్సర్లు వచ్చే అవకాశం ఉంటుంది. కాబట్టి ఒత్తిడికి ఎంత దూరంగా ఉంటే అంత మంచిది.

### ఆసక్తి ఉండదు

ఒత్తిడి పెరుగుతున్న కొద్దీ శరీరంలో కార్టిసాల్ హార్మోన్ స్థాయి పెరుగుతూ ఉంటుంది. ఇవి సెక్స్ హార్మోన్లను అణచివేయడంలో కీలక పాత్ర పోషిస్తాయి. ఫలితంగా లైంగికపరమైన కోరికలు తగ్గే అవకాశం ఉంటుందని నిపుణులు సూచిస్తున్నారు. కాబట్టి ఒత్తిడికి సాధ్యమైనంత దూరంగా ఉండడం మంచిది. అదేవిధంగా ఒత్తిడి తగ్గించడానికి శృంగారం ఒక ఔషధం లాంటిదని కూడా వారు సూచిస్తున్నారు.

### ఒత్తిడి వల్ల ఆకలి, ఊబకాయం

ఒత్తిడికి కారణమయ్యే ఎంజైమ్ పేరు ఆల్ఫా అమైలేజ్. ఈ ఎంజైమ్ వల్ల చాలామంది మహిళలు గర్భం ధరించలేకపోతున్నారని తాజా అధ్యయనం వెల్లడించింది. అలాగే శరీరంలో ఒత్తిడి పెరుగుతున్న కొద్దీ ఆకలి కూడా పెరుగుతుంది. తద్వారా ఎక్కువ మొత్తంలో ఆహారం తీసుకుని బరువు పెరిగే అవకాశం కూడా ఉంటుంది. ఫలితంగా ఊబకాయం సమస్య కూడా ఎదురుకావచ్చు. అలాగే మరికొందరిలో ఆకలి మందగించి

## ఒత్తిడి నివారణకు ప్రపంచ దేశాల కృషి

ప్రస్తుతం ఉరుకుల పరుగుల జీవనయానంలో మానసిక ఒత్తిడి అధికంగా ఉంటోంది. ఇది పెద్దవారిలో అంతగా బయట పడకపోయినప్పటికీ ఇతర అలవాట్ల కారణంగా తమలో ఉన్న ఒత్తిడిని వారు దూరం చేసుకుంటారు. కానీ యువత అలా కాదు తమలో జరిగే మానసిక సంఘర్షణ కారణంగా వారు ఒత్తిడికి లోనవుతున్నట్లు పైకి చెప్పరు. పైగా దానినుంచి బయట పడాలనే ఆలోచన కూడా రాదు. ఇలాంటి పరిస్థితి రాబోయే రోజుల్లో ఆరోగ్యపరమైన సమస్యలకు సంకేతమని మానసిక నిపుణులు సూచిస్తున్నారు. వారు తీవ్ర ఒత్తిడికి గురైనప్పుడు ఒంటరితనం కోరుకుంటారని, తల్లిదండ్రులు అది గుర్తించి పిల్లలపట్ల సానుకూలంగా వ్యవహరించాలని సూచించారు. ఒత్తిడి దరిచేరకుండా పిల్లల్ని కూడా మీతో పాటే ధ్యానం, యోగా చేయమని ప్రోత్సహించాలని నిపుణులు సూచిస్తున్నారు. ఆధునిక మానవుడిపై ఒత్తిడి వల్ల కలిగే ప్రభావాన్ని గుర్తించి ప్రపంచ దేశాలన్నీ దానిని అరికట్టేందుకు ప్రత్యేక రోజులను కేటాయించుకుని ప్రజలకు అవగాహన కలిగిస్తున్నాయి.

బరువు కూడా కోల్పోవచ్చు.

## నెలసరి సమస్యలు

ప్రస్తుతం మారుతున్న జీవనశైలి, అలవాట్ల కారణంగా శరీరంలో హార్మోన్ల సమతౌల్యం దెబ్బ తింటుంది. ఫలితంగా స్త్రీలలో ఋతుక్రమం ముందూ వెనుకా ఆలస్యంగా రావడం జరుగుతుంది. ఇలాంటి సమస్యల వల్ల క్రమంగా బరువు పెరిగే అవకాశం ఉంటుంది. ఈ సమస్యవల్ల చాలామంది మహిళలు మనోవేదనకు గురవుతున్నారు. అంతేకాదు ఈ సమస్య మరీ ఎక్కువైతే గుండెపోటు వచ్చే ప్రమాదం ఉందంటున్నాయి కొన్ని అధ్యయనాలు.

## నిద్ర పట్టకపోవడం

ఒత్తిడితో బాధపడుతున్నప్పుడు ఏ పనీ చేయాలనిపించదు. రాత్రిళ్లు నిద్ర కూడా సరిగ్గా పట్టదు. ఏదో ఒక విషయం గురించి ఆలోచిస్తూ ఒత్తిడిని మరింత పెంచుకోవడానికే చూస్తుంటారు. దీనివల్ల సరిపడా నిద్రలేక రోజంతా నీరసంగా, డల్‌గా అనిపిస్తుంటుంది. తద్వారా ఏపనీ శ్రద్ధగా చేయలేం. కాబట్టి ఇలాంటి సమస్యలు దరిచేరకూడదంటే ఒత్తిడికి దూరంగా ఉండడం మంచిది.

## హెయిర్‌ఫాల్, చర్మ సమస్యలు

ఒత్తిడి వల్ల శారీరకంగానే కాదు మానసికంగా కూడా కుంగిపోయే ప్రమాదం ఉంటుంది. ఇది జుట్టు, ఆరోగ్యంపై ప్రతికూల ప్రభావం చూపిస్తుంది. ఎక్కువ జుట్టు రాలిపోవడానికి కారణమవుతుంది. ఒత్తిడి వల్ల శరీరంలో కార్టిసాల్ హార్మోన్ స్థాయి రెట్టింపవుతుంది. ఇది పెరిగేకొద్దీ శరీరం నుంచి వెలువడే నూనెల ఉత్పత్తి మరింత ఎక్కువై మొటిమలు లేదా ఇతర చర్మసంబంధిత సమస్యలు బాధిస్తాయని మరో అధ్యయనంలో వెల్లడైంది.

## ఒత్తిడి మంచిదే !

ఒత్తిడి మానసికంగా, శారీరకంగా కుంగదీస్తుందన్న విషయం తెలిసిందే. అయితే ఒత్తిడివల్ల కొన్నిసార్లు మంచికూడా జరుగుతుందట. అయితే ఇది సాధారణ స్థాయిలో ఉన్నప్పుడే. సాధారణ స్థాయి అంటే మరీ ఎక్కువగా కాకుండా మరీ తక్కువగా కాకుండా ఉండాలన్నమాట.

## ఏకాగ్రత పెంచే ఒత్తిడి!

నిర్దేశిత సమయంలో ఒక పని పూర్తి చేయాలంటే ఏకాగ్రత, శ్రద్ధ ఎంతో అవసరం. అనుకున్న సమయంలోపు పని పూర్తి చేయాలన్నప్పుడు మానసికంగా కొంత ఒత్తిడికి లోనవుతాం. ఫలితంగా ఎక్కువ ఏకాగ్రత, శ్రద్ధతో వేరే విషయాలమీద దృష్టి పెట్టకుండా దృష్టంతా ఆ పనిమీదే కేంద్రీకరిస్తాం. దాంతో పని చక్కగా పూర్తవుతుంది. అంటే నిర్దేశిత సమయంలో అనుకున్న పనులు పూర్తి కావడానికి కాస్తంత ఒత్తిడి కూడా తన వంతు సహకారం అందిస్తుందన్నమాట. అంతేకాదు, జ్ఞాపకశక్తిని పెంపొందించడంలోనూ ఇది బాగా తోడ్పడుతుందట.

## మానసిక నియంత్రణ

సాధారణంగా అధిక ఒత్తిడి ఎదురైనప్పుడు మనసు మన నియంత్రణలో ఉండదు. కానీ మధ్యస్థ స్థాయి ఒత్తిడి వల్ల మానసిక నియంత్రణ సాధ్యపడుతుంది. దీనికి మెదడు విడుదల చేసే ఎపినెఫ్రిన్, నారెపినెఫ్రిన్, కార్టిసాల్ వంటి హార్మోన్లే కారణం. ఇవి శారీరకంగానే కాదు మానసికంగా కూడా మనల్ని మనం నియంత్రించుకునేలా చేస్తాయి.

## గుండె పనితీరు మెరుగు !

ఒత్తిడి మితిమీరినప్పుడు ఎలాంటి సమస్యలు తలెత్తుతాయో మనందరికీ తెలుసు. అయితే సాధారణ ఒత్తిడివల్ల చక్కని ఆరోగ్య ప్రయోజనాలు కలుగుతాయట. రక్తప్రసరణ సక్రమంగా జరిగి గుండె పనితీరు మెరుగుపడటమేకాదు, వ్యాధి నిరోధక శక్తి కూడా పెరగడంవల్ల ఎలాంటి ఇన్ఫెక్షన్లూ దరి జేరవంటున్నారు నిపుణులు.

## లక్ష్యసాధనకు దోహదం

సమయానికి అనుకున్న పనులు పూర్తి చేస్తే మనకు సంతృప్తిగా అనిపిస్తుంది. ఫలితంగా నిర్దేశిత లక్ష్యాలు చేరుకోవడానికి తగిన ఉత్సాహం మనకు లభిస్తుంది. దాంతో ఎంత శ్రమైనా సరే ఇష్టంగా కష్టపడి అనుకున్న లక్ష్యాలు సాధించే వీలు కలుగుతుంది. అలాగే ఈవిధంగా మానసిక సామర్థ్యం కూడా బాగా మెరుగవుతుంది.

## సృజనాత్మక ఆలోచనలు

ఒత్తిడిలో ఉన్నప్పుడు చేసే పనిమీదే మొత్తం దృష్టి సారిస్తాం. ఓ మాదిరి ఒత్తిడి ఉన్నప్పుడు పని పూర్తి చేసేందుకు ఉపకరించే కొత్త మార్గాల కోసం మెదడు అన్వేషిస్తుందట. ఈ క్రమంలో సృజనాత్మకంగా ఆలోచించే తీరు అలవడుతుందనీ, దీనివల్ల పని మరింత విభిన్నంగా అనుకున్నదానికంటే బాగా వస్తుందనీ అంటున్నారు నిపుణులు.

**–సంతోషలక్ష్మి దహగాం**



## ఇవి తింటే...

సమతులాహారం తీసుకోవడం వల్ల ఒత్తిడిని కొంతలోకొంతైనా తగ్గించుకోవచ్చని నిపుణులు చెబుతున్నారు. అందుకే ఒత్తిడిని తగ్గించుకోవాలంటే ఎలాంటి ఆహారం తీసుకోవాలో తెలుసుకుందామా?!

### ఓట్స్

ఓట్స్‌లో ఉండే కార్బోహైడ్రేట్లు మన శరీరంలో సెరటోనిన్ ఉత్పత్తిని మెరుగుపరుస్తాయి. ఇందులో ఉండే పొటాషియం, మెగ్నీషియం రక్తప్రసరణను అదుపులో ఉంచుతాయి.

### పాలు

పాలలో ప్రోటీన్లు, విటమిన్ డి, బి కాల్షియం, మొదలైనవి ఉంటాయి. వీటివల్ల కూడా ఒత్తిడి నుంచి ఉపశమనం పొందవచ్చు. నిద్రపోయే ముందు పాలు తాగితే మనసుకు ప్రశాంతత చేకూరి నిద్ర బాగా పడుతుంది. కొవ్వు తక్కువగా ఉన్న పాలను ఉదయం బ్రేక్‌ఫాస్ట్‌లో భాగంగా తీసుకుంటే మంచిది. పెరుగు వల్ల కూడా ఒత్తిడి నుంచి ఉపశమనం పొందవచ్చు. ఇందులో ఉండే విటమిన్ బి నెర్వస్‌నెస్‌ను తగ్గిస్తుంది.

### బ్లాక్ టీ

బ్లాక్ టీ తాగడం వల్ల ఒత్తిడి నుంచి తక్షణ ఉపశమనం పొందవచ్చు. ఓ పరిశోధన ప్రకారం ఇతర పానీయాలు తాగిన వారికంటే రోజుకు 4 కప్పుల బ్లాక్ టీ తాగిన వారే ఒత్తిడి ఎదురైన సందర్భాల్లో ప్రశాంతంగా ఉన్నట్లు గమనించారు.

### పండ్లు

ద్రాక్ష, నారింజ, బత్తాయి, జామకాయ వంటి విటమిన్ సి ఉండే పండ్లు ఎక్కువ తింటే, ఒత్తిడిని తగ్గించడంలో తోడ్పడతాయి, రోగనిరోధక శక్తిని మెరుగుపరుస్తాయి. బొప్పాయి పండులో ఉండే కెరోటిన్ పదార్థం శరీరాన్ని, మనసును ప్రశాంతంగా ఉంచుతుంది. ఇంకా దీనిలో ఉండే విటమిన్ సి, డి మినరల్స్, పీచు పదార్థాలు గుండెను ఆరోగ్యంగా ఉంచుతాయి. అలాగే టెన్షన్‌లో ఉన్నప్పుడు అరటిపండు తినడం కూడా మంచిది. ఇందులోని టిప్టోఫాన్ మన శరీరంలో సెరటోనిన్‌ను ఉత్పత్తిచేసి ఒత్తిడిని తగ్గిస్తుంది.

### డార్క్ చాక్లెట్

ఇది బీపీని అదుపులో ఉంచి ఒత్తిడి తగ్గిస్తుంది. డార్క్ చాక్లెట్‌లో ఉండే పాలీఫినాల్స్, ఫ్లేవనాల్స్ అనే రెండు రకాల యాంటీ ఆక్సిడెంట్లు ఒత్తిడిని తగ్గించి ప్రశాంతత చేకూరుస్తాయి. వారానికొక చాక్లెట్ తింటే ఎంతటి ఒత్తిడి నుంచైనా ఉపశమనం లభిస్తుంది. బరువు కూడా తగ్గొచ్చు.

### దుంపలు

దుంపల్లో అధిక మొత్తంలో ఉండే పీచు పదార్థం, కార్బోహైడ్రేట్లు, సెరటోనిన్ ఉత్పత్తికి ఉపయోగపడతాయి. చిలగడ దుంపలు, క్యారెట్లలో విటమిన్లు, మినరల్స్ పుష్కలంగా ఉంటాయి. ఇవి మన గుండె రక్తప్రసరణ వ్యవస్థకు మంచివి. అలాగే ఆకుకూరల్లో అధికమొత్తంలో ఉండే మెగ్నీషియం, మినరల్స్, ఫైబర్ శరీరానికి అధిక శక్తినిస్తాయి.

### గింజలు, ధాన్యాలు

వీటిలో ఒమేగా 3, ఒమేగా 6 ఫ్యాటీ ఆమ్లాలు ఎక్కువ మొత్తంలో ఉంటాయి. ఇవి ఒత్తిడి నుంచి రక్షణనిస్తాయి. జీడిపప్పు, పొద్దుతిరుగుడు గింజలలో ట్రిప్టోఫాన్ ఉంటుంది. ఇది సెరటోనిన్‌ను ఉత్పత్తి చేస్తుంది. తద్వారా ఒత్తిడి తగ్గుతుంది.

# వెన్నెల తోవ

కన్నేగంటి అనసూయ

**చల్లని వేసవి సాయంవేళ...!**

**ఊరి నడిబొడ్డులో జుట్టు విరబోసుకుని తిష్టవేసిన అమ్మోరిలా అక్కడంతా ఆవరించిన తురాయిచెట్టు పైన పిట్టల్తో, కింద పిల్లల్తో, నిండు గోదాట్లో నిలకడగా ఉన్న లాంచీలా ఉంది.**



బళ్ళు తెరిచే రోజులు దగ్గర పడుతుండడంతో కుర్రాళ్ళలో జోరు పెరిగిందేమో.. గోళీలో, బచ్చాలో, కబడ్డీయో, కర్రసామో... వాళ్ళిష్టం. ఆడేవాళ్ళకి ఒక్కటే ఆట. ఆడని వాళ్ళకి అన్నీ ఆటలే అన్నట్టు అక్కడంతా ఒకటే సందడి.

తోటివాళ్ళు గోళీలాడ్డం చూస్తూ కదలబుద్ధి కాక షుణ్ణామణ్ణాకు పొట్లం జేబులోకి తోసేస్తూ కాళ్ళకి పగ్గాలేశాడు గోపి. పొలాల్లో ఎంతసేపు ఆడినా తురాయిచెట్టు కింద ఆటల్లోని మజాయే వేరని వాడికి తెలుసు.

నిజానికి ఈ సమయానికి గేదెల్ని మేపుతూ పొలానే ఉండేవాడు. కానీ నెల్లాళ్ళనాటి గొడవకి దీపాలు పెట్టే వేళకంతా ఇంట్లో ఉండాలని తండ్రి హుకుంతో పెందలాడే తోలుకొచ్చేస్తున్నాడు గొడ్లని.

# నవ్యవీక్లీ-ఉపాధ్యాయుల భాస్కరరావు స్మృతి సాహితి కథల పోటీలో తృతీయ బహుమతి రూ.7,000 పొందిన కథ

వచ్చాక నీళ్ళు తోడి కుడితొట్టి నింపి చిట్టూ, తౌడు, ఉలవలూ కలగలిపి తట్టల్లోకెత్తి పాలు తీసేవేళకి గొడ్లచావిడి అంతా శుభ్రం చేసుంచాలి. అప్పటికి పొలాన్నించి మూర్తయ్య వచ్చి, నాలుగు చెంబుల నీళ్ళు ఒంటిమీద గుమ్మరించుకుని పాల తెపాళతో పొదుగు దగ్గర చేరతాడు.

తళతళలాడే ఇత్తడి పాల తెపాళ ఆ కాసేపూ అతని చేతిలో అమ్మ ఒడవుతుంది.

అయితే, ఆరోజు గేదెల్ని తోలుకుని గోపి వచ్చే సరికి రత్తమ్మ మూలింట్లో మడత మంచంమీద పడు కుని మూల్గుతోంది.

ముందురోజు రాత్రి బాగా పొద్దుపోయాక పాలు కాచిన పొయ్యిలో కణకణలాడుతున్న చింత నిప్పుల్ని చూసి లావాటి చిలకడదుంపని నిప్పుల్లో కూరి పడుకుందేమో. తెల్లారేపాటికి మెత్తగా ఉడికి ఉబ్బిన తొక్కతో పాకం తేరిన దుంపని చూసి నోట్లో నీళ్ళూరి పరగడుపునే పచ్చి మంచినీళ్ళన్నా తాక్కుండా తినేసింది. దాంతో కడుపు బలువారం చేసి నొప్పి మొదలైంది. పదే పదే పాయిఖానాఆకి వెళ్ళొచ్చినా పనవ్వక, కాసిన్ని షుణ్ణామణ్ణాకులు వేణ్ణీళ్ళల్లో మరి గించి తాగితే విరోచనమై కడుపు తేలికవుతుందని పొలాన్నించి వచ్చిన కొడుకుని పచ్చి మంచినీళ్ళన్నా తాగనివ్వకుండా కొట్టుకాడికి పంపింది.

తురాయిచెట్టు గాలి సోకందే భద్రం కొట్టు రాదు.

"ఏరా.. కొడ్తావా...? పిక్కినీలు ఆడావంటే డిప్ప లేచిపోద్ది, ఒక్కజాన తీసి మళ్ళీ కొట్టు..." వీడిలోనూ అదే పౌరుషం.

"చూసినోడివి కాయ కొట్టేటప్పుడే చెప్పాలి. పిక్కినీలాడేది నువ్వు".

"పిక్కినీలు నీవా? నావా? పుచ్చు పగిలిపోద్ది కొట్టేనంటే" బలంగా ఒక్కతోపు తోశాడు రాము.

"దాంతో వెనక్కెళ్ళి పడ్డా, అంతలోనే గోడ క్కొట్టిన బంతిలా లేచొచ్చి....

"ఏరా గోపీ... నేనొక్కజానే కదరా తీసింది? చూసేవ్ గదా? వాడికి చెప్పు...రా" గోపీతో అంటూ అంతలోనే ఆగిపోయి, "ఒరేయ్ అటుచూడరా' అన్నాడు గోపీతో వాడి వెనక వైపే దూరంగా చూస్తూ. అలా చూస్తున్నకొద్దీ డబ్బులతో నిండుగా ఉన్న లెదర్ వాలెట్ కళ్ళముందు కదలాడి రెప్ప వేయటం మర్చి పోయాడు బాసిగాడు.

వెనక్కిచూశాడు గోపి. పైకి ఎగ్గట్టిన పంచెతో వడివడిగా ఇటే వస్తున్న తండ్రిని చూసి గోపీ గుండె గుబేల్మంది. "కసువు ఊడ్వలేదని గాబోలు. చింత బరికెలతో శివతాండమే ఇంక.." గొణుక్కున్నాడు తన్లో తనే.

"ఒరేయ్...! ఆ రోజు వాళ్ల దగ్గర్నించి నువ్వేదో తీసేసేవ్ గదా?" గురి చూసి వాడు వదిలిన బాణం గోపి గుండెల్ని చీల్చింది. అలా ఎందుకు అంటు

రాము షర్ట్ పట్టుకున్నాడు.

గోపీ చూపులన్నీ అటే ఉన్నాయ్. అర్జునుడికి పక్షికన్ను మాత్రమే లాగా గోపీకి ఆ బుల్లెట్బాయనే కనిపిస్తున్నాడు. అతన్నలా చూస్తున్నకొద్దీ వాడి కళ్ళల్లో మెరుపు. ఆరోజు ఏం జరిగిందో కళ్ళముందు కదలాడింది వాడికి.

***

గవర్నమెంట్ వాళ్ళు ఎరువుల బస్తాలు ఇస్తా మంటే ఆ రోజు మూర్తయ్య ఫస్ట్ బస్కే పట్నం వెళ్ళి పోయాడు. రోజూలాగే ముంత భుజాన్నేసుకుని, గొడ్లని తోలుకుంటూ పొలానికి బయల్దేరాడు గోపి.

నిజానికా పని మూర్తయ్యది. సెలవులప్పుడు పిల్లల్ని ఊరకనే వదిలేస్తే కట్లు విప్పుకున్న గొడ్డుకీ, వీళ్లకీ తేడా ఉండదని మూర్తయ్య భయం. అందుకే సెలవులిస్తే చాలు పిల్లాడు పొలానికే.

మూర్తయ్యకి ఒక్కడే కొడుకు. తను పోయేలోగా పదిసెంట్ల భూమైనా పలపర్చలేనాని మూర్తయ్య ఆశ. అందుకే ఉన్న రెండు ఎకరాలకి తోడు మరో నాలుగెకరాలు కౌలుకి తీసుకున్నాడు. అది కాకుండా రోజుకి అయిదారు శేర్ల పాలు అమ్ముకానికుంటాయి. పై ఖర్చులకి అవి సరిపోతాయ్. పిడకలమ్మితే వచ్చే డబ్బులు వేరే. తూర్పున తొలికిరణంతోనే గడపలో పైసలు గలగలలాడతాయ్. సాయంత్రమూ అంతే. ఏ రోజువారోజే. వెల్తురొచ్చే వేళా, పోయేవేళా వాకిట్లోకి వచ్చిన లక్ష్మీదేవి ఎక్కడికీ పోదని రత్తమ్మ నమ్మకం.



తిరిగెళుతూ ఉత్సాహంకొద్దీ బాసి, రాము గోళీలాట ఆడుతుంటే అక్కడే నిలబడి కళ్ళార్పకుండా చూస్తున్నా డేమో... అంతలోనే వాళ్ళిద్దరి మధ్య రేగిన గిల్లి కజ్జాకి ఉసూరుమంది గోపి మనసు.

"రెండు జానలు తీసేవ్. నేనొప్పుకోను" అంటున్న రాము మీది మీదికి వెళుతున్నాడు బాసిగాడు నిక్క బొడుచుకున్న ఈకల్తో ఎగిరెగిరిపడుతున్న పందెం కోడిపుంజులా.

న్నాడో క్షణకాలం అర్థం కాలేదు వాడికి. అయినా.. దొంగ అనేసరికి కోపం వచ్చి "ఏంట్రా కూసేవ్" పిడికిలి ఎత్తబోయి ఆగాడు. ముందు నుయ్యి వెనక గొయ్యిలా ఉంది వాడి పరిస్థితి.

"తియ్యకపోతే ఆ బుల్లెట్టోడు ఇప్పుడెందుకు వస్తున్నాడు? నా వైపు కాదు. అటుచూడు. మీ నాన్న వెనుక ఎవరు వస్తున్నారో? చింతబరికెలతో సినిమా చూపిస్తాడిప్పుడు మీ నాన్న మా అందరికీ. అప్పుడు చెబుదూగాని.. నేనెన్ని జానలు తీసేనో... కసిగా అని రామువైపు తిరిగి,

"వీడో పెద్దదొంగ. వాళ్ల నాన్న తట్లు తేలేటట్టు కొడతాడు చూడు ఇప్పుడు. వీడా నీకు సాక్ష్యం? ఇవ్వరా గోళీ? ఇవ్వకపోయావో.. నా చేతుల్లో అయి పోతావ్... నా కొడకా?" అంటూనే విసురుగా వెళ్ళి

పైసల గలగలలే కాదు గిన్నెలూ, కేన్లూ కూడా సవ్వడి చేస్తాయక్కడ. అవన్నీ వింటూ అమ్మవారు వచ్చినట్లే మురిసిపోతుందామె.

కర్రతో గేదెల్ని అదిలిస్తూ పొలాలకేసి నడుస్తు న్నాడు గోపి.

చేలగట్లని చేరేవరకే...! చేరాక ఏ చెట్టు నీడనో చేరటమే గొడ్లని చూస్తూ. మెల్లమెల్లగా ఒక్కొ క్కళ్ళూ వస్తున్నారక్కడికి. గొడ్లు చేలగట్లమ్మటో, పుంతల్లోనో మేస్తూ ఉంటే పిల్లలంతా ఆటల్లో మునిగి తేల్తారు. అదైనా బాసిగాడు వచ్చేవరకే. వాడు వచ్చాడంటే పంగలకర్రని చూసి పారిపోయిన పిట్టల్లా దూరదూరంగా పోతారంతా. చెరుకుదవ్వో, గడ్డో, దుంపరొట్టో, పెసరొట్టో ఏది కనపడితే దాని మీద పడతారు కొడవలితో. తెంపరితనంతో ఎవ్వ రన్నా, ఏమన్నా భయంలేని వాడంటే వీళ్లకి ఒకటికే.

ఊరందరిదీ ఒకదారీ, ఉలిపిరికట్టెది ఒకదారి అన్నట్టు కుర్రాళ్ళంతా గొడ్లని దారిపక్కనో, చేల గట్లమ్మటో మేపితే బాసిగాడు వాడి గొడ్లు చేలల్లో పడ్డా పట్టించు కోడు. రైతులు వాడి గొడ్లని ఎన్నిసార్లు బందుల దొడ్లో బంధించారో లెక్కేలేదు. వాడూ అంతే. కాసిన కాయేకాదు. పూసిన పువ్వైనా సరే పిందనీ లేదు. పచ్చిదనీ లేదు. కళ్ళబడిందంటే కోసెయ్యాల్సిందే.

తెలిసి తొక్కినా, తెలవక తొక్కినా కంపు కంపే నని వాడి జోలికి రారు ఎవ్వరూ.

ఆరోజు అప్పుడప్పుడే చీకటి పడుతోంది. అప్ప టికే గొడ్ల కాపర్లంతా ఇళ్ళకి వెళ్ళిపోయారు. గోపి మోపులో కాసిన్ని గడ్డిపరకలు ఎక్కువయ్యాయ్. దాంతో సాయం కోసం చూస్తున్నాడు. సరిగ్గా అప్పుడే వచ్చాడు బాసిగాడు గేదెల్ని తోలుకుంటూ. వస్తూనే జేబులోంచి చింతగింజలూ, గులకరాళ్ళూ, బత్తాయి తొక్కలూ తీసి దోసిలిలో ఆడిస్తూ "రా...రా... ఓ ఆటేద్దాం..." అన్నాడు గోపీనే చూస్తూ.

"పిచ్చెక్కిందేట్రా....! చీకటి పడుతుంటే ఆటలా? ఒక చెయ్యేయ్" అన్నాడు గోపి ముందుకి వంగుంటూ.

"ఆడమంటే ఆడవుగానీ నేను మోపెత్తాలా నీకు?" వెటకారంగా అన్నాడు వాడు. వాడికి కోపంగా ఉంది.

"వీడి నోట్లో నోరెట్టడం అంటే నా ముఖాన నేను ఉమ్ముకున్నట్టే" గొణుక్కున్నాడు గోపి.

చిక్కనిచీకట్లో అప్పుడప్పుడు స్వరాన్ని సవరించు కుంటున్న కీచురాళ్ళు, ఉండుండి దూరం నుంచి వినిపిస్తున్న నక్కల ఊళలు. గోపి ఆడననేసరికి చేసేదేం లేక ఇంటికి పోదామని గేదెల్ని అదిలిస్తుం డగా..... సన్నగా మొదలై అంతకంతకీ పెద్దదవుతూ ఇటే వస్తూన్న సైలెన్సర్ బిగించిన రాయల్ ఎన్ఫీల్డ్ బుల్లెట్టు శబ్దం. ఆ బండన్నా, డబ్ డబ్ మనే ఆ శబ్ద మన్నా పిచ్చి బాసిగాడికి. అంత చీకట్లోనూ తళు క్కున మెరిశాయి వాడి కళ్ళు. దాంతో రెప్ప వెయ్య కుండా అటే చూడసాగాడు. అలా చూస్తున్న కొద్దీ ఒక్క బుల్లెట్టే కాదు దాని వెనుక మరో బండేదో ఉందని లైట్లని బట్టి అర్థమై మరింత ఆసక్తిగా గమ నించసాగాడు. అడపా దడపా ఆ దార్లో వచ్చే బళ్లంటే వాళ్లందరికీ అదో ఉత్సాహం.

వేగంగా దూసుకొస్తున్నాయవి. ఒకదాన్నొకటి దాటెయ్యాలని పోటీ పడుతున్నట్టుంది, ఉండుండి ముందూ, వెనకా అవుతున్న ట్రక్కూ, బుల్లెట్ల లైట్లు గమనిస్తుంటే ఆ యావలో పెరుగుతున్న దూకుడు మోగుతున్న హారన్లు! పోటీ! ఒకటే పోటీ...! పుంత రోడ్డలో గుంతలెక్కువని తెలిసినా వేగం తగ్గలే దిద్దరూ...!

అటుగా ఏడెనిమిది ఊళ్ళకి వెళ్ళాలంటే ఆ పుంతరోడ్డే దగ్గర దారి. గతుకుల భయంతో ఇటు రారు అంతే. గుంతల్లో పడ్డారంటే మంచాన పడా ల్సిందే. అందుకే దూరమైనా చుట్టు తిరిగే వెళతారు.

మోపు సంగతి మరిచేపోయాడు గోపి. వాడి లోనూ అదే ఆసక్తి. వేగంగా వస్తూ, బళ్ళు దగ్గరవు తున్న కొద్దీ కళ్ళల్లోకి కొడుతున్న హెడ్‌లైట్లు, చూస్తున్న కొద్దీ ఉత్సాహాన్ని ఆపుకోలేక, కోపాన్ని మరచి "ఆ బుల్లెట్టోడు చూడరా గోపి! కట్టు తెంపుకున్న ఆంబో తులా ఎలా గుంతల్లో పడతా లేస్తా దూసుకొస్తు న్నాడో...! ఆ ట్రక్కువాడు లేకపోతేనా.. నా సామి రంగా.." అంటూ బాసిగాడు ఇంకా ఏదేదో చెప్ప బోతుంటే... ఆ సింగిల్ రోడ్డులో ట్రక్కువాణ్ణి దాటె య్యాలనే ఆత్రుతలో కుడివైపు నుంచి ఓవర్ టేక్ చెయ్యబోయాడేమో, సరిగ్గా అదే సమయంలో ట్రక్కా యన కూడా కుడివైపు టర్న్ తీసుకునేసరికి, గుద్దెద్దు చేలో పడ్డట్టు దూసుకుని వచ్చేసిన బుల్లె ట్టోణ్ణి బలంగా కొట్టేసింది ట్రక్కు.

అంతే...! ఆ తగిలిన వేగానికి బుల్లెట్టెల్లి చెట్టు క్కొట్టింది. క్షణంలో ఫెటేల్మని శబ్దం చేస్తూ చూస్తుం డగానే చెల్లాచెదురుగా పడిపోయారు బండిమీద కూర్చున్న వాళ్లంతా. భయంతో వేగం పెంచాడు ట్రక్కువాడు.

తెల్లబోతూ ముఖాముఖాలు చూసుకున్నారు ఇద్దరూ. పడీ పడటంతోనే బండి లైట్లు ఆరిపోయా యేమో కన్ను చించుకున్నా కానరాని చీకటి అక్క డంతా. చీకట్లో చుట్టూ ఒకటే మూలుగులు. పసి బిడ్డ ఏడుపు ప్రాణాల్ని పిండేస్తుంటే కళ్ళముందు జరిగిన ఘోరానికి బెదిరిపోయారు. దిక్కుతోచక ఏడుపు వినవచ్చిన వైపల్లా తలతిప్పి చూస్తుండి పోయారు.

ఇంతలో కాళ్లకి వెచ్చగా తగిలిందేదో బాసిగా డికి. గబుక్కున కాలెత్తి పామి చూస్తే రక్తం.

"ఒరేయ్... రక్తంరా!..." బాసిగాడిలో ఒణుకు.

**కన్నుపొడుచుకున్నా కానరాని చీకటి. రక్తపు మడుగులో తల్లీ పసిబిడ్డా! ఆ పక్కనే అచేతనంగా భర్త. గుక్కెడు మంచినీళ్ళు కూడా అక్కడ లేవు. పసిబిడ్డ ఏడుపులు, తల్లి మూలుగులు... ఆ పుంతరోడ్డులో ప్రమాదానికి ఓ ఇద్దరు స్నేహితులే సాక్ష్యం. ఏదో ఒకటి చేసి వాళ్ళకి సాయం అందించాలి, కానీ ఆ క్షణంలో స్నేహితుల మధ్య సంఘర్షణ రేగింది! ఎందుకా సంఘర్షణ? అసలింతకీ ఆ తల్లీబిడ్డల్ని ఎవరు రక్షించారు?**

అప్పటికి చీకటికి అలవాటు పడ్డారేమో, పక్కనే ట్రక్కువాడితో పోటీపడ్డ బుల్లెట్ నడిపినాయన ఒళ్ళు తెలియకుండా పడున్నాడక్కడ. టెంకాయల్లే పగిలిపోయిన తలలోంచి ఉబికిఉబికి వస్తోంది రక్తం. అతనికి ఏడెనిమిది అడుగుల దూరంలో పడుందామె. మూతి దగ్గర బాగా తగిలినట్టుంది. పళ్ల గుత్తి బయటికి వచ్చేసి భయానకంగా ఉంది చూడటానికి. అదేపనిగా వినిపిస్తున్న పిల్లాడి ఏడు పుకి లేవాలన్నా లేవలేక పక్కకి పడిపోతోంది. గుక్క పట్టాడు వాడు. మామూలుగా అయితే ఆవిడకి తగిలిన దెబ్బకి పడిన వెంటనే స్పృహ తప్పాలి! కానీ ఎంతయినా తల్లి మనసు కదా...! ఒక పక్కన కళ్ళు మూతలు పడిపోతున్నా, పేగుబంధమో, ఏమో గానీ బలవంతంగా కళ్ళు తెరవాలని ప్రయత్నిస్తూ ఏడుస్తున్న పిల్లాణ్ణి తీసుకురమ్మన్నట్టు ఆమె నోటి నుంచి రక్తం జిగురుగా కిందకి కారుతూ పళ్లగుత్తి వేళ్లాడుతున్నా నొప్పిని భరిస్తూనే ఏదేదో చెప్పాలని ప్రయత్నించింది.

బీభత్సంగా ఉన్న ఆ దృశ్యం చూసి దగ్గరకి వెళ్ళాలంటే భయమేసి ఒకళ్ళ నొకళ్ళు గట్టిగా వాటేసు కున్నారిద్దరూ. ఎవరితోనన్నా చెబుదామన్నా అలికిడే లేదు. దరిదాపుల్లో ఎవరైనా ఉన్నా వచ్చేసేవాళ్ళే. గుక్క తిప్పుకోలేక పోతున్నాడు పిల్లాడు. చేతిలో చెయ్యేసి గట్టిగా పట్టుకుని అటుగా నడిచారు.

విసురుగావెళ్ళి తుప్పల్లో పడ్డాడేమో వాడి ఒళ్లంతా ముళ్ళు. కంపలన్నీ కొడవల్తో పక్కకి లాగేసి ముళ్ళున్నా లెక్కజెయ్యక గబుక్కునెళ్ళి పసి పిల్లాణ్ణి భుజాన్నేసుకుని తుండుగుడ్డ కప్పాడు గోపి. వాడినలా పట్టుకునే అక్కడే పడున్న ఆయమ్మ దగ్గరకెళ్ళి, గబుక్కున్న కింద కూర్చుండి పోయేడు. అలా కూర్చునే ఏడుస్తున్న పసివాణ్ణి మెల్లగా తన కాళ్లమీద పడుకోబెట్టుకుని అంత చీకట్లోనూ సుతా రంగా వాడి ఒళ్లంతా తడుముతూ మెల్లగా ముళ్ళన్నీ లాగేసేడు. అలా తియ్యకపోతే మరిం తగా లోపలికి గుచ్చుకుపోతాయని వాడి భయం. వాడు ఏడుస్తున్నా పట్టించుకోలేదు గోపి.

వాడి ఒళ్ళంతా రక్తపుముద్దలా ఉంది చూడ టానికి. చుట్టూచుట్టిన తుండుగుడ్డతో రక్తమంతా తుడిచేసి ఒంటిమీద చొక్కావిప్పి మడచి ఆవిడ పక్కన పరిచి, పిల్లవాణ్ణి దాని మీద పడుకో బెట్టాడు. పగిలిన ముఖం అప్పటికప్పుడు ఉబ్బ



టంతో చెంపలు కళ్ళకి అడ్డం రాగా ఏడుస్తున్న పిల్లాణ్ణి హత్తుకుందామన్నా అప్పటికే విరిగిపోయిన నడుం సహకరించక లేస్తోంది, పడుతోంది. పడుతోంది లేస్తోంది. ఆ పోరాటంలో సైగల్ని బట్టి ఆమె ఆరాటాన్ని అర్థం చేసుకున్న గోపి, భుజాన్ని వేలాడుతూ ఆమె వీపుకిందున్న హేండ్‌బాగ్ లోంచి ఫోన్ తీసి ఇచ్చాడు. అతికష్టం మీద ఏదో నంబర్ నొక్కిందెవరికో. తెల్లబోయి చూశారిద్దరూ... ఒకంకె ఫోన్నెంబర్లు కూడా ఉంటాయా అన్నట్టు.

సెల్‌ఫోన్‌లో ఏదో చెప్పాలని చెప్పలేక ఎక్కెక్కి పడుతూ, అంతలోనే తల పక్కకి వాల్చేస్తూ... "నీ... నీల్" అని గొణిగింది నాలుకనాడిస్తూ....! నాలుకంతా రక్తమే...! ఈలోపు ఫోన్లో ఎవరో అవతల్నించి హలో హలో అనటం వినిపించి గోపి ఫోన్ తియ్యబోతుంటే బాసిగాడు వద్దని వారించాడు. తర్వాత అర్థమైంది వాడెందుకు ఫోన్ తియ్యద్దన్నాడో.

"కోడి తిన్న కుక్క నాలుకలాగ ఎంత ఎర్రగా ఉందో చూడరా నాలుక" గుసగుసలుగా అన్నాడు బాసిగాడు.

"సర్లే గానీ ఆయమ్మకి మంచి నీళ్లు పొయ్యాల్రా... ఏం చేద్దాం?" గోపి.. అన్నాడు బాధతో మెలికలు తిరుగుతున్న ఆమెనే చూస్తూ 'దొరకవ్' తేల్చేశాడు బాసిగాడు, ఆవిణ్ణీ సెల్ఫోన్ని మార్చి మార్చి చూస్తూ.

"ఇలా పడిపోయిన వాళ్ళకి నీళ్ళు పొయ్యాలంట. రక్తం పోయి బాగా దాహం వేస్తుందంట. స్కూల్లో మాస్టారు చెప్పారు కదా! నేనిక్కడ చూస్తా ఉంటాను. ఎక్కడికైనా వెళ్ళి సీసాతో నీళ్ళు తేరా...! చచ్చిపోద్దేమోరా... నాకు భయమేస్తోంది" అన్నాడు వాళ్లందర్నీ మార్చి మార్చి చూస్తూ. వాడి గొంతులో సుళ్ళు తిరుగుతున్న బాధ.

"ఈ చీకట్లో నేనెక్కడి నుండి తేవాలి?' ఫోన్నించి దృష్టి మరల్చుతూ విసుగ్గా అన్నాడు వాడు. అక్కణ్ణుంచి వెళ్ళాలని లేదని వాడి చూపులే చెబుతున్నాయ్. అలా అని అత్యాశగల వాణ్ణి అక్కడ ఉంచి వెళితే ఏం చేస్తాడో అనే భయం.

"ఒక పనిచెయ్! కొబ్బరి చెట్లెక్కటం నీకు వచ్చు గదా...! ఎవరి చేలోకన్నా వెళ్ళి రెండు బొండాలు తేరా! కొడవలి నా దగ్గరుంది. ఇందుకు తీశామని రైతుతో చెబుదాం. ఏమీ అనడు. ఆ బుల్లెట్టాయన అయితే అలాగే పడున్నాడు. నాకైతే భయంగా ఉందిరా, ఆయనకేమవుతుందోనని. ఆ సారు నోట్లో కొన్ని చుక్కలోసి చూద్దాం, లేస్తాడేమో...! నీకే పుణ్యం వస్తుంది" బ్రతిమలాడాడు గోపి.

"అబ్బా! ఛ....! చీకట్లో నేను కొబ్బరి చెట్టెక్కాలా? ఏ పామన్నా చెట్టు మీద నన్ను కాటేసి నేను చచ్చి పోతే నువ్వా పోనూ, ఆ బుల్లెట్టోడి పర్సూ, ఆయమ్మ బేటులో డబ్బులు పట్టుకు పోవచ్చని కదా...? నాకు తెలుసు నీ సంగతి" వెటకారంగా అన్నాడు బాసిగాడు.

దెబ్బతిన్నట్టు చూశాడు గోపి బాసిగాడివైపు. అందుకే ఫోన్లో మాట్లాడనివ్వలేదా? అంటే... అంటే.. వీళ్ళు చనిపోవాలని చూస్తున్నాడా వీడు? ఎంత దుర్మార్గం? చెడ్డోడని తెలుసు. కానీ మరీ ఇంతా...! బుర్ర తిరిగిపోగా ఆలోచిస్తూనే అక్కణ్ణుంచి లేచి పిచ్చెక్కిన కుక్కలా తిరిగిన చోటే తిరుగుతూ...అలా అని ఒక్కడూ ఏమైనా చెయ్యటానికి శక్తి చాలక పదే పదే ఆ పడిపోయినాయన దగ్గరకెళ్ళి ముక్కు దగ్గర వేలెట్టి చూశాడు. ఊపిరింకా ఉంది. పోలేదు.

చుట్టూ చీకటి. మృత్యువుతో పోరాడుతూ వాళ్లు... గుక్కపట్టి ఏడుస్తున్న పసిప్రాణం... గోపీకి వాళ్ళనలా చూస్తుంటే ఏడుపొచ్చేస్తోంది. దాంతో ఏం చెయ్యటానికి పాలుపోక పిచ్చోళ్లా తిరుగుతున్నాడు వాళ్ల మధ్యే. ఊళ్ళోకి వెళ్ళి కాసిన్ని నీళ్ళు తీసుకుని, ఎవర్నైనా పిల్చుకుని వద్దామన్నా వాళ్లనలా దిక్కూమొక్కూలేని అనాథల్లా వదిలి వెళ్ళాలనిపించక, రకరకాల భయాలు, అనుమానాలతో కాలుగాలిన పిల్లిలా తిరుగుతూనే బాసిగాడికోసం చుట్టూ చూశాడు వీడెక్కడా అని.

మోటార్ సైకిల్ ఏక్సిలరేటర్ పట్టుకుని అటూ ఇటూ తిప్పుతున్నాడు వాడు. అలా తిప్పుతూనే మధ్యమధ్యలో వెళ్ళి ఆ బుల్లెట్లాయన వాలెట్‌ని ఓసారి చూసొస్తున్నాడు దాన్నెలాగైనా తీసేసుకోలేనా అన్నట్టు. వాడి యావ వాడిది. వాడెప్పుడూ అంతే. 'ఛీ.. ఛీ...' చూపులు తిప్పుకున్నాడు గోపి. గుండె లోతుల్లోకంటా చెయ్యెట్టి కెలికినట్టుంది గోపీకి.

ఆరుకుపోతున్న పిల్లవాడి గొంతు వింటున్న కొద్దీ పిచ్చెక్కిపోయి కాళ్లు దడదడలాడుతుంటే మరి నిలబడలేక పిల్లోడి పక్కనే చతికిలబడి తన చిటికెన వేలుని ఏడుస్తున్న వాడి నోట్లో పెట్టాడు. ఆబగా, ఆత్రుతగా గాల్లో కాళ్ళూ, చేతులూ ఆడిస్తూ, పట్టుకోసం లేత నాలుకతో వేలుని బిగిస్తూ చీకసాగాడు. అలా ఎక్కువసేపు సాగదని తెలుసు. పాలు రాకపోతే ఎంతసేపని చీకుతాడు? మళ్ళీ ఏడుస్తాడు. అది వాడికి తెలిసేలోపు ఏమైనా చెయ్యగలడా?

ఇంతలో నిశ్శబ్దాన్ని భగ్నం చేస్తూ... సెల్ఫోన్ మోగింది. అదలా మోగుతుంటే ఫోన్లోంచి వచ్చే ఆ కొద్దిపాటి వెల్తురు, మోతకి ఆవిడలో సన్నగా కదలిక. ఫోన్ని తియ్యలేదు గోపీ. తియ్యాలని ఉన్నా అంతలోనే భయం. ఏది నొక్కబోయి మరేదైనా నొక్కేస్తే అదేమవుతుందో...! ఉన్న ఆధారం కూడా పోవచ్చు... అదసలే చేటంత ఫోను.

ఇంతలో నాలుకతో వేలు బయటికి తోసేసి కెవ్వున ఏడుపు లంఘించుకున్నాడు పిల్లోడు.

ఓ పక్క ఫోన్మోత, మరోపక్క వీడి ఏడుపు. గోపీలో కంగారెక్కువైంది. సముదాయిద్దామని పొట్టమీద చెయ్యేసేడు. క్షణంలో చేతినిండా పాకేశాయి చీమలు. భయంతో జలదరించి పోయింది వాడి ఒళ్ళు. గబగబా దులపటం మొదలెట్టేడు. ఇంతలో మళ్ళీ ఫోను. ఒక్కంగలో బాసిగాడు వచ్చి ఫోనందుకోబోతే గట్టిగా చెయ్యి పట్టుకున్నాడు గోపి.

"బాసీ... ఫోన్ తియ్యకు. ఎవరికో ఏదో చెప్పిందాయమ్మ. వాళ్లొస్తారిప్పుడు. దార్లో ఉండి ఉంటారు వాళ్లు. అలా వస్తూ వస్తూ ఎక్కడ పడ్డారో తెలుసుకోవటానికి మళ్ళీ మళ్ళీ చేస్తానే ఉంటారు. పైగా అదలా మోగినప్పుడల్లా ఈ చీకట్లో ఆ ఫోన్నించొచ్చే వెలుగులో.. దూరం నించే మనమెక్కడ ఉన్నామో వాళ్ళకి తెలుస్తుంది. అయినా ఎక్కడ నొక్కాలో మనకి తెలీదు కదా. తెలీక ఏదైనా నొక్కేసేమనుకో... ఈ ఆధారం కూడా పోతుంది. నేను తియ్యలేక



## తప్పుకుందా? తప్పించారా?

తెలుగమ్మాయి స్వాతి తెలుగు సినిమాల్లో కనిపించి చాలా నెలలే అయింది. తెలుగు కన్నా తమిళమే బెటర్ అనుకొని అక్కడ బిజీ అయింది స్వాతి. ఎందుకో మరి తెలుగు వారి మీద ఒక్కసారిగా ప్రేమ పొంగుకొచ్చేసి వెంటనే ఓ సినిమా ఒప్పేసుకుంది.

ఆ సినిమా షూటింగ్ ప్రారంభం అవుతోంది అనుకుంటున్న సమయంలో స్వాతి ఆ సినిమా నుంచి తప్పుకుంది అన్న వార్తలు వస్తున్నాయి. స్వాతి ఈ సినిమా కోసం సన్నబడి స్లిమ్‌గా తయారైందట! మళ్ళీ పాత స్వాతిని వెండితెర మీద చూడొచ్చు అని ఆనందపడిన టాలీవుడ్ అభిమానులకు ఈ వార్త షాక్‌నిచ్చింది అంటున్నారు. స్వాతి ఆ సినిమా నుంచి తప్పుకోవడం కాదు తప్పించారన్న వార్త బాగా హల్‌చల్ చేస్తోంది.

కాదు. తీసి మనమెక్కడ ఉన్నామో చెప్పచ్చు. అది వాళ్లకి అర్థం కావాలి కదా...? అందాక గుక్కెడు నీళ్ళు వాళ్ళ నోట్లో పోస్తే చాలు.." కంగారుగా అని... మళ్ళీ తనే "ఒక పన్జేద్దాంరా..?" అన్నాడు బాసిగాడు కేసి చూస్తా.

నిర్లక్ష్యంగా చూశాడు బాసి. అర్థమయ్యేటట్టు చెప్పేడు గోపి. అంతా విన్నాక వాళ్ళనెలాగైనా కాపాడాలన్న గోపీగాడి వీక్నెస్ని కనిపెట్టి,

"మరైతే ఆ సెల్‌ఫోన్ నాది" అంటూనే గబుక్కున ఫోన్ తీసేసి జేబులో దోపేసేడు. పిచ్చి కోప మొచ్చింది గోపికి.

పులిలా మీద కురికాడు గోపి. ఇవ్వనంటే ఇవ్వ నన్నాడు వాడు. పైగా తిట్టేడు. కొట్టేడు. నేల మీద పడేసి తన్నాడు. పక్కల్లో కాలితో కుమ్మేసేడు. అక్కడ పడున్నవాళ్ళ ముఖాలే కళ్ళ ముందు కదలాడగా పట్టినపట్టు వదల్లేదు గోపి. వాడి జుట్టు పట్టుకుని వంగదీసి టపటపా నాలుగైదు పిడిగుద్దులు గుద్ది, గోళ్లతో రక్కి, కాళ్తో నేలమీద తొక్కిపెట్టి మరీ వాడి జేబులో ఉన్న ఫోన్ తీసి ఎక్కడిదక్కడ పడేసి రొప్పుతూనే...

"వద్దని చెబుతుంటే నీక్కాదా? ఫోను మీద చేతులేశావో ప్రాణాలు తీస్తా నా కొడకా? ఒక పక్కన శవాలల్లే దిక్కూ, దివ్వానం లేకుండా వాళ్ళలా పడుంటే పసిపిల్లాణ్ణి చూసైనా జాలివెయ్యదేరా నీకు? వాడి నాలుక నీళ్ళతడి కోసం పాకులాడు తోంది. నీకు జాల్లేదా? తుప్పాసి నా కొడకా? వాళ్ళు చేస్తారని, లైటు వెలుగుతుంటే దారి కనిపిస్తుందని కూడా చెప్పాను. డబ్బులూ, ఫోన్లేనా? ఇదే మీ అమ్మా వాళ్లైతే ఇలాగే చేస్తావా? వద్దన్నానని పక్కల్లో పొడుస్తావా? వీళ్ళనిలా వదిలేసి ఫోను పట్టుకుపోతావా? నువ్వూ ఓ మనిషివేనని అనుకుంటే కాసిన్ని నీళ్ళట్రా ఎక్కడికైనా వెళ్ళి. లేదంటే దొబ్బెయ్..." అంటూ ఇక ఓర్చుకునే శక్తిలేక నిల్చున్న చోటే కూలబడి బోరు మన్నాడు గోపి నిస్సహాయతతో, అంతకంటే చెప్పే ఓపికలేక.

చూస్తూచూస్తూ వాళ్ళనలా వదిలెయ్యలేక, అలా అని వాళ్ళని ఈ మోసగాడి దగ్గర వదిలి వెళ్ళలేక, వెళితే వాటి కోసం వీళ్ల పీకలెక్కడ నొక్కేస్తాడో ననే భయంతో... ఎటూ పాలుపోక గొంతెత్తి బిగ్గరగా ఏడ్చేశాడు వాడు. వాడలా ఏడుస్తున్నంతలోనే 'నీల్లు.. నీ..ల్లంటూ.. మళ్ళీ గొణిగిందామె.

ప్రాణం నీరైపోయిందాడికి. చొక్కాతో కళ్ళు తుడుచుకుంటూ ఆవిణ్ణే చూస్తూ ఉండిపోయేడు.

అలా చూస్తూనే... గబుక్కున లేచి నిలబడ్డాడు. ఆ నిలబడటంలో ఏదో తెగింపు కొట్టొచ్చినట్టు కనిపిస్తుంటే బాసిగాడు తన గేదెల కట్లు విప్పాడు వాటిని అదిలిస్తూ...! అదేం పట్టించుకోకుండా గోపి ఒక్కంగలో తన గేదె దగ్గరకెళ్ళి దాన్ని చెట్టుకి కట్టేసి దూడని వదిలేశాడు. చెంగున ఎగిరెగిరి పడతా క్షణాల్లో తల్లి పొదుగుని కుమ్మిందది.

"మీ నాన్నతో చెప్తానుండు.." బెదిరించాడు బాసిగాడు. పట్టించుకోలేదు గోపి. దూడలా తల్లిని కుడుస్తూ ఉండగా క్షణం కూడా వృధా చెయ్యకుండా ఒక్క ఉదుటున కింద కూలబడి పక్కనే ఉన్న మంచినీళ్ళు తెచ్చుకునే రెండు లీటర్ల ఖాళీ కూల్‌డ్రింకు సీసాని తన రెండు పాదాల్తో తొక్కిపట్టి




కొడవలితో సీసాని అడ్డంగా రెండు ముక్కలు చేసేడు.

పై భాగాన్ని ఆమె పక్కనే ఉంచి, దూడని లాక్కొచ్చి చెట్టుకి కట్టేశాడు. తర్వాత గేదె పొదుగు కింద కూర్చుని సీసా కింద భాగాన్ని రెండు మోకాళ్ళ మధ్య నొక్కిపట్టి పాలు పితకటం మొదలెట్టాడు గోపి. పాలతో సీసా బరువెక్కే కొద్దీ వాడి హృదయం తేలిక కావొచ్చింది.

సీసా నిండగానే ఒక్కంగలో ఆయమ్మ దగ్గర కొచ్చి, ఊడొచ్చిన పళ్లకి ఏ మాత్రం తగలకుండా సీసా మూతిని మెల్లగా ఆయమ్మ గొంతు దగ్గర కంటా ఓరగా పెట్టి పాల చుక్కల్ని కొద్ది కొద్దిగా ఆయమ్మ నోట్లో పోయసాగాడు.

ఆమె గుటకేసే కొద్దీ వీడి గుండె వేగం తగ్గి మామూలు స్థితికి రాసాగింది. నాల్గయిదు గుటకలు వేసేసరికి కాస్తంత కదిలిందామె. పిల్లాడు ఒక పక్క గుక్క పెడుతూనే ఉన్నాడు. ఆవిడలా కదలటం ఎప్పుడైతే గమనించాడో ఇక ఏ మాత్రం ఆలస్యం చెయ్యలేదు గోపి. పిల్లాణ్ణి ఒళ్ళో వేసుకుని వాడి పొట్ట మీద మెల్లగా తడుతూ పాలల్లో తన చేతి వేళ్ళు ముంచి మునివేళ్లతో వచ్చినన్ని పాలు తీసి కొసరి కొసరి వాడి లేత పెదవుల మీదుగా పొయ్యసాగేడు. పాలతడి తగిలేసరికి ప్రాణం లేచి వచ్చినట్టు వాడిలో ఒకటే కంగారు. దాంతో కాళ్లని మరింత బలంగా గాల్లో ఊపుతూ ఆబగా నాలుక ఆడించటం మొదలు పెట్టేడు. అలా కడుపు నిండే కొద్దీ కళ్ళు మూతలు పడసాగాయి వాడికి.

పుళ్ల బాధ భరించలేక మధ్యమధ్యలో కదులుతున్నా నిద్రపోతున్నవాణ్ణి మెల్లగా వాళ్లమ్మ పక్కన తుండుగుడ్డ మీద పడుకోబెట్టి, చీమలు రాకుండా చుట్టూ తుండుగుడ్డ చుట్టేసి సీసాలో మిగిలిన పాల చుక్కల్ని స్పృహ తప్పినతని మొఖంమీద చిలకరించాడు. అయినా కదల్లేదతను. చచ్చిపోతాడేమో...! అనుకోగానే ఏడుపొచ్చేసి ఇక ఓర్చుకోలేక బిగ్గరగా ఏడ్చేశాడు వాడు.

ఏడుస్తూనే చుట్టూ చూశాడు. ఎటుజూసినా ఒకటే చీకటి..! ఏమి చెయ్యబోతోందో ఈ చీకటి? బాధగా కళ్ళు మూసుకున్నాడు వాడు. తల్లి రత్తమ్మ కళ్ళముందు కదలాడింది వాడికి. ఈసరికి ఇంటి దగ్గరంతా రచ్చరచ్చగా ఉండి ఉంటుంది. తండ్రి శివాలెత్తుతూ ఉండి ఉంటాడు ఇంకా రాలేదని. అయినా ఇంకా వచ్చాడో? లేదో? పట్నం నుంచి. వెళ్ళాక ఏం జరుగుతుందో? జరిగితే జరగనీ..! కొడతాడని భయపడి వీళ్ళనిలా దిక్కులేనోళ్ళలా వదిలేసి తనెలా వెళ్ళగలడు? కొడితే కొట్టనియ్... భరిస్తాను. వీళ్ళంతా బ్రతికితే చాలు. ఎన్ని దెబ్బలైనా తట్టుకోగలడు తను.

కళ్ళు మూసుకునే ఆలోచిస్తున్నాడేమో మూసి ఉన్న కనురెప్పల్ని తాకిన వెలుతురుకి కళ్ళు తెరిచాడు. ఇటే దూసుకొస్తున్న లైట్ల కాంతి. ఆ లైట్లని చూసి కోటి సూర్యుళ్ల కాంతి క్షణంలో వచ్చి చేరింది వాడి ముఖంలో. ఒక్క ఉదుట్న లేచి గబుక్కునెళ్ళి రోడ్డు కడ్డంగా నిలబడ్డాడు. వెలుగుతూ, ఆరుతూ ఉంది ఓరగా పడ్డ ఫోను. అంతకంతకీ దగ్గరవుతున్న లైట్లు వేగంగా వచ్చి సడన్ బ్రేకుతో ఆగాయి వాడి ముందు. కార్లు, మినీ ట్రక్కు, వెనుకే అంబులెన్స్.

వాడి అంచనా తప్పలేదు. వెలుగుతున్న ఫోన్ను బట్టి అక్కడ ఆగటంతోనే లబోదిబోమన్నారంతా. క్షణంలో అక్కడంతా ఒకటే ఏడుపులూ, పెడబొబ్బలూ, తలబాదుకోవటాలూ... ముద్దులెట్టుకోవటాలూ... రణగొణధ్వనులతో కోలాహలంగా మారిపోయింది. ఇంతలో... ఎవరో చుడీదార్ అమ్మాయి కారు లైట్ల వెలుతుర్లో కింద మాంసం ముద్దలా పడున్న పిల్లాణ్ణి, ఆ పక్కనే పడున్న ఆమెనీ చూసి గొల్లుమంది. పిల్లాణ్ణి అపురూపంగా చేతుల్లోకి తీసుకుని వాడి వైపే చూస్తూ...

"ఒరేయ్ చిన్నూ... నా బంగారు కొండా.. నీ ఒళ్లంతా ఈ రక్తమేంట్రా?" పిల్లాణ్ణి తడిమి తడిమి మరీ ఏడుస్తుంటే కార్లో వాళ్లంతా కిందకు దిగి వాళ్లందరి మధ్య తిరుగుతూ గొల్లు గొల్లున ఒకటే ఏడుపు. గోపీకీ ఏడుపొచ్చేసి పైకి ఏడ్చేసేడు.

నిమిషాల మీద వాళ్లందర్నీ అంబులెన్సులో పడుకోబెట్టారంతా కలిసి. బండిని ట్రక్కు మీదికి ఎక్కించే

స్తుంటే పంచెకట్టు పెద్దాయన ఏడుస్తున్న గోపీ దగ్గర కొచ్చాడు పైపంచెతో కళ్లు తుడుచుకుంటూ...! వాడి భుజం మీద చెయ్యేసి ఏదో మాట్లాడబోతుంటే ఈలోపు,

"పెద్దయ్యా...! నూ... రావాలి. పల్స్ పడిపోతుంది. త్వరగా హాస్పిటల్లో చేర్చాలి" కదులుతున్న అంబులెన్సులో నుండి అరిచారెవరో...! కళ్లతోనే కృతజ్ఞతలు చెప్పి వెనుదిరిగి కార్లోంచే నమస్కరించాడాయన. మౌనంగా చూస్తుండిపోయాడు గోపి.

క్షణంలో ఖాళీ అయిపోయిందక్కడంతా వాడి మనసులాగే. సద్దుమణిగిన శబ్దంతో పాటే వాడూ, వాడి గేదెలూ.

ఏమీ తెలియనట్టే సర్దేసుకున్న చీకటి. ఇప్పుడా చీకటంటే భయంలేదు వాడికి. చీకట్లోనే నడుస్తూ తల్లిని కుడుస్తున్న దూడ దగ్గరికి వెళ్ళాడు వాడు. ఆ నడకలో ఎప్పుడూ లేని ఏదో నిదానం. ఒక్కక్షణం అక్కడే నిలబడి వాళ్ళిద్దర్నే చూడసాగాడు. అలా చూస్తున్న కొద్దీ గుండెలుప్పొంగి కళ్ళు చెమర్చాయి వాడికి. నోరులేని జీవాలు. ప్రేమిస్తే ప్రేమనిస్తాయవి. ఎంత ఉపకారం చేశాయీ రోజు. మనుష్యుల కంటే అవే నయం.

ప్రేమగా వాటి వీపుమీద చెయ్యేశాడు. తర్వాత మెల్లగా దూడని వెనక్కి లాగి అదిలించాడు.

అప్పటికే కాలుగాలిన పిల్లియున రత్తమ్మ, కలలో నడుస్తున్నట్టు నిదానంగా నడిచొస్తున్న కొడుకునీ, రక్తమంటిన చొక్కానీ చూసి నెత్తీ, నోరూ బాదుకుంటూ గడ్డం పట్టుకుని అడిగినా నోరు విప్పని కొడుకుని చూసి బుగ్గల్లో బుగ్గల్లో పొడిచింది. నోరు విప్పలేదు వాడు. తెల్లబోయింది. భర్త సంగతి తెలిసి, వచ్చే వేళయ్యిందని, వీడినలా చూస్తే శరభ శరభేనని మూర్తయ్య కోసమని కాసి ఉంచిన వేణ్ణీళ్లని కొడుక్కి తోడి స్నానానికి పంపి, వాడు విప్పిన బట్టలు భర్త కంట పడకుండా లోపలెక్కడో దాచేసింది.

ఆఖరి బస్సులో అలసిపోయి ఉస్సురంటూ ఇంటికొచ్చిన మూర్తయ్యకి, ఎంత పితికినా పట్టుమని పదిచుక్కలన్నా పాలివ్వని గేదెని, ఎన్నిసార్లడిగినా నోరిప్పని కొడుకుని చూసి కోపం నషాళాన్నంటిందేమో అతని చింతంతా చింతబరికె కాగా చితక్కొట్టేశాడు కొడుకుని ఆయాసం వచ్చేదాకా...

ఆకులు నలిగిన చింతబరికె, తగిలిన చోటే తగులుతుంటే, ఒళ్ళంతా ముళ్ళున్న పిల్లాడే కళ్ల ముందు కదలాడగా మౌనమునయ్యాడు గోపి.

దెబ్బలు గుర్తొచ్చి అసంకల్పితంగా మచ్చలు తడుముకుంటూ ఇహలోకొచ్చిన గోపి... అతన్నలా చూసి మనసులో కలిగిన సంతోషాన్ని పక్కనెట్టి "ఈయనెందుకు వచ్చాడు? అంతా చెప్పేసి ఉంటాడా? ఆ రోజు అన్నిసార్లడిగినా చెప్పలేదని కోపం వచ్చి ఉంటుంది. ఆ కోపంతో నన్నెక్కడ కొడతాడోనని, కొట్టద్దని చెప్పటానికి వస్తున్నాడేమో ఆయన నాన్న వెనకాల! నిజమే..! నాన్నకి కోపం వస్తే ఎవ్వరున్నారనేది చూడడు. ఎవరేది చెప్పినా వినడు. గొడ్డుని బాదినట్టు బాత్తాడు. అమ్మో పాత దెబ్బలే తగ్గలేదింకా? మళ్ళీ దెబ్బలా? నాన్నకి దొరక్కుండా పారిపోవాలి" ఆలోచన వచ్చిందే తడవు చేతిలో ఘుణ్ణమణ్ణాకు పొట్లం రాముకిచ్చి,

"ఒరేయ్ రాము...! ఇది మా అమ్మకిచ్చెయ్. ఈ బాసిగాడు రెండు జానలు తీసేడ్రా..! నేను చూసేను! నువ్వాడికి గోలీ ఇవ్వకు. చెబుదామనుకున్నా. ఇంతలో మా నాన్న వస్తున్నాడు. దొరికేనంటే తోలు వలిచేస్తాడు. అందుకే.." రొప్పుతూనే పొట్లం రాము మీదకి విసిరి పరుగందుకున్నాడు గోపి.

కాళ్లకి గొప్పులు తగులుతున్నాయ్. మధ్యలో కంకర్రాళ్ళు వేళ్లకి తగిలి గోళ్ళు పగులుతున్నాయ్. మంట. ఒకటే మంట. అయినా లెక్క చెయ్యలేదాడు. పరుగెడుతూనే ఉన్నాడు. బాసిగాడికి ఒళ్ళు మండిపోయింది వాణ్ణి చూసి.

"రెండు జానలు తీసేనంట? వీడు చూసేడంట? మక్కెలు విరగదన్నాలి నా కొడుకుని. ముందు వీణ్ణి వీళ్లనాన్నకి పట్టిస్తే తాట తీస్తాడు ఆయనే" బాసిగాడి ఆలోచనకి "పట్టుకోండ్రా మా వోణ్ణి..." అన్న మూర్తయ్య మాటలు ఊతమివ్వగా, "అరేయ్ ఆగరా..! గోపీ ఆగు!" లంఘించాడు బాసిగాడు. దాంతో గోపీ పరుగు ఊపందుకుంది. రాము మరిక ఆగలేదు. పిల్లలతో పోటీపడలేకపోయాడు మూర్తయ్య.

ఆ రోజు కొడుకు చేసిన పని వచ్చినాయన మాటల్లో కళ్ళకి కట్టగా... ఆరోజు వాడిని కొట్టిన సంగతి గుర్తొచ్చి మనసు మూలుగుతుంటే ఆ వచ్చినాయన చెప్పిన దాన్ని బట్టి ముందు ముందు ఏం జరగబోతుందో గుర్తొచ్చి... వాణ్ణి ఎప్పుడెప్పుడు చూస్తానా అని అలసట మరచి ఆగినోడే, ఇంకే మాత్రం ఆగలేక కదలబోతుంటే అప్పటికే తనని దాటి ముందు కెళ్తూ ఆయన.

అతన్లోనూ అదే తపన. ఇవేవీ తెలియని గోపి పరుగెడుతూనే ఉన్నాడు.

అలా పరుగెడుతూనే కనిపించని చీకట్లో గమనించని గొప్పు తగిలి బొక్కబోర్ల పడ్డాడు.

లేచేలోపు... దబాల్న మీదపడి భల్లూకంలా గోపీని గట్టిగా వాటేసుకున్నాడు బాసిగాడు. కసిదీరా నేలకేసి అణిచేస్తూ "ఏం తీసేవో చెప్పరా? నన్ను ఫోను తీయొద్దని నువ్వేదో తీసేసుంటావ్. అందుకే ఆ బుల్లెట్టోడు వచ్చాడు. అదేంటో చెప్పరా?"

అసలే ఆయాసం. దానికి తోడు గొప్పు తగిలిన చోట రేగినతొక్క మంట పుడుతుంటే, బాసిగాడి బరువుకి ముక్కు నేలని తాకి ఊపిరాడక గిలగిలా కొట్టుకోసాగాడు గోపి.

"ఏం దొబ్బేవో చెప్పరా నా కొడకా, చెప్పు. సగమిస్తావా? నొక్కి చంపెయ్యమంటావా?" కసిగా అణిచేస్తూ అంటున్న బాసిగాడి వెనక కాలర్ పట్టుకుని విస్సురుగా ఒంటిచేత్తో పైకి లేపి ఒక్క గుంజు గుంజి పక్కకి తోసి, "వాడు నువ్వు కాదురా దొబ్బటానికి. వాడు వాడే...!" అంటూ గోపీకి చెయ్యందించాడు ఆ బుల్లెట్టాయన.

అతనిచ్చిన ఆసరాతో లేచి నిలబడ్డాడు గోపి. గుండెల నిండా గాలి పీల్చుకుంటూ ఆయన్నే రెప్ప వేయకుండా సంభ్రమంగా చూస్తున్నాడు. ఆయన ముఖం గుర్తే వాడికి. ఆ రోజు రక్తంలో పడున్న అతనికి ఊపిరి ఉందో లేదోనని చూడటానికి ఆయన చుట్టూ తిరిగి ఎన్నిసార్లు ముక్కుదగ్గర వేలెట్టి చూశాడో... లెక్కేలేదు.

ఆయన్నలా చూస్తూ అవన్నీ గుర్తొచ్చి ఆనందంతో కళ్ళల్లో నీళ్ళు తిరిగాయాడికి, ఆయన బ్రతికే ఉన్నందుకు.

ఆ కళ్ళ తడి అర్థం తెల్సింది ఆయనొక్కడికేనేమో, భుజం చుట్టూ చెయ్యేసి ఆప్యాయంగా దగ్గరకు లాక్కుని ముందుకు నడిపించాడాయన తనతో పాటు.

వీళ్ళిద్దరి పెనుగులాటలో సెల్ఫోన్లో ఆనైన వీడియో రికార్డింగ్ అప్పటికే సామాజిక మాధ్యమాల్లో కోట్ల మందికి చేరువైన సంగతి తెలిసిన బుల్లెట్టాయన గోపి భుజం చుట్టూ చుట్టిన చెయ్యే కాదు, ఎదురొచ్చిన తండ్రి నవ్వులోని మెరుపూ వాడికి దారి చూపుతుంటే ముందుకు కదిలాడు వాడు.

**సెల్: 9246541249**

## నచ్చకపోతే చేయదట!



*ఇది ఏ హీరోయిన్ అయినా చెప్పే మాటే కదా అనుకోకండి! సినిమాల విషయంలో శాన్వి చాలా కచ్చితంగా వ్యవహరిస్తోంది. టాలీవుడ్ నుంచి శాండిల్‌వుడ్ వెళ్ళిన ఈమెకి అక్కడ అవకాశాలు బాగానే ఉన్నా కథ నచ్చకపోతే మాత్రం ఏ భాషలోనూ సినిమాలు ఒప్పుకోనని చెబుతోంది. తను స్వతహాగా అథ్లెటిక్ క్రీడాకారిణిని అనీ, సినిమాల గొడవలో పడి క్రీడలను నిర్లక్ష్యం చేశాననీ, నచ్చని కథలతో సినిమాలు చేయడం కంటే క్రీడాకారిణిగా సెటిల్ అయితే బెటరన్నది శాన్వి అభిప్రాయం. ఈమె అభిప్రాయానికి ఇంట్లోవారి సపోర్ట్ ఫుల్‌గా ఉందట!*



బాధతో పాటు కోపం కూడా కలుగుతుంది. ఇద్దరి మధ్య దూరం పెరగడానికి కారణం అర్థంకాని స్థితిలో తల్లిదండ్రులు ఉండిపోతారు.

**ముభావం ఎందుకంటే ?**

టీనేజర్లు ఎందుకు ముభావంగా ఉంటారు? అంటే దానికి రకరకాల కారణాలున్నాయి. తల్లిదండ్రులు తమ స్వేచ్ఛను కట్టిపడేస్తున్నారనిపించడం. రెక్కలు వచ్చిన పిట్టలు ఎప్పుడెప్పుడు ఎగరాలా అని చూసినట్లే టీనేజర్స్ కూడా స్వేచ్ఛగా ప్రవర్తిం చాలనుకుంటారు. కానీ వారికి తల్లిదండ్రుల ఆంక్షలు మింగుడుపడవు. పెద్దవాళ్ళు తమ స్వేచ్ఛ హరిస్తున్నారనుకుంటారు. 'ఒరేయ్ నాన్న జాగ్రత్తరా..' లాంటి మంచిమాటలు వారికి అసహనం కలిగిస్తాయి. ప్రతిదానికీ తల్లిదండ్రుల మీద ఆధార పడాలి, తల్లిదండ్రులు చెప్పినట్లు చేయాలి, స్వేచ్ఛ లేదు పాడులేదు. బయట అందరూ తనకన్నీ తెలుసని అంటుంటే ఇంట్లోనేమో ప్రతిదానికి బ్రేకులు.. తనకేమీ తెలియనట్లు తనింకా పసివాడేనన్నట్లు చూడటంవల్ల ఇంట్లోకి వచ్చేసరికి అంతకుముందున్న భావాలన్నీ ఒక్కసారిగా ఎగిరిపోతాయి.. తనను అంతగా కించపరిచే వాళ్ళతో ఏమి మాట్లా

# ముభావంగా ఉంటున్నారా?

**మీ ఇంట్లో ఉండే టీనేజర్‌కి ఏదైనా సలహా ఇవ్వాలనుకున్నప్పుడు వాళ్లు మాకు తెలుసులే అంటూ ఎన్నిసార్లు చెప్పారో గుర్తుతెచ్చుకోండి. అదికాదురా నాన్నా అని మీరంటే మిమ్మల్ని నిర్లక్ష్యం చేస్తూ ఒక చూపొకటి.. నిజానికి మీరు ఇచ్చిన సలహా మీ ఇంట్లో ఉన్న టీనేజర్‌కి తెలియదు. కానీ తెలుసు అన్నట్లే మాట్లాడతారు.. దానర్థం ఏంటంటే ఇంక ఆ విషయం గురించి మాట్లాడవద్దు, నేనింక వినదల్చుకోలేదు. మీకేం తెలియదు, నన్నిలా వదిలేయండి అని.**

టీనేజర్ అలా నాకు తెలుసు అనడం ఏ ఒక్క సందర్భంలోనో అయితే పరవాలేదు కానీ అనేక సందర్భాల్లో అనేక విషయాల్లో నాకు తెలుసు అని తల్లిదండ్రులను తేలిగ్గా కొట్టిపారేస్తూ మాట్లాడతారు.

మొన్నటిదాకా మీరు చెప్పిన విషయాన్ని వేద వాక్కులా శిరసావహిస్తూ మీ మాట జవదాటని పిల్లవాడు కాస్తా నిర్లక్ష్యంగా సమాధానం చెప్పడం, ఇంట్లో మూడీగా ఉండడం చూస్తే తల్లి దండ్రులెవరికైనా బాధగానే ఉంటుంది. ఇలాంటి ప్రవర్తన కనిపించినప్పుడు తల్లిదండ్రులు బాధపడటమే కాదు గాభరా పడటం సహజం. పిల్లవాడికి సంబంధించి రకరకాల సందేహాలు తలెత్తుతాయి. ఇంత మూడీగా ఉండేవాడు నలుగురితో కలవగలుగుతాడా? లోకంలో రాణించగలుగుతాడా? అనిపిస్తుంది. ఈ సందేహం ఎంతో కాలం దాగదు.

"మీ వాడు చాలా మర్యాదగా మాట్లాడతాడు. చక్కటి మ్యానర్స్ ఉన్నాయి..." అంటూ బయటి వారు ఎవరైనా టీనేజర్ గురించి చెబితే, తండ్రికి విచిత్రమనిపిస్తుంది అదేంటి వాడేమిటి నన్ను చూస్తేనే ఇలా సీరియస్ అయిపోతున్నాడా అనిపిస్తుంది. కుర్రవాడు నలుగురిలో కలుపుగోలుగా ఉండడం సంతోషం కలిగిస్తుందిగానీ, తనతో మాత్రమే సరిగ్గా మాట్లాడటం లేదన్నది గుర్తుకొచ్చి మనస్సు చివుక్కు మంటుంది. అంటే ఆ కుర్రవాడు బయటవాళ్లతో బాగానే ఉంటూ కేవలం తల్లిదండ్రులపైనే కోపం ప్రదర్శిస్తున్నాడన్న మాట. వాణ్ణి ఈ లోకంలోకి తీసుకువచ్చింది తను, విద్యాబుద్ధులు చెప్పించింది తను. అట్లాంటి తనను నిర్లక్ష్యం చేస్తూ మిగతా అందరితో సరదాగా ఉంటున్నాడు. వాడిని వృద్ధిలోకి తీసుకురావడానికి నేనిన్ని ప్రయత్నాలు చేస్తోంటే వాడు మాత్రం తనతో సరిగా మాట్లాడకుండా తనను వెర్రివెధవను చేస్తున్నాడు. నాకు తెలుసులే అనడం ముభావంగా ఉండడం ఇంట్లో ఉన్నంతసేపు మూడీగా చిరాకుగా ఉండడం పేరెంట్స్‌కి బాధ అనిపిస్తుంది. అదే సమయంలో

డాలి? ఏది మాట్లాడబోయినా తనకు తెలియదంటారు. తిక్కపుట్టక ఏమవుతుంది? అందుకే వాళ్లతో మాట్లాడబుద్ధి కాదు. నాకు తెలుసులే అంటూ వాళ్ళను ఒకింత దూరాన ఉంచడానికి ప్రయత్నిస్తాడు. ప్రతి టీనేజర్ మనోభావాలు ఇలానే ఉంటాయి.

దానికి తోడు తల్లిదండ్రులు కూడా, 'నీ వయసులో నేనిలా ప్రవర్తించలేదు' అనే డైలాగ్ కుర్రవాళ్ళకు మరీ తిక్క పుట్టిస్తుంది. తల్లితండ్రులు తమనింకా పాతతరంలాగే ముసలిబుద్ధులతో ఉండమంటున్నారనీ, జెట్‌వేగంతో మారిపోతున్న ఈతరం పోకడల్ని వాళ్ళు అస్సలు గ్రహించడం లేదనీ అనుకుంటారు. ఒకరకంగా అదీ నిజమే. రోజులు మారిపోయాయి. అప్పటికీ ఇప్పటికీ చాలా మార్పు వచ్చింది. పాతికేళ్ళ క్రితం యువతరం ఉన్నట్లుగా ఇప్పటి కుర్రవాళ్లు ఉంటే తోటివాళ్ళకంటే వెనకబడిపోతారు, సమాజంలో రాణించలేరు.

తల్లిదండ్రులకు టీనేజర్ మీద ఉండే అభిప్రాయం, టీనేజర్‌కి తనమీద తనకుండే అభిప్రాయం...ఈ



రెంటిమధ్య సంఘర్షణే ఇంట్లో కుర్రాళ్ళ నిర్లక్ష్య సమాధానానికి కారణం.

ఎందుకు మీరు ఇంట్లో వాళ్ళతో మాట్లాడట్లేదు? అని ఎవరైనా అడిగితే చెప్పే సమాధానం ఒకటే, 'ఏం మాట్లాడమంటావ్, ఏం అడిగినా పెద్దలెక్చర్ ఇస్తాడు. దాని బదులు కామ్‌గా నాపని నేను చేసుకోవడమే మేలు' అంటారు. అదీ నిజమే కదా!

అప్పటి కుర్రతరం కంటే నేటి కుర్రతరం స్వతంత్ర భావాలతో స్వతంత్రంగా జీవించాలని కోరుకుంటోంది. తల్లిగానీ, తండ్రిగానీ వాటికి అడ్డుకట్ట వేయబోతే వాళ్ళకు చిరాకు పుడుతుంది. అందుకే ఇంట్లో కుర్రాళ్ళు వీలైనంత ముభావంగా ఉంటారు.

టీనేజర్స్ ముఖ్యంగా మగపిల్లవాడు తండ్రితో తక్కువ మాట్లాడటానికి మరో కారణం, టీనేజ్‌లో ఉండే అంతర్ముఖ లక్షణం. ఈ వయసువారికి మనం ఇంతకు ముందు చెప్పుకున్నట్లు రకరకాల సమస్యలు అంటే, శారీరక, మానసిక, సామాజిక పరమైనవి ఎన్నో ఉంటాయి. పైగా తోటివాళ్ళతో వివిధ విషయాలలో పోటీ, భిన్నాభిప్రాయాలు వంటివాటితో ఆలోచనల్లో మునిగితేలుతూ ఎక్కువగా అంతర్ముఖులై ఉంటారు. ఈ అంతర్ముఖ లక్షణం ఇంటి బయటకంటే ఇంట్లో ఉన్నప్పుడే ఎక్కువ ఉంటుంది. అలాంటప్పుడు తల్లిదండ్రులతో మాట్లాడటమంటే తమ ఆలోచనల్ని డిస్టర్బ్ చేసుకోవడమే అవుతుంది. అందుకే వాళ్లు వీలైనంత ముభావంగా ఉంటారు. అంతేకాదు, ఆ వయసులో టీనేజర్స్ తామేమిటో తమకే తెలియని స్థితిలో ఉంటారు. దాన్ని అర్థం చేసుకునే ప్రయత్నంలో ఉండగా ఓవైపు తల్లిదండ్రులు మరోవైపు ఫ్రెండ్స్, టీచర్లు, సినిమాలు వెలువరించే భావజాల ఒత్తిడితో ఉక్కిరి బిక్కిరి అవుతుంటారు. భవిష్యత్తులో తనకేం కావాలో తెలియదు. తనేం చేయాలో తెలియదు. తమ రహస్య ఆలోచనలు పెద్దవాళ్లు పసిగడుతున్నారనిపిస్తుంది.

## అతన్ని చెక్ చేసుకోనివ్వండి



**టీ**నేజ్‌లో ఉన్న కుర్రవాడికి తను చేసే ప్రతి పనీ ఒక కొత్త అనుభవంగానే అనిపిస్తుంది. బైక్ నడపడం, ఫ్రెండ్స్‌తో షికారుకు వెళ్ళడం వగైరాలన్నీ కూడా తను చేసే ప్రతిపనిలోనూ అతనికి థ్రిల్‌తో పాటు ఛాలెంజ్ కూడా కనిపిస్తుంది.

ఇది చేయవద్దు అంటూ ప్రతిదానిలోనూ మీరు వేలు పెడుతూ కూర్చున్నారంటే కొన్నాళ్ళకు అతను మీ అభిప్రాయాన్నిగానీ, అనుమతికానీ తీసుకోని పరిస్థితి వస్తుంది. ఇంక అప్పుడు మీరు చేయగలిగిందేమీ ఉండదు.

కుర్రాళ్ళు అడిగే ప్రతిదానికి అవునని చెప్పడం తల్లిదండ్రులుగా మీకు సాధ్యం కాని విషయమే అయినా వీలైనంతలో అతడి నిర్ణయాలు అతన్నే తీసుకోనివ్వండి. అతడి నిర్ణయాలు తప్పనిపించి పెద్దవాళ్ళు జోక్యం చేసుకోవాల్సి వచ్చినప్పుడు చాలా నేర్పుగా జోక్యం చేసుకోండి. అయినా వినకుంటే దండన తప్పనిసరి.

టీనేజర్‌కి ఏదన్నా సమస్య ఉన్నప్పుడు తల్లిదండ్రులతో పంచుకుంటే బాగుంటుంది. కానీ టీనేజర్ అలా చేయడు. ఒకవేళ తల్లిదండ్రులను సంప్రదించాలన్నా ఎలా సంప్రదించాలో, ఎలాంటి ప్రశ్నలు వేయాలో తెలియదు. తల్లిదండ్రులు వాటిని ఎలా స్వీకరిస్తారో తెలియదు. అందుకే నిశ్శబ్దంగా తల్లిదండ్రులకు మానసికంగా దూరంగా ఉండడానికి ప్రయత్నిస్తారు. దురదృష్టవశాత్తూ తల్లిదండ్రులు కూడా దీన్ని అర్థం చేసుకోలేరు. టీనేజర్ తమను తిరస్కరిస్తున్నాడనీ కావాలనే తమకు దూరంగా ఉంటున్నాడనీ భావిస్తారు.

### కిం కర్తవ్యం ?

టీనేజర్లు ఇంట్లో ఉంటే వారు యుక్తవయసు దాటి వచ్చేవరకు తల్లిదండ్రులకు, టీనేజర్లకు మధ్య ఈ ముభావ స్వభావం తప్పదు. ఆ వయసు దాటాక తాము సర్దుబాటు చేసుకోగలిగే స్థితికి వచ్చేస్తారు. తల్లిదండ్రులతో ఎలా మాట్లాడాలో, వారి సలహా ఎలా తీసుకోవాలో తెలుస్తుంది. అంతవరకు మాత్రం టీనేజర్లతో తల్లిదండ్రులు సర్దుకుపోవాల్సిందే. అదెలా అంటే..

### అవగాహన ముఖ్యం

ఏముంది వాళ్ళకు ఎలాంటి సమస్య ఉన్నా సరే సమాధానం ఇవ్వగలం అంటారు మీరు. కానీ అతను వినడానికే సిద్ధంగా లేనప్పుడు మీరు చెప్పి లాభం లేదు కదా. పైగా మీరు అనవసరంగా చెబితే మీ సలహాను అపార్థం చేసుకునే ప్రమాదం ఉంది. పైగా "నువ్వెప్పుడూ అలానే ఉంటావా? ఆ వీధి చివర ఉండే అమ్మాయిని చూసి నేర్చుకో". ఈ తరహా సలహాలు ఇవ్వడం మానుకోవాలి. ఇలా మీరు చెప్పే విషయాలు వాళ్ళకి తెలియనివి కాదు. అవన్నీ సబబేనని వారికీ తెలుసు కానీ టీనేజర్ మైండ్ మీ మాటల్ని వినదల్చుకోదు అంతే. మరెలా అనుకుంటున్నారా మీ టీనేజర్ తన సమస్యని తానే పరిష్కరించుకోవాలనుకుంటాడు. మీరు అనవసరంగా జోక్యం చేసుకోకండి. అయ్యో ఏమీ చెప్పట్లేదని ఫీలవకండి. తన ప్రైవసీని కాపాడుకునే హక్కు అతనికి ఉందన్న సంగతి మర్చిపోవద్దు.

### అర్థం చేసుకుంటారని తెలియాలి !

మీ కుర్రవాడికి చెందిన జీవితంలో మొదటి పదహారేళ్ళూ మీరు అతడిమీద అదుపాజ్ఞలు ప్రదర్శించారు. అతను కూడా మిమ్మల్ని ఎదిరించకుండా మీరు చెప్పిన మాటలు గుడ్డిగా శిరసావహిస్తాడు. ఈ రెండూ అప్పటిదాకా అవసరమైనవే. కాని ఇప్పుడిక అలాకాదు. అతడు తన స్వంత వ్యక్తిత్వాన్ని స్వంత ఆలోచనల్ని సంతరించుకునే ప్రయత్నంలో ఉంటాడు. మీరింక అతనిమీద డిక్టేటర్‌లా ప్రవర్తించకూడదు. స్వంత వ్యక్తిత్వాన్ని సమకూర్చుకోవాలనుకుంటున్న అతని ప్రయత్నానికి మీ సహకారం అందించండి. మీరు కూడా ఒకప్పుడు టీనేజరేనన్న సంగతి గుర్తుకు తెచ్చుకుని అతని మూడ్ పసిగట్టి ఏవిధంగా సమస్యలు రావచ్చు, ఏవిధంగా బోల్తాపడొచ్చు అన్నవిషయాన్ని ఉదాహరణలతో సహా వివరించండి.

– లతాకమలం

lathakamalam.me@gmail.com

## తల్లిదండ్రులూ ఇది మీకోసమే



**టీ**నేజర్స్‌తో మీ తీరు ఎలా ఉందో చెక్ చేసుకోండి. కింద ఇచ్చిన ప్రశ్నలతో మూడింటికి 'అవును' అనే సమాధానాలు వస్తే వారితో మీరు సంబంధాలను మరింత మెరుగుపరుచుకోవాలి, అంతకన్నా తక్కువ వస్తే మీరు మంచి ఫ్రెండ్‌లా ఉంటున్నారని అర్థం.

*1. టీనేజర్‌ని ఎప్పుడూ ఇతరులతో పోలుస్తున్నారా?*

**అవును, కాదు**

*2. తనేదైనా విషయం చెబుతుంటే నీకేం తెలియదు, మేం చెప్పిందే విను అని ఆర్డర్ జారీ చేస్తున్నారా?*

**అవును, కాదు**

*3. కనీసం వారానికి మూడుసార్లయినా టీనేజర్‌ను దగ్గర కూర్చోబెట్టుకుని వారితో స్నేహపూర్వకంగా మాట్లాడుతున్నారా?*

**అవును, కాదు**

*4. తప్పు చేయగానే వెంటనే కోపంతో దండిస్తున్నారా?*

**అవును, కాదు**

*5. మీకు ఏవిషయం చెప్పాలన్నా మీ ఇంట్లో ఉండే టీనేజర్ ఫ్రీగా చెప్పలేకపోతున్నారా?*

**అవును, కాదు**



# గోమాత వచ్చిందమ్మా!

-అలపర్తి రామకృష్ణ

**పట్నానికి ఎప్పుడు వలస వచ్చానో నాకే గుర్తులేదు. గుంపులో కలిసి వచ్చాను. ఏం చేస్తాం? పశువులతో రైతులకు ఉన్న ప్రేమ, అనుబంధాల గురించి మా అమ్మమ్మ నాతో చెబుతూ ఉండేది. కానీ ఇప్పుడు రైతులది ఒక్కటే లెక్క! మాకే తాగడానికి నీళ్ళు లేవు, పొలాలకు సాగునీరు కూడా అందడం లేదు, కష్టపడి పండించిన పంటకు గిట్టుబాటు ధర ఉండటం లేదు. ఎద్దుల్ని మేపితే కనీసం పొలం పనులకైనా ఉపయోగపడతాయి! ఉత్త ఎండు గడ్డితోనైనా పెంచొచ్చు. మరి ఆవుల్ని ఎలా పెంచాలి? మా బతుకే భారమైపోతే ఇక పశువుల్ని ఎలా మేపగలం? ఊళ్ళో ఒక్కళ్ళో ఇద్దరో ఆవుల్ని పెంచినా పాలు తాగేందుకు దూడల్ని మాత్రం వదలడం లేదు. పాలన్నీ పాల కేంద్రాలకు అమ్మేస్తున్నారు.**

"మా ఇంట్లో పాడికి లోటు లేదు!" అని ఏ రైతూ గర్వంగా చెప్పుకునే పరిస్థితులు లేవు. దేశంలో అందరి దృష్టి వ్యాపారాల మీద, ఐ.టి కంపెనీల మీదేగానీ మా పశువుల మీద, వ్యవసాయభూముల మీద లేదు! అదీ సంగతి! అందుకే పట్నం వచ్చేశాను. మా గుంపులో చాలా పశువులు మాయమయ్యాయి. రోగాలు వచ్చి చచ్చిపోయాయో, జంతువధశాలలకు తరలింపబడ్డాయో! మాంసం తినడం తప్పు అని అనడం లేదు నేను. వంద పశువుల్ని పెంచి ఒకదాన్ని మీ అవసరాలకు ఉపయోగించుకోండి! పంటలకు ఒకప్పుడు పశువులే ముఖ్యంగా ఉండేవి. ఇప్పుడు ట్రాక్టర్లు, యంత్ర పరికరాలు వచ్చాయి గదా!

పట్నంలో రోడ్డుమీద తిరిగినా తినడానికి కాగితాలు దొరికేవి. వాల్‌పోస్టర్లు మైదాపిండితో అంటించే వాళ్ళు. కనీసం అవన్నాతిని బతికేవాళ్ళం. ఇప్పుడు ఫ్లెక్సీలు, కాగితం అవసరం లేకుండా కంప్యూటర్లు వచ్చేశాయి.

బాగా పెంచితే మేం ఏడు ఎనిమిది దూడల్ని పెడతాం. ఎక్కువ పాలు ఇస్తాం. ఆవు పాలు మంచివని అందరూ చెబుతారుగానీ దొడ్లో ఆవును పెంచి పోషణ చేయరు. కుక్కల్ని పెంచుతున్నట్లు మమ్మల్ని పెంచుకోవచ్చుగదా! కమ్మటిపాలు తాగకుండా రోగాల పాలవుతున్నారు. డాక్టర్ల దగ్గరకి పరిగెత్తుతున్నారు.

"ఆవుకి ఆలోచించే జ్ఞానం కూడా ఉందా? ఉపన్యాసాలు ఇస్తోందే!" అని మీరు అనుకుంటారేమో! అందరికీ ఆలోచించే జ్ఞానం ఉంటుంది. కాకపోతే మీ మనుషులు ఆలోచనలను ఆచరణలో పెడతారు. మీ బుద్ధి అపారం! అందుకే అడవుల్లోని జంతువులన్నింటినీ అదుపులోకి తెచ్చుకుని పెత్తనం చలాయిస్తున్నారు.

పాతరాతియుగం కంటే ముందు మీరూ, మేమూ అడవుల్లో తిరిగినవాళ్ళమే! ఆ గొడవలు సరే! అసలు కథలోకి వద్దాం! నా అదృష్టమో దురదృష్టమో వీరాస్వామి చేతుల్లో పడ్డాను.

నామెడకు తాడుకట్టి అన్ని వీధులూ తిప్పుతాడు.

***

"గోమాత వచ్చిందమ్మా! దానంచేసి పుణ్యం కట్టుకోండి! మీకు సకల శుభాలూ కలుగుతాయి!" పెద్దగా అరిచాడు వీరాస్వామి ఓ ఇంటి ముందు నిలబడి.

ముందువైపు కిరాణాషాపు ఉంది. వెనుకవైపు ఇల్లుంది.

ఆ ఇంటి యజమాని షాపులో కూర్చున్నాడు.

దిగులుగా కనిపించాడు. ఆ రోడ్డు నుంచే మెట్రో రైలు పోతుంది. మరో రెండు నెలల్లో షాపున్న ముందుభాగం పడగొట్టేస్తారు. వెనుకవైపు మిగిలిన ఇంట్లో షాపు పెట్టుకుందామంటే వీలు కుదరదు. వంద గజాల్లో ఇల్లు, షాపు ఎలా సమకూరుతుంది?

అతని సమస్య అతనిది. "సిటీ సరిహద్దుల్లో స్థలం ఇస్తాం, అక్కడ షాపు పెట్టుకో!" అన్నారట కార్పొరేషన్ వాళ్ళు.

చేతిలో బ్యాగ్ ఊపుకుంటూ ఆ ఇంటికోడలు ముందువైపుకొచ్చింది.

"పది రూపాయలు దానం చెయ్యండి తల్లీ! మీ పిల్లలు చల్లగా ఉండాలి! గోమాత దీవెనలు మీకు లభిస్తాయి!" అంటూ ఆమె దగ్గరకు వెళ్ళి అడిగాడు వీరాస్వామి.

మావాడి వాలకం చూసి చిరాకుపడింది.

"దున్నపోతులా ఉన్నావ్? కష్టపడి పనిచేసుకోవచ్చు గదా! ఏదొక వేషం వేసుకు వస్తారు!" అంటూ మావాణ్ణి పట్టుకుని దులిపేసిందా కోడలు.

మావాడికి దూషణలను దుప్పటిగా ఒంటిమీద కప్పుకోవడం అలవాటే! నవ్వేసి షాపులో కూర్చున్న యజమాని వైపు చూశాడు.

"ఇంకా బోణీ కాలేదు!" అన్నాడు అతను.

అదే సమయంలో ఇంట్లో నుంచి ముందువైపు వచ్చిన అత్తగారికి కోడలి దూషణ భాషణ చెవిలో పడింది. కోడలు చెప్పినదానికి, చేసినదానికి విరుద్ధంగా ప్రవర్తించడమే అత్తగారి ఏకైక లక్ష్యం!

"ఉండరా అబ్బీ!" అనేసి లోపలకి వెళ్ళింది.

ప్లేటులో పసుపు కుంకుమ తెచ్చి నా మొహాన దిద్దింది. నా మేను నిమిరింది.

"ఈ రోజు 'మాఘపూర్ణిమ'... మంచిరోజు! ఉదయాన్నే గోమాతను చూశాను. అన్నీ శుభాలే జరుగుతాయి." పులకించిపోతూ అంది ఆవిడ.

ఓ అరటిపండు తెచ్చి నా నోట్లో పెట్టింది.

వీరాస్వామి చేతిలో ఐదురూపాయల బిళ్ళ ఉంచింది. మావాడు సంబరపడిపోయాడు. ఎలిగేటర్‌కు డ్రెస్ వేసినట్లుగా ఉంటాడు. చూపులకు

**పల్లె గొడ్డుపోయింది. అందుకే గుంపులో గోవిందా అనుకుంటూ పట్నం వచ్చేశా. వీరాస్వామి చేరదీశాడు నన్ను. నా మెడకు తాడుకట్టి వీధులన్నీ తిప్పుతాడు. నన్ను చూపించి నాలుగు రూపాయలు సంపాదిస్తాడు. ఏమాట కామాటే చెప్పాలి. గడ్డిమేసే చాలామంది అవినీతి నాయకుల కంటే మావాడు కాస్తంత మంచోడే! ఏంటీ? నా గురించి ఇంకా తెలుసు కోవాలని ఉందా? అయితే నా కథ చదవండి మరి!**

అలా కన్పిస్తాడుగాని, మనిషి చెడ్డవాడేం కాదు. తనకు వచ్చిన డబ్బులో కొంత ఖర్చుపెట్టి నాకు పశుగ్రాసం కొంటాడు.

అవినీతి పనులు చేసి వేలకోట్లు సంపాదించి గడ్డితినే మనుషుల కంటే మా వీరాస్వామి వందరెట్లు నయం!

రైతుబజారుకని బయలుదేరిన కోడలుపిల్ల అక్కడే ఆగిపోయి అత్తగారివైపు కొరకొరా చూసింది.

షాపులో గల్లాపెట్టె దగ్గర కూర్చున్న మామగారి దగ్గర నిలబడింది. "ఇంటి పనులన్నీ నా మీద పడేసి మీ ఆవిడ గుళ్ళూ గోపురాల చుట్టూ తిరుగుతూ ఉంటుంది. మీ పెద్దబ్బాయి ఉద్యోగం సద్యోగం లేకుండా తిరుగుతూ ఉన్నాడు. మెట్రో పనుల్లో మన స్థలం పోతోంది కదా! ఆ కంపెనీవాళ్ళు మీ అబ్బాయికి ఉద్యోగం ఇస్తారేమో కనుక్కోండి!" అంది కోడలు.

తలూపాడు మామగారు.

షాపు దగ్గరకు వచ్చి "ఇంకా ఇక్కడే నిలబడ్డావే! కూరగాయలు ఎప్పుడు తెస్తావ్? వంట ఎప్పుడు చేస్తావ్? అంది అత్తగారు.

అత్తాకోడళ్ళ మాటలు పోట్లాట, కొట్లాటగా మారుతుందేమో చూసి ఆనందించవచ్చునని మా వీరాస్వామి ఇంకా అక్కడే నిలబడ్డాడు. ఎవరన్నా పోట్లాడుకుంటూ ఉంటే మా వాడికి వాళ్ళ ఆవిడ గుర్తుకు వస్తుంది. పెళ్ళాంతో పోట్లాడి ఇంట్లోంచి పారిపోయిన బాపతేగా మా వీరాస్వామి కూడా!

"అన్ని పూజలయ్యాయి గదా! ఇక్కడే నిలబడ్డావేం? వెళ్ళు...వెళ్ళు!" అంది కోడలు మావాణ్ణి చూసి.

నన్ను మరో వీధికి లాక్కెళ్ళాడు.

చెట్టు నీడలో కాసేపు నిలబడదామన్నా నన్ను నిలబడనివ్వడు మావాడు. ఎక్కువ ఇళ్ళు తిరగాలి. మరిన్ని పైసలు సంపాదించాలి" అదీ మావాడి ఆలోచన. ఆ వీధిలో ఎన్ని చెట్లుండేవో! తను కొత్తగా సిటీకి వచ్చినప్పుడు ఆ వీధి పచ్చగా కళకళలాడిపోయేది. ఇపుడు ఆ చెట్లన్నీ కొట్టేసి ఎత్తయిన భవంతులు కట్టేశారు.

అపార్టుమెంట్లు అంటే మా వీరాస్వామికి కూడా చిరాకే! నన్ను వెంటబెట్టుకుని అన్ని అపార్టుమెంట్లు తిరగలేడు. కింది అంతస్తు దగ్గర నిలబడితే పైనున్న వాళ్ళకు గోమాత వచ్చిందని ఎలా తెలుస్తుంది?

మరో ఇంటిముందుకెళ్ళాం. అక్కడ అన్నదమ్ములు పోట్లాడుకుంటున్నారు.

"అద్దె ఇంట్లో నలుగురం ఉంటున్నాం. నేను మీ వదిన, ఇద్దరు పిల్లలు... నాకు వచ్చే జీతంతో ఇల్లు గడపడం కష్టంగా ఉంది. అమ్మను నీతోపాటు తీసుకు వెళ్ళు!" అంటున్నాడు అన్నగారు.

"ఆ మాట నువ్వు అంటున్నావా? వదిన నీతో ఆ మాటలు అనిపిస్తుందా? అడిగాడు తమ్ముడు.

"వదిన ప్రస్తావన ఎందుకు మధ్యలో? చిన్నప్పుడు అమ్మ పక్కలో నువ్వే పడుకునేవాడివి. నన్ను దగ్గరకు రానిచ్చేవాడివి కాదు. అమ్మనాది! అనేవాడివి! ఇప్పుడేమో 'అమ్మ నీది!' అంటున్నావ్!" అన్నాడు అన్న.

"చదువుకునే రోజుల్లో నీ ఫీజులకి, పుస్తకాలకు అక్కయ్య దగ్గర డబ్బులు తీసుకునేవాడివి. ఆమె కూతుర్ని చేసుకుంటానని మాట ఇచ్చావ్. కాలేజీలో నీతోపాటు చదువుకుంటున్న అమ్మాయిని ప్రేమించి పెళ్ళి చేసుకున్నావు. అక్కయ్యను పలుకరించడానికి క్కూడా నీకు సమయం దొరకడం లేదు" అన్నాడు తమ్ముడు.

"గురివిందకు తనకింద ఉన్న నలుపు తెలియదట! నాన్న చేత పొలం అమ్మించి నీ కూతురి పెళ్ళి ఘనంగా చేశావ్. పొలం అమ్మగా వచ్చిన డబ్బులో సగం నాక్కూడా రావాలి! నాకు తెలియకుండా నాన్న చేత పొలం అమ్మించావ్! కమర్షియల్ టాక్స్ అధికారిని అల్లుడిగా చేసుకున్నావు. ఇంటినిండా డబ్బులే!

## ప్రియుడిని దారిలోకి తెచ్చుకుంది



చెబుతోంది నయనతార గురించే! రెండుసార్లు ప్రేమ విఫలం అయ్యాక మూడోసారి ప్రేమ ఊసే ఎత్తదని చాలామంది ఊహించారు. అందరి అంచనాలు తలకిందులు చేస్తూ కోలీవుడ్ డైరెక్టర్ విఘ్నేష్‌తో ప్రేమలో పడడంతో పాటు రహస్యంగా అతగాడిని పెళ్ళి కూడా చేసేసుకుందని అంటున్నారు. ఇప్పుడు ఈ విషయం బాగా పాపులర్ అయింది. తమ పెళ్ళి విషయం బయటకి చెప్పేద్దామని విఘ్నేష్ నయనకు ఎంత నచ్చచెప్పినా, ఆమె వినలేదనీ ఈ విషయంలో ఇద్దరి మధ్యా చిన్నపాటి గొడవ కూడా జరిగిందనీ అంటున్నారు. చివరకి విఘ్నేష్ దారిలోకి వచ్చి కాంప్రమైజ్ అయ్యాడట! గతంలోలాగా కాకుండా ఈ సారి నయన తన ప్రియుడినే దారిలోకి తెచ్చుకుంది అంటున్నారు తమిళ తంబీలు.

"తాతముత్తాతల ఆస్తికాదు అమ్మిన పొలం. నాన్న చెమటోడ్చి కొనుక్కున్న పొలం అది. ఆయన ఇష్టం. అమ్మేసి మనవరాలికి కట్నంగా ఇచ్చారు. నువ్వు టౌనులో ఇల్లు అమ్మించి నీ కొడుకును అమెరికా యం.ఎస్ చదివిచడానికి పంపలేదూ! నీ కొడుకు కోసమే గదా, నాన్న టౌనులో ఇల్లు అమ్మింది".

"షటప్"

"యూ..షటప్!"

చిద్విలాసంగా నవ్వుతూ నిలబడ్డాడు వీరాస్వామి.

ఎండలో రోడ్లమీద తిరుగుతూ ఉండేసరికి నాకు తలనొప్పి మొదలయ్యింది. 'అంబా' అని అరిచాను.

నా బాధ అర్థం చేసుకున్నాడు. నా గంగడోలు నిమిరి నీడలోకి తీసుకెళ్ళాడు. ఇంటివాళ్ళను అడిగి ఓ బకెట్ నీళ్ళు తెచ్చి నా ముందు ఉంచాడు.

నిమిషంలో బకెట్‌లో నీళ్ళు పీల్చేశాను.

దాహం తీరక మోర ఎత్తిపెట్టి ఇంటి ఓనర్‌వైపు చూశాను.




"ఈరోజు నల్లానీళ్ళు రాలేదు. మున్సిపల్ ట్యాంకర్ వాడు కూడా రాలేదు. నా స్నానానికి ఉంచుకున్న నీళ్ళు తెచ్చి నీకు ఇచ్చాను. మరో బకెట్ నీళ్ళంటే నేను ఎక్కడనుంచి తెచ్చేది! ఎక్కడ చూసినా వైన్‌షాపులు కనబడుతున్నాయిగానీ మంచినీళ్ళు దొరకడం లేదు." అన్నాడు ఇంటి ఓనరు నా చూపులు గమనించి.

నా మెళ్ళో పలుపు లాగుతూ మరో రోడ్డుకు తీసుకువెళ్ళాడు.

మధ్యాహ్నం ఒంటిగంట సమయానికి మెల్లిగా ఓ చెట్టుకిందకు చేరాం.

తలకు చుట్టుకున్న తుండుగుడ్డ నేలమీద పరుచుకుని పడుకున్నాడు వీరాస్వామి. మావాడికి పడుకోగానే నిద్రపట్టేసింది.

నేను కాళ్ళు మడిచి పడుకుని ఉదయం తిన్న గడ్డిని మళ్ళీ నోట్లోకి తెచ్చుకుని నెమరు వెయ్యడం మొదలుపెట్టాను.

పల్లీలు బుట్ట పట్టుకుని చెట్టు కిందకు చేరాడు ఓ ముసలాయన.

గడ్డి నెమరువేస్తూ ఆ పెద్దాయన వైపు చూశాను.

ఎక్కడో ఆ మనిషిని చూసిన జ్ఞాపకం!

రెండు నిమిషాల తర్వాత గుర్తుకువచ్చింది ఆయన ఎవరో!

మా ఊరు మనిషే! నాకు బాగానే గుర్తున్నాడు.

రెండెకరాల పొలం ఉండేది. నా తమ్ముళ్ళు ఇద్దరిని అరకకు కట్టి పొలం దున్నుకునేవాడు. ఇప్పుడు పొలం అమ్ముకుని పట్నం చేరి పల్లీలు అమ్ముకుంటున్నాడు.

వీరాస్వామికి మెలకువ వచ్చి ఆ ముసలాయన్ని పలకరించాడు. రూపాయి ఇచ్చి వేరుశనక్కాయలు కొనుక్కుని తింటూ ముసలాయన కష్టాలు ఆలకించాడు. వ్యవసాయం గిట్టుబాటు కాకపోవడం, రెండు ఎకరాలు అమ్ముకుని పట్నం చేరడం దగ్గరనుంచి పట్నంలో పడుతున్న ఇబ్బందుల గురించి పూసగుచ్చినట్లు చెప్పుకుపోయాడా ముసలాయన.

కొడుకులిద్దరూ కాఫీ హోటల్ పెట్టుకుని నిలదొక్కుకునే ప్రయత్నం చేస్తుంటే అవాంతరం వచ్చిపడిందట. రౌడీలు తాగేసి హోటల్ దగ్గరకు వచ్చి అల్లరి చేయడం, అడ్డుపడిన ఇద్దరు కొడుకుల్ని చితకబాదటం అన్నీ వరసగా జరిగిపోయాయి. ఆసుపత్రి ఖర్చుల కోసం కాఫీహోటల్‌లోని బల్లలు, సామాను కూడా అమ్ముకోవాల్సి వచ్చిందట. చివరకు కొడుకులిద్దరూ తోపుడుబళ్ళమీద కూరగాయలు, అరటిపళ్ళు పెట్టుకుని అమ్ముకుంటూ రోజులు గడుపుతున్నారట.

"మళ్ళీ మీ ఊరు వెళ్ళి వ్యవసాయ పనులు చేస్తూ బతకొచ్చుగదా?" అన్నాడు వీరాస్వామి.

"పల్లెల్లో కూలిపనులు చేసుకుని బతికే పరిస్థితి లేదు. సంవత్సరంలో పొలం పనులు ఉండేది మూడు నెలలే. పల్లెలు కళ తప్పాయి. నాయకుల దృష్టి పట్టణాలమీదేగాని పల్లెపట్టుమీద ఉండటం లేదు. పశువుల్ని పెంచుకుని పాల వ్యాపారం చేద్దామన్నా తాగడానికి నీళ్ళు, పశుగ్రాసం దొరకడం లేదు. మా చిన్నప్పుడు చెరువుల్లో ఈతకొట్టేవాళ్ళం. పొలం గట్టుమీద కూర్చుని కందికాయలు, పెసరకాయలు తినేవాళ్ళం! చెరువులు ఎండిపోయాయి. పశువులకోసం జనుము, పిల్లిపెసర పైరు వేసేవాళ్ళు. ఎడ్లపందాలు జరిగేవి. వాటిని చూడటానికి చుట్టుపక్కల పల్లెల నుంచి జనం తిరునాళ్ళకు వచ్చినట్లు వచ్చేవాళ్ళు! ప్రతి ఇంటి దగ్గర పశువుల చావిడి ఉండేది!. 'ఏరువాక' ఓ పండుగలా సాగేది. మృగశిర కార్తె మొదటిరోజున రైతులు ఎద్దులను అలంకరించి మెడమీద భూమిని దున్నే నాగలికర్రను ఉంచి చాళ్ళను దున్నేవారు. సంక్రాంతి వచ్చిందంటే పల్లెలన్నీ సందడిగా ఉండేవి. గొబ్బిపాటలు, రథం ముగ్గులు, గంగిరెద్దు ఆటలు, హరిదాసుల పాటలు, పశువులను దేవతలుగా కొలవడం, వాటిని అలంకరించి గుడిచుట్టూ తిప్పడం... ఆ సంబరాలు తలుచుకుంటేనే ఒళ్ళు పులకరించిపోతుంది. మళ్ళీ అటువంటి రోజులు వస్తే నా కొడుకులు తిరిగి పల్లెలకు పయనమవుతారు" అన్నాడు ముసలాయన.

ముసలాయన మాటలు సంతోషం, దుఃఖం రెండూ కలిగించాయి. పశువులు, పాడిపంటలతో పల్లెలు కళకళలాడిన ఒకనాటి రోజుల గురించి చెబుతుంటే ఆనందం కలిగింది. బీటలువారిన పొలాలు, భూముల్లో అడుగంటిపోయిన జల, పట్టణాలకు వలసలబాట లాంటివన్నీ చెబుతుంటే ఎంతోబాధ కలిగింది. ముసలాయన కొడుకులు పల్లెకు తిరిగి వెళ్ళిపోవాలనే కోరుకున్నాను.

"మరి నీ సంగతో?" అడిగాడు వీరాస్వామి, ముసలాయన్ని.

"నేను చనిపోయేనాటికైనా పల్లెలు బాగుపడతాయనే నమ్మకం నాలోలేదు. కళకళలాడే పల్లెప్రాంతాలను కనీసం నా మనవళ్ళన్నా చూస్తారనే ఆశ మాత్రం మిగిలింది." అన్నాడు పెద్దాయన.

ముసలాయన వెళ్ళిపోయాక మరో వీధికి బయలుదేరాం. వీరాస్వామి వెనుకే నడవక తప్పలేదు. అతనితో పెనుగులాడలేని బంధం ఉందనిపించింది. ఇతరుల కోసం బతకడంలోనే ఆనందం ఉందేమో!

గుడిదగ్గరకు తీసుకువెళ్ళాడు.

అక్కడ డబ్బులు ఎక్కువ వస్తాయని అతని నమ్మకం.

గుడి ఆవరణలో గోశాల కనిపించింది. గోపూజకు వంద రూపాయలు, గోవులకు మేత కొనడానికి వారానికి రెండువేలు దాతలు ఇవ్వాలని బోర్డు మీద రాసి ఉంది.

గోశాలలో దృఢంగా ఉన్న గోవులు, రెండు ఆవు దూడలు కనిపించాయి. వాటిముందు పచ్చిగడ్డి కనిపించింది.

నోట్లో లాలాజలం ఊరింది.

అనాథాశ్రమంలోని పిల్లాడు ధనవంతుడి ఇంటి ముందు ఆడుకుంటున్న పిల్లాడిని చూసినట్లు గోశాలలోని ఆవులకేసి చూశాను.

నన్ను ఎక్కువసేపు అక్కడ నిలబడనివ్వలేదు వీరాస్వామి. మురికివాడల్లోని పిల్లాడు సినిమా థియేటర్లో కూర్చుని విదేశాల్లో చిత్రీకరించిన సన్నివేశాలు నోరు తెరుచుకుని చూస్తున్నట్లు నేను గోశాలకేసి చూడటం మా వీరాస్వామికి నచ్చలేదు.

చీకటి పడే సమయానికి నగరం పొలిమేరల్లో ఉన్న గుడిసెకు చేరుకున్నాం.

నన్ను ఓ చెట్టుకు కట్టేసి ఎక్కడికో వెళ్ళాడు. నా మొహాన కాస్త మేతపడేసి బలాదూర్‌గా తిరగొచ్చుగదా!

బాగా తాగి వచ్చాడు వీరాస్వామి. కాసేపు నవ్వుతూ పాటలు పాడాడు. ఆ తరువాత తన బతుకు సర్వనాశనం అయ్యిందని అందరినీ తిట్టుకున్నాడు. పెళ్ళాం పక్కలో వెచ్చగా పడుకునే అదృష్టం కలుగలేదని మథనపడ్డాడు.

అన్నీ అయ్యాక, మత్తు దిగాక నావైపు చూశాడు. చీకట్లో నా కళ్ళు మెరవడం గమనించాడు. ఆకలితో నకనకలాడుతున్నానని తెలుసుకున్నాడు.

మళ్ళీ ఎక్కడికో వెళ్ళాడు.

అరగంట తరువాత గడ్డిమోపు నెత్తిన పెట్టుకుని వచ్చాడు. అదే అతనికీ నాకూ ఉన్న సంబంధం!

**సెల్ 99 08 58 78 76**

# జన్మపత్రిక

రమేశ్చంద్ర మహర్షి
సెల్ : 92 46 58 22 55
040-65 22 55 54
rameschandramaharishi.com



భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశం అనే పంచ భూతాలూ, అహంకారం, బుద్ధి, ప్రకృతి, పంచ జ్ఞానేంద్రియాలు, మనసూ అనే పదకొండు ఇంద్రియాలూ, శబ్ద, రూప, స్పర్శ, రసగంధాలనే ఇంద్రియ విషయాలూ కోరిక, ద్వేషం, తెలివి, సుఖం, దుఃఖం, ధైర్యం... వీటి వికారాలూ కలిసి ఏర్పడే క్షేత్రం... మనిషి! ఆ మనిషికి భవిష్యత్తనే దారి చూపే నేత్రం, జ్యోతిశ్శాస్త్రం!!

★ ★ ★

ఎన్ని శతాబ్దాలు గడిచినా మనిషి ఒక కొలిక్కి రాలేని విషయం..

Life is more by accident than design... నిజమా

లేక life is more by design than accident నిజమా ... అన్నది.

గోడ మీద నుండి పతనం కావడం భవిష్యత్తు అని నిర్ధారించబడి ఉంటే "పడడం" accident! "దూకడం" design! భవిష్యత్ ముందే తెలిస్తే పడడాన్ని దూకడంగా మలచుకోవచ్చు.

కృతే కార్యే కింముహూర్త ప్రశ్నేన? పని ముగిసిన పిదప ముహూర్తమడగడం, జరగకూడనిది జరిగిపోయాక పరిహారాలు పాటించడం వలన ఏమిటీ ప్రయోజనం?

భవిష్యత్ ముందే తెలిస్తే ముప్పు నుండి తప్పించుకోవడం లేదా తగ్గించుకోవడం సాధ్యమే!

కాలః క్రీడతి గచ్ఛత్యాయుః

కాలం ఆడుకుంటూ ఉంటుంది. ఆయువు గతించిపోతూ ఉంటుంది. రాబోయే మంచి చెడులు తెలిస్తే ఉన్నంతలోనే ఉన్నతంగా జీవించగలుగుతాం!

వయం భగవంతః స్యామ!

| | | | |
|---|---|---|---|
| | (గు) (శ) | | |
| | రాశి | | రా |
| కే | | | |
| కు | (బు) చం | ర | శు |

| | | | |
|---|---|---|---|
| | గు శ | | |
| | భావ | | రా |
| కే | | | |
| కు | బు చం | ర | శు |

| | | | |
|---|---|---|---|
| శు | కే | ర గు | |
| | నవాంశ | | |
| | | | బు |
| చం | కు | రా | శ |

❖ ఈ జన్మకుండలి ప్రకారం

**కంట్రోలింగ్ ఫేక్టర్స్ :** బుధునికి శని శుక్రులు. కేతువుకు చంద్ర రాహువులు. శుక్రునికి రవి కేతువులు. రవికి గురు శనులు. చంద్రునికి బుధ రాహువులు. కుజునికి శుక్ర బుధ గురు శని చంద్రులు.

**యోగాలు :** 1) పరివర్తన యోగం. 2) ఉభయ చర యోగం.

ఇక్కడ పరివర్తన యోగం పనిచేసే తీరు అద్భుతం. ఈ ఒక్క యోగం మీద ఈ జన్మకుండలి మొత్తం ఆధారపడి నడుస్తుందంటే దాని బలం అర్థం చేసుకోవచ్చు. ధన దశమాధిపతుల మధ్య పరివర్తన. భాగ్యాధిపతికి దశమ స్థితి, దశమాధిపతికి స్వక్షేత్ర వీక్షణ, అది తిరిగి వాక్ స్థానాధిపతిగా... కారకునిగా... వెరసి, వృత్తి ఒక ప్రొఫెసర్ కీ, జ్యోతిషవేత్తకీ మధ్య పోటీ నడుస్తుంది. అయితే వాక్ స్థానంలో శని, స్థానం మీద రవి వీక్షణ కలిసి వృత్తిని ఎట్టి పరిస్థితులలోనూ జ్యోతిషం మీదకి పోనిచ్చే అవకాశమే ఉండదు. మహా అయితే ఆ శాస్త్రం మీద మంచి ఆసక్తి ఉంటుంది! ఇక మిగిలింది ప్రొఫెసర్ కావడం. ఒక మామూలు లెక్చరర్‌గా ప్రారంభించే కెరీర్ ప్రొఫెసర్‌గా ప్రిన్సిపాల్‌గా ఇంకా అత్యున్నత స్థితిని చేరుకునే ఒక మహా ప్రతిభావంతుని జన్మకుండలి ఇది! దీనంతటికీ మూల స్తంభం లాంటి కాంబినేషన్... విద్యా స్థానాధిపతి భాగ్యంలో, రాజయోగంలో ఇమిడి ఉండడం! డిగ్రీ స్థానం మీద ఇంజినీరింగ్ కాంబినేషన్ ప్రభావం, పిజి స్థానం మీద బిజినెస్ ఎడ్మినిస్ట్రేషన్ ప్రభావం, రాజయోగం, విద్యా కారకునికి లాభంలో పడిన కేతువు కంట్రోలింగ్ ఫేక్టర్ కావడం వంటి కొన్ని కారణాల వలన ఒక ఇంజినీరింగ్ డిగ్రీ, ఒకటి కంటే ఎక్కువ పోస్ట్‌గ్రాడ్యుయేషన్‌లో డిగ్రీలు ఉంటాయి. అయితే అన్నీ ఆడుతూ పాడుతూ లభించేవే! గత కొన్ని జన్మల నుండి బాగా చదువుకున్న వ్యక్తి కావడం వలన ఈ జాతకునికి ఏ డిగ్రీ చదివినా కొత్తగా అనిపించదు. అన్నీ అవలీలగా బోధపడిపోతూ ఉంటాయి. ఎటొచ్చీ నేర్పించాల్సింది డిసిప్లిన్! శక్తిని ఒక పద్ధతిలో ఉపయోగించుకునే క్రమశిక్షణ!!

ఏది ఏమైనప్పటికీ దశమంలో దిగ్బలం పొందిన అదృష్టం కురిపించే కుజుని బలం వలన వృత్తిలో అసాధారణమైన స్థితి, లాభాధిపతి ధన స్థానంలో స్థితి పొంది తిరిగి లాభాన్ని వీక్షించుకుంటున్న వైనం... దశమ లాభాధిపతుల ధన స్థాన స్థితి... వృత్తి ద్వారా ఎంత సంపాదన అనేది లెక్కకట్టుకోవచ్చు. లెక్క కట్టలేనంత అని అర్థమవుతుంది!

అయితే షష్ఠమాధిపతికి అష్టమంలో నీచ స్థితి. ఇది పాక్షిక విపరీత రాజయోగం ఇవ్వడం అటుంచి ఉద్యోగంలో ముఖా ముఖీ బాహాబాహీ యుద్ధం చేసే శత్రువులనిస్తుంది. దీనికి తోడు అష్టమాధిపతికి సప్తమ స్థితి. ఈ జాతకుని ఆయుష్షుని నిర్ధారించే ఈ రెండు కాంబినేషన్స్‌కీ గట్టి రెమిడీస్ పాటించక పోతే, జీవితం అధిక రక్తపోటు ఆడుకునే పాలై పోతుంది!

ఇక వివాహం విషయానికి వస్తే... లవ్ మ్యారేజ్. అధిపతికి చంద్రుని సాంగత్యం, స్థానంలో శుక్రుని స్థితీ వంటి కాంబినేషన్స్ వలన ప్రేమ వివాహం అనివార్యం. అమ్మాయి చూడ్డానికి కులూ మనాలి! ఇంక ఏమనాలి? 26వ ఏట వివాహం. 27వ ఏట సంతానం. తలక్రిందులుగా తపస్సు చేసినా అబ్బాయి పుట్టే అవకాశం ఉండదు. అమ్మాయికి రాజయోగం ఉంటుంది. విదేశాల్లో స్థిరపడడం జరుగుతుంది. ఆమె రవి కుజులకు గట్టి రెమిడీస్ పాటిస్తే ఆమెకుండే చాలా సమస్యలు ముఖ్యంగా ఆరోగ్య సమస్య నుండి బయట పడడం జరుగుతుంది. ఏ బృహస్పతి వలన అయితే ఈ జాతకుడు ఎంతగానో లబ్ధి పొందడం జరిగిందో అదే గురుని వలన కూతురికి కూడా రాజయోగం ఉండడం అదృష్టమే.

ఈ జాతకుని విషయానికొస్తే గృహయోగం అసాధారణం. 38వ ఏట పెలాషియల్ బిల్డింగ్. రవి దశలో చాలాసార్లు అశాంతి కలుగుతుంది. అంటే 41 నుండి 47 మధ్య. 47 నుండి 57 ఏళ్ళ మధ్య వయసులో అంటే చంద్ర దశలో పూర్తి స్థాయి రాజయోగం. చెప్పింది శాసనం. వద్దంటే విదేశయానం.

రెమిడీస్‌గా కనకపుష్యరాగం+పగడం ధరించాలి. ఏలినాటి శని మొదటి స్పెల్‌కీ, రవిశుక్రులకూ గట్టి రెమిడీస్ పాటించాలి. ఎలా జరిగేది అలా జరుగుతుంది కదా. రెమిడీస్ పాటించడం ఎందుకూ అంటే దశరథ మహారాజు సంతానం కోసం ఎందుకు యాగం చేసేడు. యాగం చేయకపోయినా ముగ్గురు భార్యలూ పాయసం తాగక పోయినా సంతానయోగం అంటూ ఉంటే జన్మించే తీరతారు కదా!

**శక్తి యుక్తులు :** 1) లోడ్స్ ఆఫ్ ఎక్స్‌పీరియెన్స్! 2)ఈ జాతకుని ఆలోచనా విధానంలో ఎంతటి పరిపక్వత ఉంటుందంటే నిజానికి ఇదే అతని ఆయుధం! ఈ రోజుంటాం రేపు పోతాం! న నిత్యం లభతే దుఃఖం న నిత్యం లభతే సుఖమ్!

చంద్రుడు నీచ పట్టినా రాజయోగంలో ఉండడం వలన ఇంతటి మానసిక వైశాల్యం!




**ఇటు దివిజులు, అటు దైత్యులు...రెండు వాహినులూ ఘోరసాగరాల్లా చెలరేగారు. ఒకరుపై ఒకరు విజృంభించారు. విష్ణుమూర్తి చక్రగదా శార్ఙాయుధాలు ధరించి, గరుత్మంతుని అధిరోహించాడప్పుడు. యుద్ధోన్ముఖుడయ్యాడు. దేవతల జయజయధ్వానాలందుకున్నాడు. అంతకు ముందే రాక్షసులతో దేవేంద్రుడు యుద్ధాన్ని ప్రారంభించాడు. ఇరు వర్గాలూ బలంగా తలపడ్డాయి. ఎవరికెవరూ తీసిపోలేదు. కాసేపటికి దేవతలు వెనకడుగు వేయాల్సి వచ్చింది. రాక్షసులు వారిని గట్టిగా ఎదుర్కొన్నారు. అంతలో రథగజతురంగమాలు యుద్ధానికి సిద్ధమయ్యాయి. ఎడతెగనిపోరాటం చేశాయి. వాటిని అదిలిస్తూ శూరభటులు చేసిన అరుపులు మిన్నంటాయి.**

# దేవదానవుల యుద్ధం:బడబాగ్నిజననం

ఉభయవాహినులలోని వీరులు గాయపడడంతో అక్కడ రక్తం ఏరులై పారింది. రాక్షసనేతలు చాలామంది మరణించారు. మిగిలినవారు చనిపోయిన రాక్షసనేతలను చూసి తట్టుకోలేకపోయారు. కోపోద్రిక్తులయి తలపడ్డారు. దేవతలపై మాయాపాశాలను ప్రయోగించారు. విపరీతగర్వంతో గొంతెత్తి గర్జించారు. దేవతలకి కరచరణాలాడలేదు. అవయవాలన్నీ తాళ్ళతో కట్టినట్టుగా అనిపించి, కదలలేకపోయారు. వారిలాగే రథగజాశ్వాలు ఎక్కడివక్కడే నిలబడిపోయాయి. ప్రాణభీతితో దేవతలంతా గజగజలాడారు. గమనించాడది దేవేంద్రుడు. శత్రువుల మాయను పటాపంచలు చేసేందుకు అనేక బాణాలను ఒక్కసారిగా ప్రయోగించాడు. ఆ బాణాలన్నీ ఆకాశాన్ని కప్పేశాయి. అంతటా చీకటి అలముకుందప్పుడు. ఆ చీకటిలో దానవులు తమవారెవరో, పైవారెవరో తెలుసుకోలేక తికమకపడ్డారు. అదే అదునుగా దేవతలు విజృంభించారు. దానవులను సంహరించారు.

జరుగుతున్న దానిని చూసి రోషభీషణాక్షుడైపోయాడు మయాసురుడు. నేత్రాంతాలతో శత్రువులపై 'ఔర్యం' అన్న మహామాయ ప్రయోగించాడు. అది జ్వాలలా లేచి, దేవేంద్రుడు సృష్టించిన చీకటిని తుత్తునియలు చేసింది. అనేకమంది దేవతలను అతలాకుతలం చేసింది. వారి ప్రాణాలు బలిగొంది. ఇంకా జ్వలిస్తూ పైపైకి రావడంతో ప్రాణాలు అరచేతిలో పెట్టుకుని దేవతలంతా పరుగుదీశారు. జ్వాలకు అందక సముద్రజలాల్లో దాగున్నారు. ప్రాణాలు కాపాడుకున్నారు. ప్రజ్వరిల్లుతున్న జ్వాలను అడ్డగించేందుకు ఏం చెయ్యాలో తోచలేదు దేవేంద్రునికి. వరుణదేవుణ్ణి సమీపించాడు. జ్వాలను అర్పివేసే ఉపాయం తెలియజేయమన్నాడు. తన అశక్తతను తెలియజేశాడు వరుణదేవుడు. ఆ మహాగ్ని జ్వాల కథంతా తెలియజేశాడిలా.

పూర్వం ఔర్వుడు అన్న మహాముని బ్రహ్మచర్యం స్వీకరించి, చాలా ఏళ్ళపాటు తపస్సాచరించాడు. ఆ తాపాన్ని లోకాలు భరించలేకపోయాయి. తల్లడిల్లాయి. దేవతలు, ఋషీశ్వరులు, హిరణ్యకశిపుడు మొదలైన రాక్షసులు ఆ తాపాన్ని తట్టుకోలేకపోయారు. ఆందోళన చెందారంతా. పరుగున వచ్చి ఔర్వుణ్ణి సమీపించారు.

మహామునీ! చిన్ననాటి నుండి నువ్వు ఇలా బ్రహ్మచర్యవ్రతాన్ని పాటిస్తే నీ వంశం ఏమవుతోందో ఆలోచించావా? నిర్వంశం అయిపోతుంది. తపశ్చర్యకు ఇది అవసరం లేదు. గొప్పగొప్ప మునిపుంగవులంతా గృహిణీసమేతులై ఉండడం నీకు తెలియంది కాదు. దయచేసి పెళ్ళి చేసుకో! మేము నీ మంచికే చెబుతున్నాం అన్నారు. దానికి ఔర్వుడు సన్నగా నవ్వి అన్నాడిలా.

ఆ బ్రహ్మే దిగివచ్చి చెప్పినా నేను ఈ బ్రహ్మచర్యవ్రతాన్ని విరమించేదిలేదు. వేదాధ్యయనం, యజ్ఞాచరణం, సంతానోత్పత్తి అన్నవి గృహస్థులకు ముఖ్యమైనవి అయినా ఆ దారిలో నడవడం నాకు ఇష్టం లేదు. నేను వానప్రస్థాశ్రమవ్రతం పాటిస్తున్నాను. నిరాహారం, పవన జలాద్యాహారభక్షణం, పంచాగ్నిమధ్య తపస్సు మొదలైనవి వానప్రస్థులకు అత్యంత ముఖ్యం. ఇవన్నీ నేను ఈ బ్రహ్మచర్యవ్రతంలోనే సాధించగలననిపిస్తోంది. తరుణీసాంగత్యం యోగనిష్ఠకు అవరోధమే! అందులో అనుమానం లేదు.

అదికాదు...అంటూ ఏదో చెప్పబోయిన మాటలకు అడ్డు తగులుతూ అన్నాడిలా మళ్ళీ ఔర్వుడు.

బ్రహ్మచర్యం వద్దని మీరు అనడం భావ్యంగా లేదు. సంతతి సాధించాలని మీరు అంటున్నారు కాబట్టి, మీ ఆజ్ఞ పాటిస్తూ నా బ్రహ్మచర్యానికి ఏమాత్రం లోపం రాకుండా ప్రవర్తిస్తాను, చూడండిటు.

చూడసాగారంతా.

ఔర్వుడు అత్యద్భుత శరీరంతో మెరిసిపోసాగాడు. ఎలాంటి అపాయాన్నయినా తట్టుకోగలిగేలా గోచరించాడు. అక్కడ ఉన్న అగ్నిజ్వాలల్లో తన తొడను ఉంచి, దానిని దర్భతో మధించాడు. అరణిలా మధించిన దాని నుండి అప్పుడు ఒక అగ్ని ఆవిర్భవించింది. దానిని కూడా అంతా 'ఔర్వుడు' అనే వ్యవహరించారు. పుట్టినంతనే ఎర్రెర్రని మంటలతో అంతటా వ్యాపించిన ఆ దహనకుమారుడు, తండ్రి ముందు చేతులు జోడించి నమస్కరించి నిల్చున్నాడు.

తండ్రీ! ఆకలి విపరీతంగా ఉంది. తట్టుకోలేకపోతున్నాను. అనుమతి ప్రసాదించు. ఈ జగత్తులన్నిటినీ దహించి నా ఆకలి తీర్చుకుంటాను అన్నాడు.

అంతలో అక్కడ బ్రహ్మదేవుడు ప్రత్యక్షమయ్యాడు. అతన్ని చూసి ఔర్వమునిసహా అంతా చేతులు జోడించి నమస్కరించారు. మునిని చూసి అన్నాడిలా బ్రహ్మదేవుడు.

మునీంద్రా! నీ పుత్రునికి ఆహారంసహా అన్ని విధాలా అనువైన నివాసాన్ని కూడా నేనే ఏర్పాటు చేస్తాను. అయితే ఒకమాట! అతను లోకదహనానికి దూరంగా ఉండాలి. దూరంగా ఉండమని తండ్రిగా నువ్వు అతన్ని ఆజ్ఞాపించాలి.

తప్పకుండా! కరుణార్ద్రదృష్టితో నా కుమారుణ్ణి నువ్వే చేరదీస్తున్నప్పుడు, నేను ఆజ్ఞాపించడానికి ఏమున్నది స్వామి? నువ్వు ఎలా చెబితే అలాగే అన్నాడు ముని.

అయితే విను! నీ కుమారుడు ఇక మీదట ఆడగుర్రం ముఖాన్ని ధరిస్తాడు. 'బడబాగ్ని' పేరుతో సముద్రంలో ఉండి, నీరును స్వీకరిస్తాడు. ప్రళయకాలంలో నా రౌద్రతేజాన్ని స్వీకరించి, లోకాలన్నిటినీ ఒక్క క్షణంలో భస్మీపటలం చేస్తాడు అన్నాడు బ్రహ్మ.

బ్రహ్మదేవుని మాటలు విన్నావు కదా! ఆ దేవుడు ఆదేశించినట్టుగానే నువ్వు ప్రవర్తించాలి. అందుకు భిన్నంగా ప్రవర్తించి నాకు అమర్యాద తీసుకురాకు అన్నాడు కుమారునితో ఔర్వుడు. అలాగే అన్నాడు కుమారుడు. వెంటనే తన తేజస్సును ఉపసంహరించుకున్నాడు. సాగరగర్భంలోనికి ప్రవేశించాడు. ఔర్వముని కుమారుడు సాగరగర్భంలోనికి ప్రవేశించ

**దేవతలు, ఋషులు, రాక్షసులంతా ఆ మహామునినే తదేకంగా చూడసాగారు. తన తొడను అగ్నిజ్వాలల్లో ఉంచి దర్భతో అరణిలా మథించాడతడు. ఆ మథనంలోంచి జన్మించాడు దహనకుమారుడు. పుడుతూనే ఆకలి..ఆకలి అంటూ అలమటించసాగాడు. లోకాలను దహించివేసేందుకు అనుజ్ఞనిమ్మని అడిగాడు తండ్రిని. ఆ మహాముని అతణ్ణి ఎందుకు సృష్టించాడు ?**



డంతో బ్రహ్మసహా దేవతలు, ఋషీశ్వరులంతా నిష్క్రమించారక్కణ్ణుంచి. నిష్క్రమించనిది రాక్షసులొక్కరే! వారిలో హిరణ్యకశిపుడు దూరాలోచన చేసి, మునిని సమీపించాడు. ప్రార్థించాడిలా.

మహాత్మా! సాక్షాత్తు ఆ బ్రహ్మదేవుడే నీ ఆశ్రమం ముందు సాక్షాత్కరించి, నీ కుమారుని వల్ల ఎలాంటి ప్రమాదమూ సంభవించరాదని నిన్ను వేడుకున్నాడంటే... నీ తపశ్శక్తి ఎంతటిదో నాకు అర్థమయింది. దయచేసి ఈ క్షణం నుంచి నన్ను నీ శిష్యునిగా స్వీకరించు. స్వీకరించి సర్వాపదల నుండి నన్ను రక్షించగలిగే విద్యను అనుగ్రహించు.

హిరణ్యకశిపుని మాటలకు సన్నగా నవ్వాడు ఔర్వుడు. అన్నాడిలా.

రాక్షసేంద్రా! భువనాలనన్నిటినీ ఆక్రమించుకున్న నువ్వు చేతులు జోడించి నన్ను ప్రార్థించడం ఆనందంగా ఉంది. ఈ ఆనందంలో నీకు ఓ వరం ఇస్తున్నాను. నా కుమారుడు కట్టెలక్కరలేకుండానే ప్రజ్వలించే అగ్నివిద్య నీకు అనుగ్రహిస్తున్నాను. దీనిని ఒక్క చంద్రుడు తప్ప వేరెవరూ నిరోధించడం కష్టం. దీంతో నువ్వు శత్రువులను ఇట్టే జయించగలవు. అంతేకాదు, పగవారిని ఎదుర్కొన్నప్పుడు నీ వంశంలోని వారందరికీ ఈ విద్య తోడ్పడుతుంది.

జరిగిందంతా దేవేంద్రునికి చెప్పాడు వరుణదేవుడు. వెంటనే అన్నాడిలా.

ఆనాడు లభించిన ఆ అగ్నివిద్య రాక్షసవంశంలోని మయునికి సంప్రాప్తించి, ఈనాడిలా మనకు ఇన్ని కష్టాలను తెచ్చి పెట్టింది. దీన్ని ఎదుర్కోవాలంటే నాతో పాటుగా చంద్రుడు కూడా ఉండాలి. చంద్రుని ఆదేశించు, నాకు సాయపడమను. ఇద్దరం కలసి, ఈ దహనకీల అంతటినీ నిర్మూలిస్తాం.

చంద్రుణ్ణి పిలిచాడు దేవేంద్రుడు. అతనిని ఆదేశించాడిలా.

వరుణదేవునితో కలసి, నువ్వు వెంటనే ఈ ఔర్వాగ్నిభీతిని తొలగించు.

ఆజ్ఞ అన్నాడు చంద్రుడు. వెంటనే తన చల్లని కిరణాలతో భూనభోంతరాళం వ్యాపించాడు. అతడలా వ్యాపించడంతో ఔర్వాగ్ని జ్వాలలన్నీ నశించాయి. దానితో పాటు అగ్నికీలల మాయకూడా ముగిసిపోయింది. దాంతో రాక్షసులకేం చెయ్యాలో అంతుచిక్కలేదు. చంద్రుడు అంతటితో ఊరుకోలేదు. పొగమంచు కురిపించాడు. దానిని భరించడం రాక్షసుల వల్ల కాలేదు. అంతా మూర్ఛపోయారు. అదే అవకాశంగా వరుణదేవుడు తన తీవ్రపాశ ప్రయోగంతో రాక్షసులందరినీ సంహరించాడు.

చంద్రవరుణలచే ఛిన్నాభిన్నమైన తన సైన్యాన్ని గమనించి, మయుడు ఎంతో చింతించాడు. తర్వాత సాలోచనగా చూసి, కుమారుడు క్రౌంచుడు నిర్మించిన పార్వతి అన్న శక్తిని అభిమంత్రించి శత్రువులపై ప్రయోగించాడు. దాని ప్రభావంతో మరుక్షణంలోనే పెద్దపెద్ద పలుగురాళ్ళతో, సింహాలు, పెద్దపులులు మొదలైన క్రూరమృగాల గర్జనలతో, గుహలతో, విరిగిపడుతున్న వృక్షాలతో భయంకరమైన పర్వతాలు వెలిశాయి. పర్వతాల నుండి గండశిలలు ఊహించని విధంగా దేవతలపై విరుచుకుపడ్డాయి. అలాగే గుహలలోనుండి క్రూరమృగాలు పరుగున వచ్చి దేవతల్ని ముక్కలు ముక్కలు చేశాయి. వృక్షాలు విరిగిపడడంతో వాటి కింద అనేక మంది దేవతలు నలిగిపోయారు. ప్రమాదాల్ని తప్పించుకుని పారిపోయేందుకు ఎటూ తెరువు లేదు. దాంతో దేవతలంతా ప్రాణాలరచేతిలో పెట్టుకుని నేలకూలిపోయారు. విష్ణువు ఒక్కడు తప్ప దేవతలంతా రాలిపోయారు. అది గమనించి, అగ్ని వాయువులిద్దరినీ పిలిచాడు విష్ణువు. మయుని మాయ తుత్తునియలు అయ్యేట్టుగా విజృంభించమన్నాడు. విష్ణువు ఆజ్ఞ శిరసావహించి అగ్నివాయువులు పార్వతిమాయపై విజృంభించారు. ప్రజ్వలించి పైకి ఎగస్తున్న అగ్నిదేవునికి వాయుదేవుడు తోడవ్వడంతో మాయా పర్వతాలన్నీ కాలిపోయాయి. ప్రాణులతో, వృక్షాలతో పర్వతాలన్నీ ప్రళయ కాలంలో కులపర్వతాల్లా రూపుమాశాయి.

చూశాడది మయుడు. పరాజయం పాలైనాననుకున్నాడు. భయాందోళనలు చెందాడు. పరుగుదీశాడక్కణ్ణుంచి. అతని పలాయనాన్ని గమనించిన రాక్షస ప్రముఖులు కూడా మయుణ్ణే అనుసరించారు. వెన్నిచ్చి పరుగెత్తారు. పరుగెడుతున్న రాక్షసులను చూసి, పగలబడినవ్వారు దేవతలు. విష్ణువును అనేక విధాల స్తుతించారు. ఆనాటి నుండి లోకాలన్నీ ఆనందాబ్ధిలో ఓలలాడాయి. యజ్ఞయాగాది కర్మలన్నీ భూలోకంలో యధావిధిగా జరుగసాగాయి. తపోధనుల తపశ్చర్యలు అవిఘ్నంగా కొనసాగాయి. ధర్మదేవత తిరిగి నాలుగుపాదాలతోనూ భూమి మీద సంచరించసాగింది.

కొద్దిరోజులు గడిచాయి.

రాక్షసుల పరాభవాన్ని తెలుసుకుని, కాలనేమి అన్న రాక్షసుడు పట్టరాని కోపంతో భగ్గుమన్నాడు. ఓటమితో క్రుంగి కృశించిన రాక్షసుల్ని చేరదీశాడు. వారందరినీ ఓదార్చి, అమరులపై యుద్ధానికి ప్రేరేపించాడు. అసంఖ్యాక సైన్యంతో దేవతలపై దండెత్తాడు. కాలనేమి ప్రళయకాలభాస్కరునిలా, కాలయమునిలా అమరులను అల్లల్లాడించాడు. బ్రహ్మ వరప్రసాదుడతను. బ్రహ్మ నుండి అనేక వరాలు పొందాడు. నూరు శిరస్సులతో, అనేక బాహువులతో కాటుకకొండలాంటి శరీరంతో రాక్షసుల పక్షాన యుద్ధం చేస్తున్న కాలనేమిని చూసేందుకే దేవతలకు ధైర్యం చాలలేదు. అయినా దిక్పాలకులు ఇంద్రుడిని ముందుంచుకుని, ఘోరయుద్ధం చేశారు. విరోచనుడు, వరాహుడు, విక్షరుడు మొదలైన రాక్షసులు, దేవతలపై దివ్యాస్త్రాలు ప్రయోగించి వారిని వణికించారు. అయినా ధైర్యాన్ని చిక్కబట్టుకుని యుద్ధం చేశారు దేవతలు. ఆ యుద్ధంలో ఉభయసేనలూ తీవ్రంగా నష్టపోయాయి. అనేకమంది మరణించారు. వారి రక్తధారలతో యుద్ధభూమి నెత్తుటి ఏరులా కనిపించింది.

**—అరణి**

# వెట్టి (ది వారియర్)

-మధుబాబు



**ఒకళ్ళు పని కట్టుకుని పెద్దగా అరిచి హెచ్చరించాల్సిన అవసరం లేకుండానే, చకచకా పక్కకు జరిగి దారి ఇచ్చారు అక్కడ గుమికూడిన జనం.**

**తడబడుతున్న అడుగులతో పోయి బుల్లెట్ బండి వెనుక కూర్చున్నాడు పిచ్చిపూజారి.**

**'గట్టిగా పట్టుకోండి పూజారయ్యా. గతుకుల్లో ఎగిరెగిరి పడుతుంది బండి. మీరు కూడా ఎగిరి అవతల పడిపోతే నడుములు జారిపోతాయ్. మా బావయ్య నా మక్కెలు విరగేసి ఇంటి ముందు వేలాడగడతాడు' అంటూ బండి వెనక్కి తిప్పి వేగంగా పోనిచ్చాడు రాయుడిపల్లి రవీంద్ర బావమరిది.**

'ఉన్నట్టుండి నన్ను తలుచుకోవటమేమిటిరా మీ బావయ్య? ఈ మధ్యకాలంలో ఎప్పుడూ ఇలా జరగ లేదు...' యువకుడి చెవి దగ్గర నోరు పెట్టి పెద్దగా అడిగాడు పూజారి.

'మా చిన్నికి పెళ్ళి సంబంధం కుదిరిందిగదా.. ముహూర్తాలు పెట్టించటం కోసమని అనుకుంటున్నా' తను కూడా బిగ్గరగానే అరిచి చెప్పాడు యువకుడు.

'ఏడిచావ్... అడిగితే గిడిగితే ఇప్పుడు పూజలు చేస్తున్న చవటాయ్‌ని అడగాలి. అరుపులు, కేకలు పెట్టే పిచ్చిమొఖం వాడిని నేను. నన్ను అడగడం ఏమిటి?' కోపంగా అడిగాడు పూజారయ్య.

నవ్వాడు యువకుడు. నవ్వుతూనే ఉన్నాడు గాని సమాధానం చెప్పలేదు. 'అర్థం అయిందిరా.. నువ్వు, ఆ బండోడు ఇద్దరూ కలిసి అడవిలో జరిగింది అంతా మీ బావయ్యకి చెప్పేసి ఉంటారు. నా తిక్క కూడా దిగిపోయిందని తెలిసి నిన్ను పంపించాడు రవీంద్ర. అంతేకదా?' అడిగాడు పూజారయ్య.

'అంతే... అంతే... మీరు కాసేపు మాట్లాడకండి. ముందు రోడ్డు అంతా గోతులు.. బండి నా మాట వినటం లేదు' హ్యాండిల్ గట్టిగా పట్టుకుంటూ హెచ్చరించాడు యువకుడు.

అతను ఆ మాటలు చెపుతున్న సమయంలోనే పందెపుగుర్రం మాదిరి పెద్ద కుదుపు కుదిపింది బండి. యువకుడి నడుము చుట్టూ చేతులు చుట్టి ఎగిరి అవతల పడిపోకుండా తనను తాను కాపాడుకున్నాడు పూజారి.

'కొంచెం నెమ్మదిగా పోనీయరా. ముసలిప్రాణం... తట్టుకోలేక పోతున్నది' అంటూ వేడుకున్నాడు.

పెదవులు బిగపట్టి మరికొంచెం వేగం పెంచాడు యువకుడు. కళ్ళు గట్టిగా మూసుకుని, నోటికి వచ్చిన అమ్మవారి అష్టోత్తరనామావళిని చదువుకోవటం మొదలు పెట్టాడు పూజారయ్య.

ఖచ్చితంగా ఒక గంటన్నర తరువాత.... చీకట్లు దట్టమై.... ఆకాశంలో నక్షత్రాలు కనుల పండువగా కనిపించటం మొదలైనప్పుడు రాయుడిపల్లి మెయిన్ రోడ్డు మీదికి వెళ్ళిపోయింది బుల్లెట్ బండి.

ఊరి చివరలో మూడొంతుల మంది పైపంచెలు సవరించుకుంటూ తన ఎదుట నిలబడి ఉండగా, తన ఇంటి ఆవరణలో ఒక కుర్చీలో కూర్చొని ఉన్న రవీంద్ర ఎదుటికి పోయి ఆగింది.

'నమస్కారాలు పూజారయ్యా.. నమస్కారాలు..' బుల్లెట్ మీది నుంచి దిగటానికి నిలబడి ఉన్న వారిలో ఇద్దరి పౌరుల సాయం తీసుకుని, నడుము నొక్కుకుంటూ నిలబడిన పూజారయ్య దగ్గరికి వచ్చాడు అతను.

'అరేయ్ రవీంద్ర.. నీ బావమరిదికి ఇంత స్పీడు పనికిరాదురా. రోడ్డు పక్కన గోతుల్లో పడేసి చంపేస్తాడని భయపడ్డాను' కుడిచేతిని అతని తలమీద పెట్టి ఆశీర్వదిస్తూ అన్నాడు పూజారయ్య.

'మిమ్మల్ని చంపగలవాడు ఇంకా పుట్టలేదు సామి. తాతలాంటి వాళ్ళు కదా.. సరసమాడి ఉంటాడు' అంటూ తన బావ మరిదికేసి చూసి, పూజార య్యకి కనిపించకుండా కను బొమలు ఎగురవేశాడు రవీంద్ర.

'చింతలపల్లిలోనే ఎదురు వచ్చాడు. నీ దగ్గరికే బయలుదేరాట్ట..' చెప్పి ఇంట్లోకి పరిగెత్తాడు యువకుడు.

పెద్ద వెండిపళ్ళెంలో మజ్జిగ గ్లాసులు రెంటిని పెట్టుకుని, మరో పళ్ళెంలో మిగలపండిన సపోటా పళ్ళను పేర్చి, కూతురితో సహా ఎదురుపడింది అతనికి అక్కమ్మ.

'దక్షిణం గదిలో మంచం వేసి, మంచి దుప్పటి సిద్ధం చెయ్యి. అలుపు తీరేదాకా కాస్తంత నడుము వాలుస్తాడు' అంటూ అతనికి చెప్పి, బయటికి వచ్చింది. అంతకుముందు వరకూ తను కూర్చున్న కుర్చీలో కూర్చోబెట్టాడు రవీంద్ర పూజారయ్యని.

తన వెనుకే వచ్చిన కూతుర్ని ముందుకు నెట్టింది రవీంద్ర భార్య.

'నమస్కారం చెయ్యవే' అంటూ గద్దించింది.

ముందుకు వంగి పూజారయ్య పాదాలకు నమస్కరించింది ఆ బిడ్డ.

'అదృష్టవంతురాలు... మహర్జాతకం... రవీంద్ర.. నువ్వు, నీ ఆస్తి, నీ పలుకుబడి ఈ బిడ్డ కాలి గోటికి కూడా సరిపోవు. అబ్బో... కళ్ళు తిరిగిపోయే వైభవం..' అరమూసిన కళ్ళతో వెంటనే చెప్పాడు పూజారయ్య.

వెండి పళ్ళేలను పట్టుకుని నిలబడి ఉన్న రవీంద్ర భార్య కళ్ళు జలపాతాలై పోయాయి. 'తమ ఆశీర్వాదం. ఆ తల్లి దయ. మేము అదృష్టవంతులం' గద్గద స్వరంతో అన్నది.

'సంబంధం నిశ్చయం అయిపోయింది సామీ. మీ చేతులతో మీరే ముహూర్తాలు పెట్టాలి. నా బావమరిది మీకు అన్నీ చెప్పాడు. మీరు ఏంచెపితే అది చేయటానికి నేను రెడీ..' తన సంతోషాన్ని బలవంతంగా అదుముకుంటూ అన్నాడు రవీంద్ర.

పూనకం వచ్చినవాళ్ళు గిరగిరా తిప్పినట్టే తల గిరగిరా తిప్పాడు పూజారయ్య.

'అయ్యబాబోయ్... ఆ తల్లి వచ్చేసినట్టుంది ఒంటి మీదికి. కొబ్బరికాయ, హారతికర్పూరం తెప్పించు' కంగారుగా అన్నాడు అక్కడ ఉన్న వారిలో ఒక వృద్ధుడు రవీంద్రతో.

'అరేయ్... ఎక్కడరా?' తల ఎత్తి ఇంట్లోకి పోయిన బావమరిదిని పిలవబోయాడు రవీంద్ర.

'ముసుగు పడిపోయింది. మబ్బు వీడిపోయింది. కష్టం మటుమాయం అయిపోయింది. ఎవడి వల్ల ఈ పని జరిగిందో వాడేపెట్టాలి ముహూర్తం. వాడి నోటి వెంట వచ్చిన మాట ప్రకారమే జరుగుతుంది శుభకార్యం... అంతే.. ఇంకెవడూ మాట్లాడల్సిన పనిలేదు. మాట్లాడకూడదు. ఇది శాసనం.. ఇది శిలాక్షరం.. అర్థం అయ్యిందా?' తల వెనక్కీ ముందుకీ ఊపుతూ బిగ్గరగా

## జరిగిన కథ

వెట్టి అసలు పేరు విఠల్‌రెడ్డి. తన పెత్తనాన్ని సవాలు చేసిన వెట్టిని అంతమొందించాలనుకుంటాడు బాజిరెడ్డి. రాయుడిపల్లిలో చౌడేశ్వరికి జరిగిన అపచారమేమిటో వెట్టి తెలుసుకుంటాడు. కదిరి బయలుదేరిన అతడికి చౌడేశ్వరి ఆత్మశిల కనిపిస్తుంది. పిచ్చిపూజారికి ఆత్మశిల గురించి చెప్పి, ఎవరికీ తెలియకుండా ఆ తల్లిని యథాస్థానంలో ఎలా ప్రతిష్ఠించాలో ఆలోచించమంటాడు. తిరిగి ఎస్టేటుకు వచ్చిన వెట్టి, సబ్బిరెడ్డితో మాట్లాడి, తాను అరెస్టు చేసిన పఠాన్‌ని విడిచిపెట్టమంటాడు. కడపనుంచి హేమారెడ్డి డైరెక్ట్‌గా శివారెడ్డికే ఫోన్ చేస్తాడు. బాజిరెడ్డి తనదగ్గర తీసుకున్న మొత్తాన్ని చెల్లించకుంటే ఎస్టేట్ మొత్తాన్ని స్వాధీన పరుచుకుంటానని హెచ్చరిస్తాడు. దాంతో శివారెడ్డి అస్వస్థతకి గురవుతాడు. అందరూ కంగారుపడుతుంటారు. వెట్టి శివారెడ్డిని ఓదార్చుతూ, సమస్యలన్నీ తాను సాల్వ్ చేస్తానని మాటిస్తాడు.

ఆ తర్వాత...

అన్నాడు పూజారయ్య.

'ఎవరు? అతను ఎవరు? ఎక్కడ ఉంటాడు?' అయోమయంగా అడిగాడు రవీంద్ర.

పకపకా నవ్వాడు పూజారయ్య. 'పిచ్చివాడివి నువ్వు. నీ చుట్టూ ఉన్న వాళ్ళందరూ నీకంటే పిచ్చివాళ్ళు... తెలియదా? ఇంకా తెలియటం లేదా?' అని అడిగాడు పూజారయ్య.

మరింత అయోమయంగా చూశాడు రవీంద్ర తన భార్యవైపు.

'మా పనిని గురించి చెప్పటం వరకూ బాగానే ఉంది. మరి మీ పని గురించి చెప్పండి. మా ఊరికే బయలుదేరిన కారణం ఏమిటి?' అప్పుడే వచ్చిన రవీంద్ర బావమరిది చిన్న కంఠంతో అడిగాడు పూజారయ్యని.

చటుక్కున మాయం అయిపోయింది పూజారిని ఆవరించుకుని ఉన్నట్లు కనిపిస్తున్న మగత. అప్పుడే నిద్రలో నుంచి లేచినట్లు తల విదిలించాడు.

'రవీంద్రా... నీతో పెద్దపని... చాలా పెద్ద పని పడింది. మామూలు పనికాదు, చాలాచాలా పెద్ద పని' అన్నాడు.

'చెప్పండి పూజారయ్య... ఏమిటో చెప్పండి' అన్నాడు రవీంద్ర.

'పదిమందితో చెప్పేదికాదు. పంపించేయ్ అందర్నీ' అన్నాడు పూజారయ్య.

'ఆగండి... టీలు తాగిపోదురుగాని, కొంచెం ఆగండి' రవీంద్ర తమకు చెప్పకముందే విషయం అర్థం చేసుకుని వెనక్కి వెళ్ళిపోబోతున్న జనాన్ని ఆపేసింది రవీంద్ర భార్య.

'అమ్మలూ... భోంచేసే టైము. ఇప్పుడు టీలు ఎందుకు తల్లీ?' చనువుగా అన్నాడు ఒక వృద్ధుడు.

'మా గడప దగ్గరికి వచ్చినవాళ్ళు ఏదో ఒకటి తినటమో, తాగటమో చేసిగాని అవతలికి పోకూడదు. అది అంతే' ఖచ్చితమైన కంఠంతో చెప్పి, తన బిడ్డవైపు చూసిందా ఇల్లాలు.

తూనీగ మాదిరి పరిగెత్తిందా బిడ్డ. రెండు నిమిషాల తరువాత ఇద్దరు పనివాళ్ళతో సెగలు వెలువరుస్తున్న టీ పాత్రలు, గ్లాసులు పట్టించుకు వచ్చి, అందరికీ అందించే పనిని సూపర్‌వైజ్ చేయటం

మొదలుపెట్టింది.

రవీంద్ర భార్య తన చేతికి అందించిన సపోటా పళ్ళను రెండింటిని ఆరగించి, ఆమె ముందుకు జాచిన మజ్జిగ పుచ్చుకున్నాడు పూజారి. టీలు తాగి, జనం అందరూ అవతలికిపోగానే తాను వచ్చిన పనిని అతనికి వివరంగా చెప్పాడు.

'నా తల్లి అడివిలో దిక్కుదివాణం లేనట్టు పడి పోయి ఉందిట. వెంటనే తీసుకువచ్చి యథా ప్రకారం ప్రతిష్ఠ చేయాలి' అన్నాడు.

'ఆ అబ్బయ్య మీకు ఏమని చెప్పాడు?' అతని మాటలు పూర్తి అవుతూ ఉండగానే, వినవచ్చింది ఇంకో కంఠం.

ఉలికిపాటును కప్పిపెట్టుకుంటూ అటుచూసిన రవీంద్రకు కనిపించాడు బండోడి భుజాల మీద చెయ్యివేసి నెమ్మదిగా వచ్చి నిలబడిన అతని తండ్రి.

'అయ్యయ్యో పెద్దయ్య! నువ్వు నా ఇంటికి వచ్చావా? బండోడికి చెప్పి పంపిస్తే నేనే వచ్చే వాడిని కదా..' అంటూ ఇంటివైపు తిరిగి 'అరేయ్ కుర్చీ తీసుకురండి. త్వరగా' కేక పెట్టాడు రవీంద్ర.

'నా తల్లి దిక్కులేనిదాని మాదిరిగా దూరంగా పోవటానికి నువ్వు కూడా కారకుడివే. ఏ మొఖం పెట్టుకుని నా దగ్గరికి వచ్చావు?' చివ్వున తన కుర్చీలో నుంచి లేస్తూ అడిగాడు పూజారయ్య, బండోడి తండ్రిని.

'తెలిసీ తెలియని పరిస్థితిలో నా ద్వారా రెండు తప్పులు జరిగాయి. నిన్న మొన్నటివరకు నా మీద అలిగిన ఆ తల్లి ఇప్పుడు నన్ను క్షమించేసింది. మీరు కూడా క్షమిస్తే నేను అదృష్టవంతుడిని అనుకుంటాను' ముందుకు వచ్చి పూజారయ్య పాదాలకు నమస్కారం చేస్తూ అన్నాడు బండోడి తండ్రి.

పెదవులు బిగించి తల అడ్డం తిప్పుకున్నాడు పూజారయ్య. అతని కనుకొలకుల నుంచి రెండు కన్నీటి బొట్లు జారి బుగ్గల్ని తడి చేసేశాయి.

'అన్నీ తెలిసినవారు మీరు. జరిగిన దానిలో బండోడి నాయన తప్పు మాత్రమే ఉన్నదని అనుకోవద్దు. బాగా ఆలోచించండి' మృదువుగా అన్నది రవీంద్ర భార్య.

పెద్ద శబ్దం వచ్చేటట్టు బరువుగా ఊపిరి పీల్చుకుని, తల విదిలించాడు పూజారయ్య. 'నిజమే తల్లీ.. నా బిడ్డ మొదట తప్పుచేసింది. అది జరగకుండా ఉన్నట్లయితే వీళ్ళెవరూ కల్పించుకునే వాళ్ళు కాదు. నిజమే..' అంటూ బండోడి నాయన భుజం మీద చేయివేశాడు.

'జరిగిందేదో జరిగిపోయింది. ఇప్పుడైనా జరగాల్సింది ఏమిటో సరిగ్గా జరిపించితే బాగుంటుంది' అన్నాడు ఆర్ద్రంగా.

'అన్నీ ఆ అబ్బయ్య చేతులు మీదగానే జరగాలి. మీరు ఎవరూ తొందరపడి కాళ్ళు తొక్కుకోవద్దు' అప్పటివరకూ మౌనంగా ఉన్న బండోడు వెంటనే తన అభిప్రాయం వెల్లడించాడు.

చర్రున అతనికేసి తిరిగాడు పూజారయ్య.

'నిన్నకాక మొన్న వచ్చినవాడు ఆ అబ్బడు. వాడు మనకి చెప్పేది ఏంటి? మనకి ఆలోచనలు లేవా? మనంతట మనం పూర్తి చేయలేమా?' విసురుగా అడిగాడు.

'నిన్నటిదాకా కుడిచెయ్యి ఏదో ఎడమచెయ్యి ఏదో తెలియకుండా, పుట్టల మధ్య గిరికీలు కొడుతూ బతికాము మనం. మనకి ఏం చేతనయింది? ఆ అన్న పూనుకుని అన్నీ చెప్పే వరకూ నోళ్ళు వెళ్ళబెట్టి కూర్చున్నాము' అంటూ ఇంకా ఏదో చెప్పబోతుండగా, వెనుక నుంచి భుజాన్ని అదిమి ఆపేశాడు రవీంద్ర బావమరిది.

'జరిగిపోయిందాన్ని గురించి దెబ్బలాడుకోవటం తెలివితక్కువతనం. జరగాల్సింది ఏమిటో చూడటం చాలామంచిది' అన్నాడు అందరినీ ఉద్దేశించి.

'అందుకే వచ్చాను' అంటూ రవీంద్ర వైపు గుచ్చి గుచ్చి చూశాడు పూజారయ్య.

'నీ సాయం కావాలి. ఆ తల్లిని అంగరంగ వైభోగంగా వెనక్కి తీసుకురావాలి' అన్నాడు.

'మీరు చెపితే కాదనేది ఏమీలేదు. ఎంతమంది అవసరమో, ఏది అవసరమో చెప్పండి' అంటూ బావమరిదిని దగ్గరికి పిలిచాడు రవీంద్ర.

'నాలుగు ట్రాక్టర్లు, పాతిక ఎడ్లబళ్ళు. ఆడంగులు మగవాళ్ళు అందరూ... తిరపతయ్యని పిలిపించి సన్నాయి మేళం, పసుపుకుంకుమ, పట్టుచీరె.. అన్నీ సిద్ధం చేయాలి' ఆర్డర్ ఇచ్చాడు.

మతాబు మాదిరి వెలిగిపోతున్న పూజారయ్య మొఖం వంక చూడకుండా ఉండటానికి ట్రై చేస్తూ, తల అడ్డం తిప్పాడు అతను.

'అన్నయ్య చాలా పెద్ద ప్రాబ్లమ్‌లో ఇరుక్కుని ఉన్నాడు. అది సరి అయిపోయిన తర్వాత పెట్టుకుందాము..' అన్నాడు.

చిరాకుపడ్డాడు రవీంద్ర.

'ఎవడ్రా ఆ అన్నయ్య? ఏంటిరా వాడి

**పఠాన్‌ని తీసుకుని ఎస్టేటులోకి అడుగుపెట్టాడు బాజిరెడ్డి. వెట్టిని పిలుచుకు రమ్మన్నాడు సంపంగిని. బయట చూస్తే బాజిరెడ్డి మనుషులతోపాటు గ్రానైట్‌మైన్స్ జనం... ముందుచూస్తే నుయ్యి వెనుకచూస్తే గొయ్యిలా తయారైంది వెట్టి పరిస్థితి. మరి అప్పుడు వెట్టి ఏంచేశాడు? పఠాన్‌కి ఎదురుపడ్డాడా?**

ప్రాబ్లమూ? మన ఊరు కాదు, మన చుట్టం కాదు. వాడికి, మన తల్లికి ఏంటిరా లింకు? వాడి పని వాడిదే! మన పని మనదే! ఏదో ఒక చిన్న సాయం చేశాడని చెప్పి వాడిని ఒక పెద్ద మొనగాడి మాదిరి అనుకోవటం తప్పు' విసురుగా అన్నాడు.

'అది కాదు బావయ్య.. అన్నయ్య' అనబోయాడు బావమరిది.

కనులు ఎర్రచేసి, మీద పడి కరిచినంత పని చేశాడు రవీంద్ర. 'నోరు మూసేయ్. ముందు నేను చెప్పింది చెయ్. తెల్లారేసరికి ఆ తల్లి దగ్గరికి వెళ్ళిపోవాలి' అన్నాడు.

చప్పట్లు కొట్టి చిందువేయలేదు గాని, అటువంటి భావమే ప్రత్యక్షం అయింది పూజారయ్య వదనంలో.

చిన్నబుచ్చుకున్నట్టు తల వంచుకున్న యువకుడి భుజం తట్టాడు బండోడు. 'బాధపడకురా.. అన్నీ తెలిసిన పెద్దవాళ్ళు మాట్లాడుకుంటున్నప్పుడు మనం ఎదురు చెప్పకూడదు. బావయ్య చెప్పింది చేద్దాం. పూజారయ్య వెనకే అడివిలోకిపోయి ఆ తల్లిని తీసుకు వద్దాం. ఆయన దారి చూపిస్తాడు. మనం వెనక నడుద్దాం' అన్నాడు అనునయంగా.

'నేనా? నేను దారి చూపించటం ఏమిటి?' అదిరిపడినట్టు అడిగాడు పూజారయ్య.

'అదేంటి అలా మాట్లాడతారు? ఆ తల్లి ఎక్కడుందో మీకు తెలుసుకదా' అమాయకంగా అడిగాడు బండోడు.

'నాకు తెలియటమేంటి? చూసింది మీరు కదా' ఆశ్చర్యంగా అడిగాడు పూజారయ్య.

'మేము కాదు. చూసినవాడు అన్నయ్య. అతనికే తెలుసు. మాకు తెలియదు'.

బిక్కమొగంతో రవీంద్రవైపు తిరిగాడు పూజారయ్య.

తనకు ఏమీ అర్థం కానట్టు నుదురు రుద్దుకుంటూ తనకేసి చూసిన భర్తను గమనించి చిరునవ్వు నవ్వింది అతని భార్య.

'నీకేమైనా అర్థం అయిందా?' అడిగాడు అతను.

తల ఊపింది ఆమె.

'అయితే వెంటనే నాకు చెప్పు. నా తల పగిలిపోతోంది' అన్నాడు అతను.

'మీరు అనవసరంగా తలనొప్పి తెచ్చుకోకండి... బండోడు, మా తమ్ముడు చెపుతున్న మాటల్ని బట్టి చూస్తుంటే ఆ తల్లికి సంబంధించిన ఏ పని అయినా సరే ఆ అబ్బయ్య చేతుల మీదుగానే జరగాలని నాకు అనిపిస్తోంది' అన్నది.

'అయితే ఆలస్యం దేనికి?' అంటూ బావమరిది



కేసి తిరిగి, 'పోయి అతణ్ణి వెంట బెట్టుకురా. బుల్లెట్ బండి అతనిదేనని చెప్పాను కదా.. ఇచ్చేసి వచ్చేటప్పుడు కారు మాట్లాడుకుని తీసుకురా' అన్నాడు రవీంద్ర.

'అన్నయ్య ఇప్పటికిప్పుడు ఎక్కడికీ రాడు. మనం చేయదలుచుకున్న పనికంటే పెద్ద పెద్ద పనులు ఉన్నాయి. అవి పూర్తి అవ్వాలి' అన్నాడు బావమరిది.

మాట్లాడలేదు రవీంద్ర. రెప్పవేయకుండా అతని వైపే చూస్తూ ఉండిపోయాడు.

'నువ్వు నంద్యాల వెళ్ళిన తర్వాత చాలా విశేషాలు జరిగినయ్ బావయ్యా...' అంటూ వెట్టి తమ ఊరికి వచ్చిన దగ్గర్నించీ మొదలుపెట్టి జరిగినవన్నీ క్లుప్తంగా అతనికి చెప్పాడు ఆ యువకుడు.

వెట్టికోసం రివాల్వర్లు పట్టుకున్న జనం తన ఇంటిమీదికి వచ్చి, అప్పులవాళ్ళ మాదిరిగా ఆవరణ లోనే తిష్ట వేశారని, తిరిగి అతణ్ణి వెదుకుతూ చింతల పల్లి పోయారని తెలిసేసరికి ఎర్రబడిపోయాయి రవీంద్ర కనులు.

'కేకేయరా అందర్నీ. కదిరి పోయి ఆ బాజిరెడ్డిని నిలేద్దాము. అసలు వాడు తనను గురించి తను ఏమని అనుకుంటున్నాడో అడిగి వద్దాము' అన్నాడు కోపంగా.

రివ్వున ఆవరణ వెలుపలికి పరిగెత్తబోయిన యువకుణ్ణి, తన కొడుకును వెంటనే ఆపేశాడు బండోడి తండ్రి.

'మీకు బాజిరెడ్డికి ఎటువంటి సంబంధం లేదు. వాడి వ్యవహారంలో వేళ్ళు పెట్టవద్దు' అన్నాడు.

'మరి ఈ అబ్బయ్య మీదికి జనాన్ని పంపించాడు కదా' అన్నాడు రవీంద్ర.

'వాళ్ళు వాళ్ళు తేల్చుకోవాల్సిన సమస్య అది. ఆ అబ్బయ్య వచ్చి మన సాయం అడిగితే అప్పుడు చూడచ్చు. ఇప్పుడు మాత్రం ఎవరూ ఏమీ చేయవద్దు' మరింత సూటిగా చెప్పాడు బండోడి తండ్రి.

'అదీ విషయం పూజారయ్యా... ఆ అబ్బయ్య తీరుబడిగా వచ్చి చెప్పిన తర్వాతనే మీరు అడిగిన పని చేయడం జరుగుతుంది. చేస్తానని చెప్పాను కాబట్టి ఇక మీరు ఆ విషయంం మర్చిపోండి. మా అమ్మాయి ముహూర్తం గురించి చెప్పండి.'

'ఆ తల్లి పని పూర్తి అయిన తర్వాతనే ముహూర్తం కుదురుతుంది. అంతవరకూ నేను చెప్పగలిగింది ఏమీలేదు' అంటూ అతని సమాధానం కోసం ఎదురు చూడకుండా ఆవరణ బయటికి వెళ్ళిపోయాడు పూజారయ్య.

'పూజారయ్యకి కోపం వచ్చింది. అలిగి వెళ్ళిపోతున్నాడు' వెంటనే భర్తకు చెప్పి పూజారయ్యను ఆపటానికి ప్రయత్నించింది రవీంద్ర భార్య.

ఆమె వేడికోలు మాటల్ని పెడచెవిన పెట్టాడు పూజారయ్య. వీధిలోకి వెళ్ళిపోయాడు. 'వెళ్ళు.... తీసుకుపోయి గుడి దగ్గర దింపు' బావమరిదికి చెప్పాడు రవీంద్ర.

ఆ యువకుణ్ణి కూడా నిర్లక్ష్యం చేశాడు పూజారయ్య. బుల్లెట్ బండిమీద కూర్చోవటానికి నిరాకరించి విసవిసా అడుగులు వేస్తూ వెళ్ళిపోయాడు.

***

'బాజిరెడ్డి డ్రైవర్ గాడు ఇంకా రోడ్డు మీదే నిలబడి ఉన్నాడు..' అవుట్‌హౌస్‌లోకి వస్తూ ఎనౌన్స్ చేసింది ప్రత్యూష.

'వాడు ఒక్కడే కాదు, బాజిరెడ్డి జనం చాలా మంది అక్కడ చక్కర్లు కొడుతున్నారు' అన్నది వెనకే వచ్చిన ప్రణవి.

'సంపంగి ఏం చేస్తోంది?' అడిగాడు వెట్టి.

'అమ్మ సంపంగిని కుదురుగా ఒకచోట నిలబడనీయటం లేదు. నిమిషానికి ఒకసారి పిలిచి ఏదో ఒక పని చెపుతోంది. అది మొఖం మాడ్చుకుని చేస్తోంది' నవ్వుతూ అన్నది ఆమె.

'డ్రైవర్‌తో ఫోన్‌లో మాట్లాడటానికి అవకాశం దొరకకపోవడం వల్ల మొఖం మాడ్చుకుంటూ ఉండి ఉంటుంది' అన్నాడు వెట్టి.

'అది సరే అబ్బయ్య. ఇప్పుడు నువ్వు ఏం చేయదలుచుకున్నావు?' అడిగాడు రమణయ్య పంతులు.

'ఆ బాజిరెడ్డి పఠాన్‌గాడిని వెంటబెట్టుకుని వచ్చేస్తాడు. మళ్ళీ అన్నయ్యని టెన్షన్‌లో పెడతాడు' చిన్న కంఠంతో చెప్పటం మొదలుపెట్టి సడన్‌గా మాటలు ఆపింది ప్రణవి. రయ్‌మని శబ్దం చేస్తూ బాజిరెడ్డి కారు కాంపౌండ్‌లోకి ఎంటర్ అవటమే అందుకు కారణం.

బిల్డింగ్ దగ్గరికి పోయి ఆగిన ఆ కారులోనుంచి దిగాడు బాజిరెడ్డి. అతని వెనుకే దిగి కాలర్ సవరించుకుంటూ నిలుచున్నాడు పఠాన్.

ప్రణవి భుజం మీది నుంచి అటే చూస్తున్న ప్రత్యూష, రక్కున తలతిప్పి వెట్టి వైపు చూసింది.

ఎర్రబడిపోతోంది అతని మొఖం. పటపటమని శబ్దం చేస్తున్నాయి దంతాలు. బిగుసు కుంటున్నాయి పిడికిళ్ళు.

గుమ్మంలో అడ్డంగా నిలబడి ఉన్న తనను, ప్రణవిని పక్కకునెట్టి అతను అతి వేగంగా పోయి పఠాన్ మీద కలబడతాడేమోనని భయపడింది ఆమె.

'ప్రణవీ.. ప్రణవీ... వెనక్కి చూడు' కంగారుగా పిలిచింది.

గిరుక్కున తిరిగి వెట్టివైపు చూసింది ప్రణవి. ఆమెకంటే అరక్షణం ముందుగా రమణయ్య పంతులు చూశాడు.

'ఆగు విఠల్ బాబూ... ఆగిపో' అంటూ గబుక్కున చెయ్యి పట్టుకున్నాడు.

మొఖంమీద చన్నీళ్లు చిలకరించినట్లు అయింది కాబోలు, తల విదిలించి తన భావాలు అణచుకున్నాడు వెట్టి.

'ఎందుకు ఆపారు నన్ను? చిటికెలో మీ సమస్య సాల్వ్ అయిపోయేది' అన్నాడు మొఖాన్ని చేతులతో అద్దుకుంటూ.

'మా సమస్య సాల్వ్ అయిపోయేదే. నీ సమస్య స్టార్ట్ అయ్యేది. వీధిలో ఉన్న జనం అంతా వచ్చి నీ ప్రాణాలు తీసేసేవాళ్ళు' అన్నది ప్రణవి.

'అది ఒక్కటే కాదు.. మనకి మళ్ళీ ఇంకో సమస్య మొదలు అయ్యేది' అన్నది ప్రత్యూష.

'అదేమిటి?' ఆశ్చర్యంగా అడిగింది ప్రణవి.

'కడప నుంచి ఫోన్ చేసిన వాళ్లతో మాట్లాడి, ప్రాబ్లమ్ సాల్వ్ చేస్తానని అన్నయ్యకి మాట ఇచ్చి వచ్చాడు. తన కొడుకును ఏదైనా చేస్తే ఆ బాజిరెడ్డి ఇంతటితో ఆగుతాడా?' వాళ్ళను రెచ్చగొట్టి ఇంకా ఇంతకింత రచ్చచేయకుండా ఉంటాడా?' అడిగింది ఆమె.

'నిజంగా విఠల్‌బాబూ... నువ్వు మామూలోడివి

## ఆ నటుడితో పిల్లల్ని కంటుందట!

మామూలు హీరోయిన్ ఈ మాట చెబితే సీరియస్‌గా తీసుకోరేమో కానీ, దీపికా పదుకొనె నోటి నుంచి వచ్చిన ఈ మాటలు పెద్ద సంచలనాన్నే రేపాయి. చాలా మంది పిల్లల్ని కనాలన్నది దీపిక కోరికట! అది కూడా హాలీవుడ్ నటుడు విన్ డిసెల్ పెళ్ళి చేసుకున్నట్టు, పిల్లల్ని కంటున్నట్టు కలలు వస్తున్నాయట! ఈ మాటలు విని రణవీర్‌తో పాటు ఆమె అభిమానులు కూడా తెగ కంగారు పడుతున్నారట! రణవీర్ పెళ్ళి మాటెత్తితే కెరీర్ అంటూ అతగాడి నోరు నొక్కేసే దీపిక ఇపుడు హాలీవుడ్ నటుడిని పెళ్ళి చేసుకుంటున్నట్టు కలలు కనటమేమిటి? అంటున్నారు బాలీవుడ్ జనాలు. దీపికా హాలీవుడ్‌కి వెళ్ళిన తరువాత చాలా మారిపోయిందనీ, అందుకే రణవీర్‌ని దూరంగా పెడుతోందనీ అంటున్నారు. ఇటీవలి కాలంలో ఇద్దరూ ఎడమొఖం పెడమొఖంగా ఉంటున్నారు. దీనికి కారణం ఇద్దరూ కలిసి నటిస్తున్న 'పద్మావతి' మీద హైప్ పెంచడానికే అంటూ బయటకు చెబుతున్నా, రణవీర్ అంటే మొహం మొత్తడం వల్లనే అతగాడిని దూరంగా నెట్టేస్తోందని అంటున్నారు.

కాదు. సమస్యల మీద సమస్యలు తలకెత్తు కోవటం నీకు బాగా అలవాటు అయిపోయింది' అన్నాడు రమణయ్యపంతులు.

'వాడు.. ఆ బాజిరెడ్డి లోపలికి పోయి ఏం చేయ బోతున్నాడో..' అన్నాడు వెట్టి.

'ఆలోచన దేనికి? మనం కూడా పోయి...' అంటున్న రమణయ్యపంతులు వెట్టి మొఖంలోని భావాలు చూసి మాటల్ని మింగేశాడు. ప్రశ్నార్థకంగా తల ఎగురవేశాడు.

కనులతోనే వీధిలోకి చూపించాడు వెట్టి.

జనం.. బాజిరెడ్డి జనమంతా ఎలర్ట్‌గా నిలబడి బిల్డింగ్‌వైపే చూస్తూ ఉండటాన్ని గమనించాడు పంతులుగారు.

'అందరికంటే వెనుకగా నిలబడి ఉన్నారు, వైట్ అండ్ వైట్... చూడండి' అన్నాడు వెట్టి చిన్నగా.

'ఎవరు వాళ్ళు?' అడిగింది ప్రణవి.

'గ్రానైట్ మైన్స్ జనం... నేను కనిపించిన వెంటనే గుర్తు పట్టేస్తారు. బాజిరెడ్డి జనం మాదిరి బయటే నిలబడి ఉండరు. తోడేళ్ళ మాదిరి దూసుకు వస్తారు' చెప్పాడు వెట్టి.

కాంతివిహీనం అయింది ప్రణవి వదనం.




'అయితే నువ్వు బయటికిరాకు. మేము వెళ్ళి బాజిరెడ్డి మాటలు వినివస్తాము' అంటూ బిల్డింగ్ వైపు బయలు దేరింది.

అప్పుడే వచ్చింది సంపంగి. 'సారూ... బాజిరెడ్డి సారు మిమ్మల్ని పిలుస్తున్నారు' అంటూ వెట్టికి చెప్పింది.

'వస్తున్నానని చెప్పు...' అన్నాడు వెట్టి.

అవుట్‌హౌస్ ద్వారం దగ్గర ఉన్న మెట్లలో ఆఖరి మెట్టు మీద నిలబడి బిక్కమొహం పెట్టింది ప్రణవి.

'ఎలా ప్రత్యూషా? వాడు మనకంటే మూడు అడుగులు ఎప్పుడూ ముందు ఉంటున్నాడు. ఇప్పు డెలా?' అడిగింది.

రెండు క్షణాలు ఆలోచించి ఏదో నిశ్చయానికి వచ్చినట్లు తల ఊపింది ప్రత్యూష. 'పది నిమిషాలు ఆగి మీరు బిల్డింగ్‌లోకి రండి' అంటూ పెద్దపెద్ద అడుగులతో బయలుదేరింది.

వీధిలో నిలబడి తమ కదలికలనే గమనిస్తున్న జనాన్ని ఓరకంట గమనించుకుంటూ ఆమెను అనుసరించింది ప్రణవి.

ఊపిరి బిగపట్టి అవుట్‌హౌస్ ద్వారం దగ్గరే నిలుచున్నాడు రమణయ్యపంతులు. ప్రణవి, ప్రత్యూష బిల్డింగ్‌లోకి పోయారు.

ఉన్నట్లుండి కొండ ఎక్కాయి అప్పటివరకూ బిల్డింగ్‌లోను, బిల్డింగ్ చుట్టూ దేదీప్యమానంగా వెలుగుతున్న దీపాలు అన్నీ.

'అయ్యబాబోయ్... కరెంట్ పోయింది. ఎప్పుడూ లేనిది ఇప్పుడు ఇలా ఎందుకు జరిగింది' అదిరిపడినట్లు వెంటనే అన్నాడు పంతులుగారు.

క్షణం ముందు వరకూ పట్టపగలు మాదిరి ఎంతో కాంతిమంతంగా ఉన్న ఆవరణ కన్ను పొడుచుకున్నా ఏమీ కనిపించని కటిక చీకటితో నిండిపోయింది.

రమణయ్యపంతులుగారిని పక్కకునెట్టి ఒక్కసారిగా పరుగు అందుకున్నాడు వెట్టి. 'రండి.. త్వరగా రండి' అంటూ హెచ్చరిస్తూ ఒకటినుంచి పాతిక లెక్క పెట్టేలోగా పోయి బిల్డింగ్‌లోకి ఎంటర్ అయినాడు.

'ఎవరు? ఎవరది? ఎవరు??' అంటూ చేతులు అడ్డం పెట్టబోయాడు కారు దగ్గరే నిలబడి ఉన్న బాజిరెడ్డి డ్రైవర్.

'నీ కళ్ళు ఏమైనా కాకులు ఎత్తుకుపోయాయా? నేను ఎవరినో నీకు కనిపించడం లేదా?' కోపంగా అంటూ అతన్ని అవతలికినెట్టి అరక్షణం ఆలస్యంగా తను కూడా లోపలికి పోయాడు పంతులుగారు.

ఆయన గుమ్మం దాటి రెండు అడుగులు వేసిన వెంటనే తిరిగి గప్పుమంటూ వెలిగాయి మలిగిపోయిన లైట్లు అన్నీ. యథాప్రకారం కాంతిమంతం అయింది ఆ ఆవరణ.

***

'సబ్బిరెడ్డి పొరపాటుపడ్డాడు. అడవిలో జరుగుతున్న స్మగ్లింగ్‌కి, నా కొడుక్కి ఎటువంటి సంబంధం లేదు. అవసరం అయితే ఏ కోర్టుకైనా పోయి నిరూపిస్తాం' కోపంగా అంటున్నాడు బాజిరెడ్డి.

'ఓకే... నీ కొడుకు నిర్దోషి అని మేము నమ్మితే సరిపోదు. కోర్టు నమ్మి అతణ్ణి విడుదల చేయాలి. చేసిన తర్వాత ముహూర్తాలు పెట్టుకోవచ్చు' తాపీగా చెపుతోంది పిచ్చమ్మ.

'అదేం కుదరదు. ముందు అనుకున్నట్టు పెళ్ళి జరిపించేద్దాము. అంతగా అయితే అడిగినంత అపరాధ రుసుము కట్టి కేసులోనుంచి బయట పడవచ్చు' మొండిగా అన్నాడు బాజిరెడ్డి.

శివారెడ్డి గది గుమ్మం దగ్గర నిలబడి ఉన్నాడు వెట్టి. అందరూ శివారెడ్డి వైపే చూస్తున్నారు. బాజిరెడ్డి వెనుక నిలబడి ఉన్న పఠాన్ మాత్రం ప్రణవి వైపే చూస్తున్నాడు.

చీమలు జెర్రులు తన ఒంటి మీద పాకుతున్నట్టు మొఖం పెట్టి, గది గుమ్మం వైపు చూసింది ఆమె.

బయటికి రమ్మని సైగచేసి, పెద్దపెద్ద అడుగులతో డైనింగ్ రూమ్ పక్కనే ఉన్న ఇంకో గదిలోకి పోయాడు వెట్టి.

ఎందుకు? ఏమిటి? అనే మాటల్ని గురించి ఆలోచించకుండా, వెంటనే తను కూడా అటుకేసి బయలుదేరింది ఆమె. ఆమెతో పాటుగా కదిలింది ప్రత్యూష.

అధికం అయిపోయినట్లుంది కుతుహలం. తను కూడా వారిద్దరి వెనుకే బయటికి వచ్చాడు పఠాన్.

'ఎక్కడికి? నువ్వు మా వెనకే రావటం దేనికి?' వెట్టి వెళ్ళిన గది ముందుకు పోయి, కోపంగా అతణ్ణి అడిగింది ప్రణవి.

పెద్దగా నోరు చేసుకుని వెకిలిగా నవ్వాడు అతను. 'నాకు కాబోయే పెళ్ళానివి. నీ వెనకే రావటానికి కారణం ఉండాలా? నా ఇష్టం' అంటూ ఆమెను పక్కకునెట్టి తను గదిలోకి ఎంటర్ అయ్యాడు.

అంతే... ఎంటర్ అయిన మరుక్షణం కరెంట్ షాక్ కొట్టినట్టు అదిరిపడ్డాడు. 'నువ్వా?' తనకళ్ళను తనే నమ్మలేనట్టు చూస్తూ అడిగాడు.

'నేనే బ్రదరూ... ఆశ్చర్యంగా ఉందా?' నవ్వుతూ అడిగాడు వెట్టి.

గిరుక్కున వెనక్కితిరిగి, గది బయటికి జంప్ చేయటానికి ప్రయత్నం చేశాడు పఠాన్.

గుమ్మానికి అడ్డంగా నిలబడ్డారు ప్రణవి, ప్రత్యూష. ఒక్క అంగుళం కూడా అవతలికి జరగలేదు. అతన్ని బయటికి పోనీయలేదు.

'నాయనా.. నాయనా' బిగ్గరగా తండ్రిని పిలవటానికి ప్రయత్నం చేశాడు పఠాన్, వారిద్దరినీ బలవంతంగా పక్కకు నెట్టి తను అవతలికి పోయేందుకు చూస్తూ.

పిడికిలి బిగించి అతని మెడమీద కొట్టాడు వెట్టి.

అరవటానికి తెరిచిన నోరు తెరిచినట్టు ఉండగానే మట్టిముద్ద మాదిరి కింద చతికిలబడి పోయాడు పఠాన్. శబ్దం మాత్రం బయటికి రాలేదు.

ఎడమ పాదాన్ని వెనక్కి జాచి తన్నినచోట మళ్ళీ తన్నకుండా ఫుట్‌బాల్‌ని తన్నినట్టు కొట్టేశాడు వెట్టి. చిన్నపాటి శబ్దం కూడా బయటికి రాకుండా చెండుకుతిని, అతను నిస్త్రాణగా తల వేలాడేసినప్పుడు వెనక్కి జరిగాడు.

'సంపంగిని పిలిచి మొఖం మీద నీళ్ళు జల్లమని చెప్పండి. నేను చేసిన పనికాదు ఇది. ఎవరు చేశారో మీకు తెలియదు. మీరు ఏమీ చూడలేదు' అంటూ ప్రత్యూషకి చెప్పి డైనింగ్ రూమ్‌లోకి వెళ్ళిపోయాడు.

'సంపంగీ... సంపంగీ' బిగ్గరగా అరిచింది ప్రత్యూష.

అందరితోపాటు శివారెడ్డి గదిలో ఒకపక్కగా నిలబడి ఉన్నది సంపంగి. పరుగులాంటి నడకతో ఆ గదిలోకి వచ్చి, తెలివి తప్పి ఉన్న పఠాన్‌ని చూసి నివ్వెరపోయింది.

**(ఇంకా వుంది)**

# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో
## 'సంతానలేమి' లోపాల నివారణకు సరైన వైద్యం

డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్



నేటితరం దంపతులలో సాధారణంగా ఎక్కువ మందిని వేధిస్తున్నది సంతానలేమి సమస్య. ఈ సమస్యను ఎదుర్కొంటున్న చాలామంది ఎన్నో రకాల మందులు వాడుతున్నప్పటికీ గర్భధారణ జరగక – ఒకవేళ గర్భధారణ జరిగినా అది నిలవక తరచూ గర్భస్రావం అవడం వలన చాలామంది ఈ సమస్యకు గురి అయి, తీవ్ర ఆందోళన చెందుతుంటారు. కానీ హోమియో చికిత్స ద్వారా, ముఖ్యంగా హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో అందించబడే జెనెటిక్ కాన్స్‌టిట్యూషనల్ చికిత్సా విధానం ద్వారా, 'సంతానలేమి'కి దారి తీసే ముఖ్య కారణాన్ని తెలుసుకుని, ఆ వ్యక్తికి సరిపడిన చికిత్స అందించడం ద్వారా ఈ సంతానలేమి సమస్య నుండి పూర్తిగా బయటపడి సంతానప్రాప్తి పొందే అవకాశం ఉంది.



**సంతానలేమి అనగా** ఆరోగ్యవంతులైన దంపతులు ఏ విధమైన గర్భనిరోధక చర్యలు చేపట్టకుండా ఒక సంవత్సరం పాటు సాధారణ శృంగార జీవితం గడిపినా పిల్లలు కలగకపోవడం. ఈ సమస్యకు గల కారణాలు స్త్రీ,పురుషులలో సమాన స్థాయిలో ఉండే అవకాశం ఉంది. కొంతమందిలో ఎలాంటి కారణాలు లేకుండా కూడా సంతానలేమి ఏర్పడుతుంది. దీనినే 'ఇడియోపతిక్ ఇన్‌ఫెర్టిలిటీ' అని అంటారు.

**సంతానలేమి 2 రకాలు. (1). ప్రైమరీ ఇన్‌ఫెర్టిలిటీ:** స్త్రీలు, తమ వివాహానంతరం ఒక సంవత్సరం పాటు సాధారణ లైంగిక జీవితం గడిపినా గర్భం దాల్చకపోవటం. **(2). సెకండరీ ఇన్‌ఫెర్టిలిటీ:** సాధారణ లైంగిక జీవితం గడపడం వలన ఒకసారి గర్భధారణ జరిగి, పిల్లలు కలగటం లేదా గర్భస్రావమై రెండవసారి గర్భధారణ జరగక పోవడం.

### 'సంతానలేమి'కి గల కారణాలు:

మారుతున్న ఆహారపు అలవాట్లు, అధిక మానసిక ఒత్తిడి, వ్యాయామం చేయకపోవడం వంటి అంశాలు ఈ సమస్యను ప్రేరేపిస్తాయి.

**స్త్రీలలో 'సంతానలేమి'కి కారణాలు:**

- పునరుత్పత్తి అవయవాలు సరిగా ఏర్పడకపోవటం
- గర్భసంచి చిన్నదిగా ఉండటం లేదా గర్భసంచి నిర్మాణంలో లోపాలు (2 గదులుగా ఉండటం)
- ఫెలోపియన్ ట్యూబ్స్ లేకపోవడం లేదా మూసుకుపోవడం, యోని చిన్నదిగా ఉండటం, యోని మార్గంలో ఉండే మ్యూకస్ పొర, శుక్రకణాలు ఈదటానికి అనువుగా లేకపోవడం, యోని అధిక ఆమ్లగుణాన్ని కలిగి ఉండటం వలన శుక్రకణాలు చనిపోవడం,
- గర్భసంచిలో కణితులు ఏర్పడటం, ఎండోమెట్రియోసిస్, అడినోమయోసిస్ వలన ఫెలోపియన్ ట్యూబ్స్‌లో అడ్డంకులు ఏర్పడటం మరియు ఫలదీకరణ చెందకపోవడం, అండం గర్భాశయంలో ప్రతిస్థాపన చెందకపోవడం వంటి సమస్యలు ఏర్పడతాయి.
- అండాశయంలో నిర్మాణ లోపాలు లేక అండాశయంలో సరైన ఎదుగుదల లేకపోవడం వంటి అంశాలు స్త్రీలలో 'సంతానలేమి'కి కారణాలుగా చెప్పవచ్చు.

**పురుషులలో 'సంతానలేమి'కి కారణాలు:**

- ప్రత్యుత్పత్తి అవయవాలు సరిగా ఏర్పడకపోవటం.
- శుక్రకణాలు పూర్తిగా ఉత్పత్తి కాకపోవడం (అజూస్పెర్మియా)
- శుక్రకణాలు తక్కువగా ఉత్పత్తి కావడం (అలిగోస్పెర్మియా)
- శుక్రకణాలు ఉత్పత్తి అయినప్పటికీ వాటి కదలికలు సాధారణంగా లేకపోవడం (అస్తినోస్పెర్మియా)
- శుక్రకణాల నిర్మాణంలో లోపాలు ఉండటం (టెరటోస్పెర్మియా)
- వెరికోసిల్, వృషణాలు ఉండే తిత్తిలో నీరు చేరడం, వృషణాలకు అధిక వేడి తగలడం, వృషణాలు శోథమునకు గురికావడం, అంగస్థంభన, శీఘ్రస్కలనం, టెస్టోస్టిరాన్ హార్మోన్‌ల అసమతుల్యత వలన సంతానలేమి ఏర్పడుతుంది.

**స్త్రీ, పురుషులలో-** పిట్యుటరీ, థైరాయిడ్ సమస్యలు, హార్మోన్‌ల అసమతుల్యత, అధిక బరువు, మధుమేహం, పొగత్రాగటం, మద్యపానం చేయడం మరియు కొన్ని జన్యుపరమైన అంశాలు 'సంతానలేమి'ని కలిగిస్తాయి.

**'సంతానలేమి' నిర్ధారణ పరీక్షలు: పురుషులలో:** కంప్లీట్ సెమెన్ ఎనాలిసిస్, యూ.ఎస్.జి. అబ్డమిన్, మరియు స్క్రోటమ్, సీరమ్ టెస్టోస్టిరాన్, థైరాయిడ్ ప్రొఫైల్, ఎఫ్.ఎస్.హెచ్., ఎల్.హెచ్., టెస్టిక్యులార్ బయాప్సీ, సీ.బీ.పి., ఇ.ఎస్.ఆర్., మరియు సీ.యూ.ఇ. మొదలైనవి.

**స్త్రీలలో:** ఎఫ్.ఎస్.హెచ్., ఎల్.హెచ్., సీరమ్ ప్రొలాక్టిన్, థైరాయిడ్ ప్రొఫైల్, యూ.ఎస్.జి. అబ్డమిన్., హెచ్.ఎస్.జి., లాప్రోస్కోపీ, ఫాలిక్యులార్ స్టడీ, సీ.బీ.పి., ఇ.ఎస్.ఆర్. మరియు సీ.యూ.ఇ. మొదలగు పరీక్షలను చేయించటం ద్వారా సంతానలేమి సమస్యను నిర్ధారించవచ్చు.

**హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ వైద్యం:** కేవలం 'హోమియోకేర్ ఇంటర్‌నేషనల్'లో మాత్రమే అందించబడే అధునాతనమైన జెనెటిక్ కాన్స్‌టిట్యూషనల్ వైద్యవిధానం ద్వారా చాలావరకు – స్త్రీలు మరియు పురుషుల 'సంతానలేమి' లోపాలు సరికావటం, తద్వారా వారు సంతానప్రాప్తి పొందటం జరుగుతోంది. రోగి యొక్క మానసిక మరియు శారీరక లక్షణాలకు అనుగుణమైన మరియు రోగి తత్వానికి సరిపడిన ఔషధాలతో జరుపబడే అత్యంత సమర్థవంతమైన చికిత్స మేరకు సంతానలేమి సమస్యను అధిగమించటం సాధ్యపడుతుంది. తద్వారా సంతానప్రాప్తికి మార్గం సుగమం చేయటం జరుగుతుంది.



# ఉంటుందా? ఊడుతుందా?

**పార్టీకి దిశా నిర్దేశం చేయడం ఆలస్యం అవుతున్న కొద్దీ పార్టీ బలహీన మవుతోంది. రాహుల్ గాంధీ నాయకత్వాన్ని నాయకులంతా శంకించే పరిస్థితి తలెత్తుతోంది.**

**రాహుల్ గాంధీ విషయంలో కాంగ్రెస్ నాయకుల మనోభావాలు వేగంగా మారిపోతున్నట్టు కనిపిస్తోంది. గత ఏడాది నవంబర్‌లో కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సమావేశం జరిగినప్పుడు, పార్టీ ఉపాధ్యక్షుడు రాహుల్ గాంధీని పార్టీ అధ్యక్షుడిగా ప్రమోట్ చేయాలంటూ నాయకులంతా తీర్మానం చేశారు. పార్టీ అధ్యక్షురాలు సోనియా గాంధీ ఈ సిఫారసును పరిగణనలోకి తీసుకుని సాధ్యమైనంత త్వరగా చర్యలు తీసుకోవాలని కూడా సీడబ్ల్యూసీ సభ్యులు, సీనియర్ నాయకులు సూచించారు.**

అయితే, ఈ సిఫారసు చేసి నాలుగు నెలలు గడిచినా దాని మీద సోనియా చర్య తీసుకోలేదు. రాహుల్ క్రియాశీల రాజకీయాల్లోకి అడుగు పెట్టినప్పటి నుంచి, ముఖ్యంగా 2011లో తాను అనారోగ్యానికి గురైనప్పటి నుంచి సోనియా గాంధీ తన కుమారుడికి అధికారాలు, బాధ్యతలు బదలాయిస్తూ వస్తున్నారు.

ఈ నాలుగు నెలల కాలంలో అటు దేశ రాజకీయాల్లోనే కాక, ఇటు పార్టీ వ్యవహారాల్లో కూడా ఎంతో మార్పు చోటు చేసుకుంది. అత్యవసరంగా తీసుకోవాల్సిన చర్య విషయంలో ఈ విధంగా కాలయాపన చేయడం నాయకులందరినీ నిరాశా నిస్పృహల్లో ముంచెత్తుతోంది. ఇష్టమున్నా లేకపోయినా నాయకులు, మద్దతుదారులంతా రాహుల్ గాంధీయే పార్టీ అధ్యక్షుడు కావాలని కోరుకున్నారు. రాహుల్ గాంధీ గనుక పార్టీ అధ్యక్షుడైతే, 132 ఏళ్ల పార్టీకి 'గాంధీ బ్రాండ్' కొనసాగుతూ ఉంటుందని, కాంగ్రెస్ చిన్నాభిన్నమైపోకుండా ఉంటుందని, రాను రాను బలోపేతం అవుతున్న బీజేపీని ఈ రోజు కాకపోతే రేపైనా అడ్డుకోవడానికి వీలవుతుందని నాయకులంతా భావించారు. అయితే, ఈ మనోభావాలేవీ కలకాలం కొనసాగేలా కనిపించడం లేదు. ప్రస్తుతం పార్టీలో నిశ్శబ్దం ఆవరించి ఉంది. ఇది తుపాను ముందరి నిశ్శబ్దంలా కనిపిస్తోంది. ఏదో ఒక రోజున భళ్లున బద్దలు కావచ్చు. చాలా మంది సీనియర్ నాయకులు సమయం కోసం ఎదురు చూస్తున్నారు.

సోనియా గాంధీ పార్టీ అధ్యక్షురాలిగా ఉన్నంత కాలం తామంతా పార్టీని అంటిపెట్టుకునే ఉంటామని, రాహుల్ అధ్యక్షుడు అయిన మరుక్షణం నుంచి పార్టీ ఇప్పటి మాదిరిగా కూడా కొనసాగే అవకాశం లేదని ఓ నాయకుడు అన్నారు. నిజానికి, కాంగ్రెస్‌లో ఓట్లు తీసుకురాగల సీనియర్ నాయకుల కోసం బీజేపీ ఇప్పటికే వల వేస్తోంది. గత ఉత్తర ప్రదేశ్, ఉత్తరాఖండ్, మణిపూర్ అసెంబ్లీ ఎన్నికల సమయంలో అది కొద్ది ప్రయత్నం కూడా చేసింది. మహారాష్ట్ర, అసోం వంటి రాష్ట్రాలలో కూడా కాంగ్రెస్ నాయకుల కోసం అది గాలం వేస్తోంది. మహారాష్ట్రలో శివసేనతో సంబంధాలు సరిగ్గా లేక పోవడం వల్ల, ఒడిశాలో బీజేడీలో లుకలుకలు బయలుదేరినందువల్ల అక్కడి నాయకులను ఏదో విధంగా తమ వైపు తిప్పుకోవాలని బీజేపీ ప్రయత్నిస్తోంది. ఒడిశాలో స్థానిక సంస్థల ఎన్నికల్లో కాషాయ దళం తన పరిస్థితిని చాలావరకు మెరుగు పరచుకుంది.

### మార్పునకు అవకాశం ఉందా?

రాహుల్‌ను పార్టీ అధ్యక్షుడిగా నియమించినంత మాత్రాన పార్టీకి సంస్థాగతంగా, రాజకీయ పరంగా, ఎన్నికల పరంగా ఒరిగేదేమీ లేదనేది సీనియర్ నాయకుల నిశ్చితాభిప్రాయం. గత కొద్ది సంవత్సరాలుగా పార్టీ పరిస్థితి దిగజారడమే తప్ప మెరుగుపడ్డ దాఖలాలు లేవు. 2013 నుంచి కాంగ్రెస్ పార్టీ రాజస్థాన్, మధ్యప్రదేశ్, ఛత్తీస్‌గఢ్, మహారాష్ట్ర, హర్యానా, అసోం, గుజరాత్, జార్ఖండ్, పశ్చిమ బెంగాల్, జమ్మూ కశ్మీర్, ఆంధ్రప్రదేశ్, తెలంగాణ, ఒడిశా, తమిళనాడు, ఉత్తర ప్రదేశ్, ఉత్తరాఖండ్, మణిపూర్, గోవా రాష్ట్రాల్లో తన పరిస్థితిని మరీ దిగజార్చుకుంది. దాదాపు సగానికి సగం రాష్ట్రాల్లో అధికారం కోల్పోయిన కాంగ్రెస్ పార్టీ ప్రస్తుతం పంజాబ్, హిమాచల్ ప్రదేశ్, కర్ణాటక, మేఘాలయ, మిజోరాం రాష్ట్రాల్లో మాత్రమే అధికారంలో ఉంది. బీహార్‌లో పాలక పక్షానికి అది మిత్ర పక్షంగా అధికారం పంచుకుంటోంది. ఒక పక్క ప్రాంతీయ పక్షాలు, మరో పక్క బీజేపీ ఆ పార్టీకి నిలవ నీడ లేకుండా చేస్తున్నాయి. ప్రధానమంత్రి నరేంద్ర మోదీ మొదలు పెట్టిన 'కాంగ్రెస్ ముక్త్ భారత్' అనే ఎన్నికల నినాదం బాగానే పనిచేస్తున్నట్టు కనిపిస్తోంది.

2014 సార్వత్రిక ఎన్నికల్లో అది దాదాపు 15 రాష్ట్రాల్లో ఘోరంగా దెబ్బతిని, చివరికి లోక్‌సభలో 44 స్థానాలతో మిగిలిపోయింది. వరుసగా ఇలా ప్రతి ఎన్నికల్లోనూ ఓడిపోవడం కాంగ్రెస్ నాయకులకు దిగ్భ్రాంతి కలిగిస్తోంది. అంతకన్నా దిగ్భ్రాంతికరమైన విషయం ఇంత జరుగుతున్నా అగ్రనాయకత్వంలో ఉలుకూ పలుకూ లేకపోవడం. ఈ రాజకీయ సంక్షోభం నుంచి పార్టీని గట్టెక్కించడానికి అగ్రనాయకత్వం ఏమాత్రం ప్రయత్నం చేయకపోవడం నాయకులను విషాదంలో ముంచెత్తుతోంది. ఇక ఎన్నికల్లో ఓడిపోయిన ప్రతిసారీ అగ్రనాయకత్వం ఆత్మపరిశీలన చేసుకోవాలని, పార్టీలో సమూలంగా మార్పులు చేయాలని, పార్టీని ప్రక్షాళన చేయాలని చెబుతూ వస్తోంది. కానీ, ఇంత




- రాజశుక

వరకూ అటువంటిదేమీ జరగలేదు. ఇది లోక్‌సభ ఎన్నికల తర్వాత జరగాల్సింది. కానీ జరగలేదు. లోక్‌సభ ఎన్నికల ఫలితాలపై పరిశీలనకు నియమించిన ఆంటొనీ కమిటీ రాహుల్ నాయకత్వాన్ని తప్ప ప్రతి అంశాన్నీ దుయ్యబట్టింది. పార్టీ ఓటమికి రాహుల్ నాయకత్వమే కారణమని పలువురు పరోక్షంగా చెప్పినా ఈ కమిటీ చెవికెక్కించుకోలేదు. కొందరు నాయకులు వీధులకెక్కి, రాహుల్ గాంధీనే విమర్శించడం కూడా జరిగింది. ఆయన ఓ జోకర్ అనీ, ఆయనో వైఫల్యమనీ విమర్శించినా ఎవరూ పట్టించుకోలేదు.

## ఆలస్యం అమృతం విషం

ఢిల్లీ ఎన్నికల్లో ఆమ్ ఆద్మీ పార్టీ చేతుల్లో ఓడిపోయిన తర్వాత రాహుల్ ఓ ప్రకటన చేస్తూ, ఎవరూ ఊహించను కూడా ఊహించలేనంత పెద్దయెత్తున మార్పులు తీసుకు రాబోతున్నట్టు చెప్పారు. చివరికి ఆ ప్రకటన కూడా చర్విత చర్వణమే అని తేలింది. సమాజ్‌వాది పార్టీతో చేతులు కలిపినా ఉత్తరప్రదేశ్ ఎన్నికల్లో ఘోర పరాజయం పాలవడంతో ఆయన మళ్లీ ప్రకటన చేశారు. పార్టీలో భారీగా, సమూలంగా వ్యవస్థాగత మార్పులు చేయబోతున్నట్టు ఈసారి స్పష్టం చేశారు. ఇంతవరకూ అటువంటిదేమీ ప్రారంభం కాలేదు. ఎన్నికల ఫలితాలు వెలువడి నాలుగు వారాలు గడిచి పోయినప్పటికీ, కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ ఇంతవరకూ సమావేశం కాలేదు. కాంగ్రెస్‌కు పూర్వ వైభవం తీసుకు రావడానికి ఇక ఏమీ మిగల లేదంటూ పార్టీ నాయకులు పెదవి విరుస్తున్నారు. ఏదో ఒకనాడు బీజేపీ తప్పులు చేయకపోతుందా, దానంతటదే కుప్పకూలకపోతుందా అని ఎదురు చూపులు చూడడం తప్ప కాంగ్రెస్ నాయకులకు మరే మార్గదర్శనమూ లేదు. ఏదో అద్భుతం జరిగితే తప్ప కాంగ్రెస్ పునరుజ్జీవనం పొందే అవకాశం లేదని కాంగ్రెస్ నాయకులు చెబుతున్నారు.

ముందుగా కాంగ్రెస్ పార్టీ అగ్రనాయకత్వం ఆత్మపరిశీలన చేసుకోవాలని పార్టీలోని వివిధ వర్గాలు ఘోషిస్తున్నాయి. విజయాలు సాధించడంలోనే కాక, ప్రజలకు చేరువ కావడంలో, అధికార పక్షానికి సరైన పోటీ కావడంలో తాము ఎందుకు వెనుకబడి ఉన్నాం, ఇందుకు పరిష్కారం ఏమిటి అన్నదానిపై దృష్టి కేంద్రీకరించాలి. అనేక సందర్భాల్లో పార్టీ ఆత్మ పరిశీలన జరిపింది కానీ, వాటి వల్ల ఉపయోగం కనిపించలేదు. ఆత్మపరిశీలన సిఫారసులేవీ ఆచరణలోకి రాలేదు. 2013 జనవరిలో జైపూర్‌లో 'చింతన శిబిర్' పేరుతో ఓ ఆత్మపరిశీలన శిబిరాన్ని నిర్వహించింది. ఇది ఓ తరగతి గదిలా కనిపించింది తప్ప ఎక్కడా ఆత్మపరిశీలన శిబిరంగా కనిపించలేదు. ఆ శిబిరం కూడా ఓ భజన శిబిరంగా ముగిసింది.

గత ఏడాది శాసనసభ ఎన్నికలు జరిగినప్పుడు కూడా ఇలాగే ఓ ఆత్మపరిశీలన శిబిరాన్ని నిర్వహించారు. నాయకులంతా ఆత్మ పరిశీలన చేసుకోవాలని సోనియా గాంధీ పిలుపునిచ్చారు. పార్టీ సీనియర్ నాయకుడు దిగ్విజయ్ సింగ్ మాత్రం, పార్టీకి ఓ పెద్ద శస్త్రచికిత్స అవసరమని సూచించారు. చివరికి ఆత్మ పరిశీలనా జరగలేదు, శస్త్ర చికిత్సా జరగలేదు. ప్రాథమిక చికిత్స కూడా జరగకుండానే ఏడాది కాలం గడిచిపోయింది. గత వారం జరిగిన శాసనసభ ఎన్నికల్లో కాంగ్రెస్ నాలుగు రాష్ట్రాల్లో ఘోరంగా ఓడిపోవడంతో మళ్లీ దిగ్విజయ్ సింగ్ వంటి సీనియర్ నాయకులు గొంతు విప్పారు. "ఆత్మపరిశీలన సమయం కూడా మించిపోయింది. ఇప్పుడిక కావాల్సింది కార్యాచరణే" అని వారంతా ఘోష పెట్టారు. దిగ్విజయ్ సింగ్ అయితే "కొత్త నాయకత్వం" గురించి కూడా ప్రస్తావించారు.

## అస్తిత్వానికి ప్రమాదం

ప్రస్తుతం కాంగ్రెస్ పార్టీ ఉనికికే, అస్తిత్వానికే ప్రమాదం ఏర్పడింది. అసలు పార్టీ పునాదుల మీదే అందరికీ సందేహాలు ఏర్పడుతున్నాయి. ఈ పార్టీ ఇక కొనసాగాల్సిన అవసరముందా, దీనివల్ల ఎవరికైనా ప్రయోజనం ఉందా, ఈ పార్టీ మరి కొంత కాలం కొనసాగే అవకాశం ఉందా వంటి ప్రశ్నలు కూడా తలెత్తుతున్నాయి. దీన్ని ఓ తీవ్ర విషయంగానే పార్టీ పరిగణించాల్సి ఉంటుంది. పార్టీలోని లోపాలు, లొసుగులతో పాటు, అసలు పార్టీ ఎక్కడ తప్పటడుగు వేస్తోంది, దీన్ని ఏ విధంగా సరిదిద్దుకోవాలి వంటి విషయాలపై నిర్దిష్టంగా, నిర్మొహమాటంగా, నిర్భయంగా ఆత్మపరిశీలన చేసుకోవాల్సిన అవసరం ఉంది. అన్నిటికన్నా ముందుగా పార్టీకి రాహుల్ సారథ్యం వహించాలా అన్నదానిపై సోనియా గాంధీతో సహా పార్టీ అగ్ర నాయకులంతా ఓ గట్టి నిర్ణయం తీసుకోవాలి. ఏవిధంగా చూసినా, ఆయన వల్ల పార్టీకి దెబ్బే తప్ప ఉపయోగం లేదని తేలిపోయింది. ఆయన మాటలు, చేతలే కాక, ట్వీట్లు కూడా పార్టీని వినాశనం వైపు నడిపిస్తున్నాయి. రాహుల్ డ్రైవర్ సీట్లో కూర్చోదలచుకుంటే కాళ్లు బ్రేకుల మీద పెట్టడం కూడా నేర్చుకోవాలి.





**ప్రస్తుతం కాంగ్రెస్‌పార్టీ ఉనికికీ, అస్తిత్వానికే ప్రమాదం ఏర్పడింది. 2014 సార్వత్రిక ఎన్నికల తర్వాత 15 రాష్ట్రాల్లో ఘోరంగా దెబ్బతిన్న కాంగ్రెస్ పునరుజ్జీవానికి ఆ నాయకత్వం ఎలాంటి మార్గదర్శనం చేయడంలేదు. రాహుల్‌గాంధీ దేశంలో అత్యంత బలహీనుడైన నాయకుడని సన్నిహిత నాయకులే విమర్శిస్తున్నారు. ఆయన పార్టీ అధ్యక్షుడైతే ఇంతే సంగతులు అంటున్నారు. మరి ఆ పార్టీ గమ్యం ఎటు?**

రాహుల్ గాంధీ నాయకత్వం క్రమక్రమంగా బలహీనమవుతోందని చాలా మంది కాంగ్రెస్ నేతల నిశ్చితాభిప్రాయం. దేశవ్యాప్తంగా రాజకీయ నాయకులందరిలో రాహుల్ గాంధీయే అత్యంత బలహీనుడని కూడా సన్నిహిత నాయకులు వ్యాఖ్యానిస్తున్నారు. రాహుల్ గాంధీ వల్ల పంజాబ్‌లో కాంగ్రెస్ ఘన విజయం సాధించిందా అని పలువురు నాయకులు ప్రశ్నిస్తున్నారు. సోనియా, రాహుల్, ప్రియాంకలు లేకుండా పార్టీ మనుగడ సాగించగలదా, లేదా అనడానికి ఇదే నిదర్శనమని, పార్టీలో ఎందరో సీనియర్, యువ నాయకులు జనాకర్షణలో రాహుల్ గాంధీ కన్నా మెరుగైన స్థితిలో ఉన్నారని కూడా వారు గుర్తు చేస్తున్నారు. అసలు రాహుల్‌గాంధీయే గట్టి ప్రయత్నం చేస్తే పార్టీ పరిస్థితి ఇంతకన్నా మెరుగ్గా ఉండేదని కూడా వారు అభిప్రాయపడుతున్నారు. సోనియా, రాహుల్, ప్రియాంకలే సమావేశమై, పార్టీ భవితవ్యం గురించి, పార్టీకి మున్ముందు ఎవరు నాయకత్వం వహించాలన్న దాని గురించి, పార్టీకి దిశా నిర్దేశం చేయడం గురించి కూలంకషంగా చర్చించి, ఒక అభిప్రాయానికి రావడం మంచిది.

నవ్య









## స్టార్ ఆఫ్ ది స్టార్

స్పైడర్‌మాన్... ఏ ఆధారం లేకుండా చకచకా గోడలు ఎక్కేస్తుంటాడు. ఇదంతా సినిమాల్లోనే కదా. మరి నిజజీవితంలో కూడా స్పైడర్‌మాన్‌లాగా ఏ ఆధారం లేకుండా ఎవరైనా గోడలు ఎక్కగలరా? అంటే నేనున్నానంటున్నాడు అరాత్ హుస్సేని.

ఇరాన్‌కి చెందిన మహమ్మద్, ఫాతిమాల ముద్దుల కొడుకు అరాత్ హుస్సేని. వయసు మూడేళ్ళే! కానీ చేసేవన్నీ మాత్రం పెద్దతరహా పనులే. పది అడుగుల ఎత్తున్న గోడని ఏ ఆధారం లేకుండా అవలీలగా ఎక్కేస్తాడు. జిమ్నాస్టిక్స్ చేస్తాడు.

ఇదంతా వీడియో తీసి ఆ బుడతడి తల్లిదండ్రులు ఇన్‌స్టాగ్రామ్ ఛానల్‌లో పోస్ట్ చేశారు. ఇప్పుడు సోషల్ మీడియాలో స్టార్ ఆఫ్ ది స్టార్ అయ్యాడీ బుడతడు. ఆన్‌లైన్‌లో నెటిజన్లను తన ఫీట్లతో మురిపిస్తున్నాడు.

## ఆ పెళ్ళి తీరే వేరు !

**హం**గూ ఆర్భాటాలతో ఘనంగా జరిగే పెళ్ళిళ్ళ గురించి, కొండొకచో థ్రిల్ కోసం చేసుకునే పెళ్ళిళ్ళ గురించి వినే ఉంటారు. మరి అండర్‌వాటర్ వెడ్డింగ్స్ గురించి విన్నారా?

బ్లాక్‌పూల్‌లోని 'సీ లైఫ్ సెంటర్' వారు ఈ వెడ్డింగ్స్ నిర్వహిస్తున్నారు. అక్వేరియంలో షార్కుల మధ్య, స్టింగ్‌రేల మధ్య, రిజిస్ట్రార్ సమక్షంలో పెళ్ళిళ్ళు జరుగుతాయి. వెట్‌సూట్స్, ఫిప్పర్స్ ధరించి షార్కులు, ఇతర సముద్రజీవులున్న ట్యాంకులోకి దిగిపోయి పెళ్ళి చేసుకుంటారు. ట్యాంకుల్లోకి దిగడానికి భయపడేవారు పొడిగా ఉన్న అక్వేరియం టన్నెల్లోనో, షార్కులను చూడటానికి ఏర్పాటు చేసిన విండోల వద్దనో ఎంచక్కా ఉంగరాలు మార్చుకోవచ్చు. తర్వాత పెళ్ళికి హాజరయ్యే అతిథుల కోసం టిఫినూ, ఛాంపేన్ వంటివి కూడా ఉంటాయట. థ్రిల్లింగ్‌గా ఉంది కదూ!

## ఎలక్ట్రిక్ లేడీ ల్యాండ్

**పు**రాతన కళాఖండాలతో, చిత్రాలతో, వస్తువులతో ప్రపంచ చరిత్రను మన గుప్పిట ఉంచుతుంది మ్యూజియం. పురాతన వస్తువులకో మ్యూజియం, పురాతన గ్రంథాలకో మ్యూజియం... ఇలా ఎన్నో మ్యూజియాలు ఉన్నాయి. మరి తళతళ మెరుపులతో సందర్శకుల్ని కట్టిపడేస్తున్న ఫ్లొరొసెంట్ మ్యూజియం గురించి తెలుసుకోండి !

నెదర్లాండ్స్‌లోని ఆమ్‌స్టర్‌డ్యామ్‌లో ఉందీ మ్యూజియం. ప్రపంచంలోనే ఏకైక ఫ్లొరొసెంట్ ఆర్ట్ మ్యూజియమిది. అమెరికా కళాకారుడు నిక్ పడలినో 1999లో ఈ మ్యూజియం ప్రారంభించారు. ఇందులో ఉన్న ఒక్కొక్క రాయి వింత కాంతులతో జిగేల్‌మంటుంటే ఏదో కొత్త లోకంలో విహరిస్తున్నట్టుంటుంది. దీన్ని 'ఎలక్ట్రిక్ లేడీ ల్యాండ్' అని కూడా పిలుస్తారు. మామూలు కాంతిలో సాధారణంగా ఉండే ఈ రాళ్ళు అతినీల లోహిత కాంతి పడగానే రకరకాల రంగుల్లో మెరుస్తుంటాయి. సందర్శకులు వీటి దగ్గర నిలబడితే వివిధ వర్ణాల కాంతులు వాళ్ళపై పడి మెరిసిపోతుంటారు. అరుదైన రాళ్ళతో పాటు ఇక్కడ ఫ్లోరొసెంట్ కళకు సంబంధించిన ఆర్ట్ గ్యాలరీని కూడా చూడొచ్చు.



## రోబో థెస్పియన్

**ఇం**ట్లో, కార్యాలయాల్లో, హోటళ్ళలో రోబోలు పనిచేయటం చూశాం. మరి రోబోలు నటించటం ఎక్కడైనా చూశారా? చూడకపోతే ఈ రోబోథెస్పియన్ గురించి తెలుసుకోవాల్సిందే!

రోబోటిక్స్ ఇంజనీర్డ్ ఆర్ట్స్ సంస్థతో కలిసి పైప్‌లైన్ థియేటర్‌వారు ఇంగ్లండ్ అంతటా పర్యటనలు చేస్తూ 'స్పిల్లికిన్' అనే నాటకం ప్రదర్శిస్తున్నారు. ఈ నాటకంలో నటి జూడీ నార్మన్‌తో కలిసి స్టేజి పైన ప్రదర్శనలిచ్చేది ఓ హ్యూమనాయిడ్ రోబో అంటే నమ్మగలరా మీరు? ఈ రోబో థెస్పియన్ చక్కగా కళ్ళు మూస్తుంది, తెరుస్తుంది. మాట్లాడుతుంది. చేతులు ఆడిస్తుంది. ముఖంలో హావభావాలు పలికిస్తుంది. రోబో కదలికలు, మాటలు, అన్నీ ముందుగానే ప్రోగ్రామ్ చేశారు. ఈ రోబో థియేటర్ కంట్రోల్ రూంకి కనెక్ట్ అయి ఉంటుంది. దాంతో ఎప్పటికప్పుడు సమయానికి అనుగుణంగా దానికి ఇన్‌స్ట్రక్షన్స్ పంపిస్తుంటారు. బాగుంది కదూ!

## ప్రకృతి శిల్పాలు

**కొ**న్ని వందల సంవత్సరాల క్రితం ఓ పశువుల కాపరి తప్పిపోయిన పశువులను వెతుకుతూ ఓ లోయ ప్రాంతం చేరుకున్నాడు. అక్కడ అతనికి రకరకాల ఆకృతుల్లో శిల్పాలు కనిపించాయి. మరి అవి ఎలా ఏర్పడ్డాయి? ఎక్కడ ఉన్నాయవి?

అమెరికా, ఉటాహ్ రాష్ట్రంలో ఉందీ లోయ. రెండుమైళ్ళ పొడవున ఏర్పడిన ఈ శిల్పాలను చెక్కింది శిల్పులు కాదు. సహజసిద్ధంగా ఏర్పడ్డాయి. 14 కోట్ల సంవత్సరాలకు ముందు రాక్షస బల్లుల కాలంలో ఇసుకరాళ్లతో ఇవి తయారయ్యాయట. మెత్తగా ఉండే ఈ రాళ్ల నీటి ప్రవాహాలు, బలమైన గాలుల వల్ల కోతకు గురవుతూ రకరకాల ఆకృతులు దిద్దుకుని శిల్పాలుగా మారాయి. 1949లో ఆర్థర్ షఫ్లిన్ తొలిసారి ఈ లోయలోని అద్భుతమైన శిల్పాలను కెమెరాలో బంధించడంతో వీటికి విస్తృత ప్రాచుర్యం లభించింది. ఈ శిల్పాల అందాలను చూడటానికి సందర్శకులు విరివిగా వస్తుంటారు.

—నర్మద వాసిరెడ్డి



# ఆస్తమా - నివారణ హోమియో చికిత్స

మానవుడు జీవించాలంటే ప్రతిక్షణం శ్వాసఎంతో ముఖ్యం.నీరు, ఆహారం లేకపోయిన కొన్ని రోజుల వరకు జీవించగలడు. కాని కొన్ని క్షణాలు శ్వాస లేక పోతే శరీరం నిర్జీవమైపోతుంది, స్వచ్ఛమైన గాలితో మంచి ఆరోగ్యం సమకూరుతుంది. ఆస్తమా వలన దైనందినజీవితంలోచాలాఇబ్బందులుఎదుర్కొంటారు. ఏవైనా వాతావరణంలోమార్పులు, ఆహారంలో మార్పులు, కాలుష్యం, పొగత్రాగడంవలన ఆస్తమా, విజృంభిం చడంతో చాలా ఇబ్బందులు ఎదుర్కొంటారు. ఎక్కడికి వెళ్ళాలన్నా అభద్రత భావనకు లోనవుతారు. ఆస్తమా వలన మరణించేవారు... బీదదేశాలలో, బీదకుటుంబా లలో ఎక్కువ. ఆస్తమా వలన హాస్పిటల్‌లో చేరే వారి సంఖ్య పిల్లలలో ఎక్కువ. ఆస్తమా అనగా సేచ్ఛ లేని శ్వాస, ఊపిరితిత్తులు, దీర్ఘకాలిక శ్వాసకోశ ఇబ్బందినే ఆస్తమా అంటారు. ముఖ్యంగా ఆస్తమా వ్యాధిగ్రస్తులలో అలర్జీ, రియాక్షన్ వల్ల శ్వాసకోశం లో, ఊపిరితిత్తులలో గాలి మార్గంలో శ్వాస పీల్చు కోవటంలో అవాంతరం ఏర్పడుతుంది. ఫలితం గా పిల్లికూతలు, దగ్గు, ఆయాసం, ఛాతీలో నొప్పి వస్తాయి.

**ఆస్తమాకు ముఖ్య కారణాలు:** చల్లగాలి (చల్లటి వాతావరణం) దుమ్ము,ధూళి, పొగ(సిగరెట్) అలర్జెన్స్, గడ్డిచెట్లు, ఫంగస్, పొల్యూషన్ అధిక శారీరక శ్రమ వైరల్ ఇన్‌ఫెక్షన్ పిల్లి, గుర్రం, కుక్క వంటి పెంపుడు జంతువుల విసర్జక పదార్థాలు శ్వాసకోశ ఇన్‌ఫెక్షన్స్ ముఖ్యంగా పిల్లలలో... రోగ

**నిర్ధారణ:** వంశానుగత చరిత్ర, అలర్జీలు, ఎగ్జిమా, చర్మవ్యాధులు, చిన్నతనంలో శ్వాసకోశ వ్యాధులు శారీరక పరీక్షలు, ముక్కు, గొంతు, ఛాతీ పరీక్షలు ఎక్స్-రే, కఫం పరీక్ష, పీ.ఎఫ్.టీ అలర్జీ చర్మపరీక్షలు:. అలర్జెన్స్‌ను ఇంజెక్షన్‌ద్వారా ఇచ్చి రియాక్షన్ చూడటం.

**స్పైరోమెట్రీ:** శ్వాస మీటర్‌ద్వారా పరీక్ష గుండె, ఊపిరితిత్తులు, రక్త లోపం, కిడ్నీ వ్యాధులు, జీర్ణకోశ వ్యాధులు ఏవైనా ఉంటే వాటి నిర్ధారణ.

ఆస్తమాతో జీవించడమెలా? 1.ఆస్తమాతో రోజు వారి పనులు చేసుకునేలాప్రోత్సహించాలి.

2.రాత్రి, పొద్దున్న వచ్చే శ్వాస ఇబ్బందులను నివారించటం, నిర్మూలించటం, తగ్గించటం.

3.ఎక్కువ శారీరక శ్రమలేని ఉపాధి ఏర్పాటు చేసుకోవటం. 4. దుమ్ము ధూళి, పొగ, చల్లటి వాతావరణం నుండి దూరంగా ఉండటం. 5.ప్లాస్టిక్ బ్యాగ్స్, కార్పెట్స్, బెడ్‌షీట్స్, బెడ్స్, బ్లాంకెట్స్‌లో డస్ట్‌మైట్స్ (చిన్నపరాన్నజీవులు) ఉంటాయి. కాబట్టి 10 రోజులకోకసారి ఎండలో వేయటం, నీటితో శుభ్రం చేయడం. 6. పెంపుడు జంతువులకు దూరంగా ఉండటం చేయాలి

**రోగనివారణ:**బ్రాంకోడైలేటర్స్, కార్టికో,స్టీరాయిడ్స్, యాంటీబయాటిక్స్, స్ప్రేమందులు.. వీటి వలన వెంటనే ఉపశమనం కలుగుతుంది. కాని వ్యాధి మళ్ళీ తిరగబెడుతుంది. ధీర్ఘకాలికంగా మందులు వాడటం వలన సైడ్‌ఎఫెక్ట్స్, పిల్లల పెరుగుదల లోపాలు, మానసికఆందోళన, జ్ఞాపకశక్తితగ్గటం, బరువు పెరగటం వంటివి జరగవచ్చు. యోగా, మెడిటేషన్, చేయడం మంచిది. పొగత్రాగడం,

కాలుష్యపదార్థాలకు దూరంగా ఉండటం. స్వచ్ఛ మైన గాలి, నీరు ఉన్న ప్రదేశాలలో నివసించటం బాగా సివియర్ ఆస్తమా వచ్చే వారిలో అది ఆ ప్రదేశం ప్రభావంవల్ల కావచ్చు. ఇలాంటప్పుడు వారు స్థిరపడిన చోటునుంచి వీలైతే ఇతర ప్రదేశానికి మారడం మంచిది.

**హోమియోవైద్యం:**ఈ వైద్యవిధానం ద్వారా ఆస్తమాకు చక్కటి చికిత్సను అందించవచ్చు.ముఖ్యంగా పిల్లలలో అలర్జీలు, శ్వాసకోశ ఇబ్బంది లకు... వారి శారీరక, మానసిక విశ్లేషణ ద్వారా తగిన కాన్‌స్టిట్యూషనల్ ఔషదాన్నిగుర్తించి చికిత్సజరిపితేవ్యాధిని సమూలంగా తగ్గించ వచ్చును.

**వాడదగిన మందులు:**

ఆంటమ్‌టార్ట్, ఆంటిమోనిమ్, ఆర్స్ ఆర్సెనిక్ ఆల్బ్, స్పాంజియా, నాట్రంసల్ఫ్ ఆరేలియా, కార్బొవెజ్.




**డా. మురళి అంకిరెడ్డి**
M. D (Homeo)
**స్టార్ హోమియోపతి**




# చర్మం మీద నల్లమచ్చలు, తెల్లమచ్చలు

చర్మం యొక్క వర్ణమునకు మన శరీరంలోని మెలానిన్ పిగ్‌మెంట్ కారణంగా ఉంటుంది. ఈ మెలానిన్ పిగ్‌మెంట్ ఉత్పత్తిలో ఉన్న హెచ్చుతగ్గుల వల్ల మన చర్మంలో తెల్లమచ్చలు లేదా నల్లమచ్చలు రావచ్చు. మెలానిన్ పిగ్‌మెంట్ వల్ల చర్మం, కంటికి, జుట్టుకి వర్ణం వస్తుంది.

**నల్లమచ్చల రుగ్మతలు:**

**1. పోస్ట్ ఇన్‌ఫ్లమేటరీ హైపర్ పిగ్మెంటేషన్:** గాయం లేక వాపు వచ్చి మానడం వల్ల చర్మంలో నల్లమచ్చలు రావడాన్ని పోస్ట్ ఇన్‌ఫ్లమేటరీ హైపర్ పిగ్మెంటేషన్ అని అంటారు. ఈ అవస్తకి తరువాతనే మొటిమలు, సోరియాసిస్, ఎటోపిక్ మరియు కాంటాక్ట్ డెర్మటైటీస్, లైకెన్ ప్లానస్ వచ్చే అవకాశం వుంది. దీని వల్ల తెల్లమచ్చలు అప్పుడప్పుడు వచ్చే అవకాశం వుంది.

**2. మెలాస్మా:** శరీరంలో ఏ భాగమైతే ఎక్కువగా ఎండకి బహిర్గతం అవుతుందో అక్కడ ఈ విధంగా గోధుమ వర్ణంలో వున్న మచ్చలు వస్తాయి. ముఖ్యంగా ముఖము, చేతులు, పాదాలు, ఈ రకమైన మచ్చలు గర్భిణీలో కూడా చూడవచ్చు. కాని ఇవి ప్రసవం తరువాత వాటికంతట అవే పోతాయి.

**3. సోలార్ లెంటిజినెన్స్:** ఎక్కువ అల్ట్రావైలెట్ లైట్‌కి (కిరణాలకి) బహిర్గతం అయినప్పుడు చర్మం మీద నల్లగా చిన్నచిన్న మచ్చలు వస్తాయి. ఇవి ప్రాథమికంగా, ముఖం, చేతులు, చాతి, వీపు, కాళ్ళమీద వస్తాయి.

**4. ఎఫిలైడ్స్:** ఇవి సాధారణంగా పిల్లల్లో ఎక్కువగా కనబడతాయి. పిల్లలు ఎక్కువ ఎండకి బహిర్గతం అవడం వల్ల వస్తాయి. ఇవి ఎరుపు రంగు నుండి గోధుమరంగులో ముఖము, మెడ, ఛాతి, చేతుల మీద వస్తాయి. ఇవి స్వయంగా వాటికంతట అవే చలికాలం వచ్చేసరికి మానిపోతాయి.

**తెల్లమచ్చలు:**

**1. విటిలిగో:** మెలెనిన్ శాతం తక్కువ అవ్వడం వల్ల చర్మం మీద తెల్లమచ్చలు ఏర్పడతాయి. ఇవి మృదువుగా, తెల్లమచ్చలుగా ఏర్పడతాయి. ఇవి శరీరం మీద అక్కడక్కడ లేదా మొత్తం కూడా రావచ్చు

**2.ఆల్బినిజమ్:** శరీరంలో పూర్తిగా మెలెనిన్ పిగ్మెంట్ లేకపోవడం వల్ల ఈ రకమైన తెల్లమచ్చలు వస్తాయి. జుట్టు రంగు మరియు చర్మం రంగు తెల్లగా మారిపోతుంది. వంశపారంపర్యంగా వచ్చే అవకాశం వుంది.

**3. టీనియా వెర్సికలర్:** ఇది ఒకరకమైన ఫంగల్ ఇన్‌ఫెక్షన్. దీనిలో చర్మంపై అనేక తెల్లమచ్చలు. పొరలలో కూడా వస్తాయి. ఈ మచ్చలు అప్పుడప్పుడు పెరుగుతాయి కూడా. చర్మం జిడ్డుగా ఉన్నవాళ్ళు, చెమటలు ఎక్కువగా వస్తున్నవాళ్ళు, వ్యాధినిరోధకశక్తి తగ్గినవాళ్ళు వీళ్ళకి ఇవి ఎక్కువ రావడానికి అవకాశం వుంది.

**నిర్ధారణ:** రోగి శరీర, మానసిక, వంశపారంపర్య చరిత్ర ఆధారంగా రోగనిర్ధారణ చేయువచ్చును.

**చికిత్సవిధానం:** ఆయుర్వేద వైద్యనుసారం దూషించబడిన వాత, పిత్త, కఫ దోషాలను సమస్థితిలోకి తీసుకుని వచ్చే ఔషదాలు అద్భుతమైన లేపనాలు, పంచకర్మ విధానాలు ఉన్నాయి. వ్యాధి ఆరంభంలోనే రోగి ఆలస్యం చేయకుండా వైద్యుల్ని సంప్రదించి వ్యాధిని పూర్తిగా నివారించుకోవచ్చును.


**డా. లక్ష్మి** M. D (Ayurveda)
**స్టార్ ఆయుర్వేద**

# మహానంది

(28)



-వక్కంతం సూర్యనారాయణరావ్, సెల్:98662 67287

**కుబేరవర్మ సభాంగణం క్రిక్కిరిసి ఉంది. రాజోద్యోగులందరూ తమ తమ స్థానాలలో కూర్చున్నారు. సింహాసనం ఉన్న వేదిక కింద ప్రత్యేకంగా వేసిన ఆసనంమీద నంది కూర్చున్నాడు. మహారాణి మహిమాదేవి, యువరాణి లాలస మహారాజు కుబేరవర్మకు కొంచెం దూరంలో కూర్చున్నారు. వాళ్ళిద్దరి ఉనికీ సభ ప్రత్యేకతను తెలియజేస్తోంది.**

**కుబేరవర్మ సభను కలియజూసి ప్రారంభించాడు. "మన నగరానికి వేంచేసిన సాధుపుంగవులు శ్రీశ్రీశ్రీ నిత్యనిర్మలానందుల వారు తమ జ్ఞాననేత్రంతో దర్శించి మన మధ్య జరిగిన ఒకానొక దారుణ సత్యాన్ని వెల్లడి చేశారు. ఆ సత్యం సభలో ఆవిష్కరించ బడుతుంది!"**

రాజోద్యోగుల ముఖాలమీద ఒకే రకమైన ఆశ్చర్యం ప్రత్యక్షమైంది. అందరూ ఉత్కంఠతో తమ ప్రభువువైపు చూస్తూ ఉండిపోయారు.

"భద్రకా!" మహారాజు కంఠం ఖంగుమంది.

"ప్రభూ..." సహాయ సేనాని ముందుకు వచ్చి, వినయంగా తలవాల్చి నిలుచున్నాడు.

"ఆ ఆదర్శ మహిళను ప్రవేశపెట్టు!"

"ఆజ్ఞ!" అంటూ భద్రకుడు పక్కకు తిరిగి తెర వైపు చూస్తూ చెయ్యెత్తి సైగ చేశాడు.

తెరచాటు నుండి లవంగి నెమ్మదిగా అడుగులు వేస్తూ సభలో ప్రవేశించింది. ఆమె తల కిందకి వాలి ఉంది.

"ప్రభూ...ఈమె మన ఆస్థాన లేఖకుడి పత్ని లవంగి!" మహామంత్రి ఆశ్చర్యంగా అన్నాడు.

"ఔను సాగరామాత్యా! ఆ ఇల్లాలి ద్వారా ఒక సత్యం మా దృష్టికి వచ్చింది. పాక్షికంగా కొంత మాత్రమే వెల్లడైన ఆ సత్యాన్ని పరిపూర్ణంగా ఆవిష్కరించే లక్ష్యంతో ఈ ప్రత్యేక సమావేశం నిర్వహిస్తున్నాం!" అంటూ కుబేరవర్మ లవంగి వైపు చూశాడు.

"అమ్మా లవంగీ, ఆలయంలో అమ్మవారి ముందు నివేదించిన విషయం సభకు వినిపించు!"

లవంగి నిస్సహాయంగా మహారాజు వైపు చూసి, చూపుల్ని తన భర్త వైపు మళ్ళించింది. నందకుడు ఆశ్చర్యంగా చూస్తున్నాడు. అతనికి అంతా అగమ్యగోచరంగా ఉంది. లవంగి నిన్న సాయంత్రం నుండీ ఇంట్లో లేదు. ఎక్కడికి వెళ్ళింది? ఇక్కడికి ఎందుకు వచ్చింది? లవంగి ఆదర్శ మహిళా?!

"భయం లేదు లవంగీ, నిర్భయంగా చెప్పు!" మహారాజు హెచ్చరించాడు. "అందరూ ఏకాగ్రతతో ఆలకించండి!"

లవంగి తల వాల్చుకుని ప్రారంభించింది. ఆలయంలో చెప్పినదంతా అక్షరం పొల్లుపోకుండా చెప్పింది. ఆశ్చర్యం నిశ్శబ్దరూపంలో సభను ఆవరించింది. క్షణంలో ఎన్నో కంఠాల ద్వారా, వివిధ ధ్వనులతో ఆ ఆశ్చర్యం బహిర్గతమైంది. మహారాజు చేతిని పైకెత్తాడు. ఆయన చూపులు నందకుడి వైపు తిరిగాయి. నందకుడు భయాందోళనలతో చూస్తున్నాడు తన భార్యవైపు.

"నందకుణ్ణి మా సమ్ముఖానికి ఈడ్చుకు రండి!" కుబేరవర్మ కంఠస్వరం సభలో సుళ్ళు తిరిగింది.

మహామంత్రీ, సర్వసైన్యాధ్యక్షుడు సమర సేనుడూ ఆశ్చర్యంగా చూస్తున్నారు. ఇద్దరు భటులు నందకుణ్ణి రెక్కలు పట్టుకుని మహారాజు ముందుకు ఈడ్చుకు వచ్చారు. అతణ్ణి కొంచెం ముందుకు తోసి, ఇరువైపులా నిలుచున్నారు.

"నందకా! విన్నావుగా, నీ ధర్మపత్ని ప్రకటన! నీ భార్య వైపు కాదు, మా వైపు చూడు!" కుబేరవర్మ గద్దించాడు.

"ప్ర...ప్రభూ...నె..నె..నేను.." ఏం చెప్పాలో అర్థం కాని స్థితిలో తత్తరపాటుతో గొణిగాడు నందకుడు.

"నువ్వు దారుణ నేరం చేశావు. రుద్రాక్షుడికి శిక్ష విధించిన నాడు మా ముందు నువ్వు చెప్పినవన్నీ తప్పులనీ, ఆడినవన్నీ అసత్యాలనీ తేలిపోయింది. ఎందుకు అంత ఘోరానికి ఒడిగట్టావు? రుద్రాక్షుడి

## జరిగిన కథ

*కామరూపరాజ్య సర్వసైన్యాధ్యక్షుడు రుద్రాక్షుడిని రాజద్రోహిగా నిర్ధారించి యావజ్జీవ కారాగార శిక్ష విధించాడు మహారాజు కుబేరవర్మ. రుద్రాక్షుడి కొడుకు నందికి రాజ్యబహిష్కార శిక్ష విధిస్తాడు. స్వయంవరం రోజున యువరాణి లాలసాదేవి మాయమవుతుంది. తనను అపహరించిన కళింగ రత్న చెరనుంచి తప్పించుకున్న లాలసను నంది రక్షిస్తాడు. మార్గంలో ఎదురవుతున్న ఆపదల నుంచి తప్పించుకుంటూ, స్వదేశానికి చేరతారు నంది, లాలస. తల్లిదండ్రులను కలుసుకొని, జరిగినదంతా వివరంగా చెబుతుంది వారికి. నందిని యోగిగా పరిచయం చేస్తుంది. విషయం తెలుసుకున్న కుబేరవర్మ, ఆలయానికి దారితీసే సొరంగమార్గాన్ని మూయించివేస్తాడు. కళింగరాజ దంపతులు కామరూప రాజ్యానికి వచ్చి, జరిగినదానికి మన్నించమని కోరి, మహాశ్వేతాదేవి కలశం గురించి కూడా వివరిస్తారు. లేఖకుడు నందకుడి మాటలను చాటుగా వింటాడు నంది. పథకం ప్రకారం నందకుడి భార్య లవంగిని ఆలయానికి రప్పించి, ఆమె నోటి ద్వారానే జరిగిన విషయమంతా మహారాజుకి వినిపిస్తారు నంది, లాలస.*

*ఆ తర్వాత....*





మీద నీకు ఎందుకంత కసి? అతను నీకేం ద్రోహం చేశాడు? నిజం చెప్పు! ఒక్క అక్షరం అబద్ధం ఆడితే నీ నాలుక ఖండించబడుతుంది!" కుబేరవర్మ హూంకరించాడు.

నంది రెప్పవేయకుండా నందకుడి వైపే చూస్తున్నాడు. ఈ ఆస్థాన లేఖకుడు ముగ్గురి తలరాతలను తిరగరాశాడు..

"నందకా!" కుబేరవర్మ గద్దించాడు.

"...ప్రభూ.."

"రుద్రాక్షుడు వ్రాసినట్టు కల్పిత లేఖ వ్రాసింది నిజమేగా?"

"నిజమే ప్రభూ" నందకుడు నత్తి నత్తిగా అన్నాడు.

"ఎందుకు వ్రాశావు? అతని మీద పగ ఎందుకు?"

నందకుడు తలఎత్తి దీనంగా, నిస్సహాయంగా చూస్తూ ఎండిపోతున్న పెదవుల్ని నాలుకతో తడుపుకున్నాడు.

"ప్రభువులు చిత్తగించాలి.." లవంగి వినయంగా అంది.

"ఏమిటి?" కుబేరవర్మ ప్రశ్నించాడు.

"నా ప్రశ్నలకు సమాధానంగా నా భర్త ఒక మాట చెప్పాడు. 'నేను చేస్తోంది రాజోద్యోగం. పైవాళ్ళు చెప్పేవన్నీ తప్పులైనా, ఒప్పులైనా చేయాలి, తప్పదు' అన్నాడు. ఎవరు వ్రాయించారో చెప్పమని అడిగాను ప్రభూ. 'అది అతి రహస్యం. ప్రాణాంతకమైన రహస్యం! చెప్పను చెప్పలేను' అన్నాడు..."

"ఊ...నందకుడి లేఖ వెనుక మరెవరి హస్తమో ఉందన్నమాట!" కుబేరవర్మ గంభీరంగా అన్నాడు. "నందకా, చివరిసారిగా అడుగుతున్నాం! నీ చేత ఆ లేఖ వ్రాయించిన ఆ 'పైవాడు' ఎవడు? చెప్పకపోతే లేఖలు వ్రాసే నీ కుడిచెయ్యి తెగిపోతుంది."

నందకుడు వణికిపోతూ చూశాడు. నెత్తురు చుక్కలేని ముఖాన్ని కొద్దిగా పైకెత్తి మహారాజువైపు దీనంగా చూశాడు. "నా చేత ఆ లేఖ వ్రాయించింది... వ్రాయించింది.."

"ఎవరు? సమరసేనుడా?" కుబేరవర్మ గద్దించాడు.

నందకుడి తల అడ్డంగా ఊగింది. చెమటతో తడిసిపోతున్న ముఖాన్ని చేత్తో తుడుచుకున్నాడు.

"కాదా?" కుబేరవర్మ ఆశ్చర్యంగా అన్నాడు. "రుద్రాక్షుడు బలి అయిపోయాక సర్వసైన్యాధ్యక్ష పదవి లభించింది సమరసేనుడికే."

అందరి కళ్ళూ సమరసేనుణ్ణే చూస్తున్నాయి. సమరసేనుడు ఆసనం మీద నుండి లేచి నిలుచున్నాడు.

నందకుడు చిన్నగా దగ్గి, పూడుకుపోయిన కంఠం సవరించుకున్నాడు.

"ఆ లేఖ వ్రాయించింది మహామంత్రిగారు ప్రభూ.."

ఒక్కసారిగా సభను నిశ్శబ్దం ఆవరించింది.

"సాగరామాత్యుడా!" మహారాజు నిర్ఘాంతపోతూ అన్నాడు.

"చిత్తం.."

సాగరామాత్యుడు కొద్దిగా లేచి, మళ్ళీ బలహీనంగా ఆసనం మీద కూలబడ్డాడు. అతని చేతులు వశం తప్పి వణుకుతున్నాయి.

నంది ఓరగా చూస్తూ మహామంత్రిని గమనిస్తున్నాడు. నందకుడి అభియోగాన్ని ఆయన ఎందుకు ఖండించడం లేదు?

"నందకా, నమ్మశక్యంగా లేదు. అసత్యమని తేలితే నీకు మరణశిక్షే!" కుబేరవర్మ హూంకరించాడు.

"ప్రభూ...నేను...నేను..మనవి చేస్తాను.." మహామంత్రి పైకి లేస్తూ వణికే కంఠంతో అన్నాడు.

మహారాజు తలతిప్పి అతనివైపు అర్థం కానట్టు చూశాడు. "సాగరామాత్యా... నందకుడి అభియోగం అసత్యమా?"

సాగరామాత్యుడి తల బలహీనంగా అడ్డంగా ఊగింది. అతని ముఖం చెమటతో తడుస్తోంది. పెదవులు వణుకుతున్నాయి. "స...సత్యమే...ప్రభూ.."

"ఏమిటీ! సత్యమా?" కుబేరవర్మ అరిచాడు. ఆయన కనుబొమలు కదలి, మధ్యలో కలుసుకున్నాయి. దవడలు కంపించాయి. "సాగరా, వెళ్ళి అపరాధి నందకుడి పక్కన నిలబడు!"

సంబోధనలో, ఆజ్ఞలో మహారాజు కుబేరవర్మ ఆగ్రహం, అసహ్యం ధ్వనించాయి. మహామంత్రి సాగరుడు వణుకుతున్న కాళ్ళతో అడుగులో అడుగు వేసుకుంటూ, తూలుతూ నడవసాగాడు. అతని తల కిందకి వాలిపోయి ఉంది. సభలో ఉన్న అందరి చూపులూ అతని మీదే ఉన్నాయి. నందకుడి సమీపంలో నిలుచుని, సాగరుడు

**ఆస్థాన లేఖకుడు నందకుని భార్య లవంగి సభకు వచ్చి నిజాలు వెల్లడించింది. నందకుడు తలవాల్చి దోషిగా నిలబడ్డాడు. కానీ తెరవెనుక నందకునితో ఆ తప్పు చేయించిన వ్యక్తిని బయటకు రప్పించాలని కోరింది లవంగి. తెరవెనుక అసలు వ్యక్తి తప్పించుకున్నాడా? సర్వసైన్యాధ్యక్ష పదవిని రుద్రాక్షుడు ఎందుకు తిరస్కరించాడు? నంది, లాలస వివాహానికి రాజదంపతులు ఎందుకు అభ్యంతరం చెప్పారు?**

తల కొద్దిగాఎత్తి మహారాజు వైపు చూశాడు. నంది అతణ్ణే చూస్తున్నాడు. తన తండ్రికీ, సాగరుడికీ మధ్య సఖ్యతే ఉండేది. తన తండ్రిని ఎందుకు బలి పశువును చేశాడతను?

"సాగరా, ఏమిటి నీ వివరణ?" కుబేరవర్మ గద్దించాడు.

"ఆ లేఖను నందకుడి చేత నేనే వ్రాయించాను..."

"ఎందుకు?"

"కసి, పగ, ద్వేషం..ఏదైనా కారణం అనుకోవచ్చు..."

"సాగరా...పొడి అక్షరాలు వద్దు. .మర్యాదగా, వివరంగా విన్నవించుకో!" కుబేరవర్మ హూంకరించాడు.

"చిత్తం...చిత్తగించండి." సాగరుడు బరువుగా నిట్టూర్చి అన్నాడు. "రుద్రాక్షుడి మీద కక్ష గట్టాను. తన కుమార్తెను నా కుమారుడికీ, నా కుమార్తెను అతని కుమారుడికీ చేసుకొమ్మన్నాను. మధ్యవర్తి ద్వారా అడిగాను. అతను తిరస్కరించాడు. నా కుమారుడి మనసు విరిగింది. దీపాంకురను వాడు ఇష్టపడ్డాడు. తిరస్కరణ కారణంగా ఆత్మహత్య చేసుకున్నాడు. నా కుమారుడి చితిమంట నాలో పగ రగిలించింది. రుద్రాక్షుణ్ణి సర్వనాశనం చేయాలనుకున్నాను. పథకం వేశాను. నందకుడి స్వార్థాన్ని ఉపయోగించుకున్నాను. పగ తీర్చుకున్నాను."

నంది ఆశ్చర్యంతో నోరు తెరిచాడు. అంత పగా, కసీ ఉన్న సాగరుడు తన తండ్రితో చాలా స్నేహంగా ఉండేవాడు. అంటే, అనుమానం రాకుండా సఖ్యత నటించాడన్నమాట.

కుబేరవర్మ నోట మాట లేకుండా ఆశ్చర్యంగా సాగరుణ్ణే చూస్తూ ఉండిపోయాడు. మెల్లగా అతని పెదవులు కదిలాయి. "సాగరా, నువ్వు చేసింది క్షమార్హం కాని అన్యాయం..ఘోరమైన నేరం!"

"తెలుసు...ప్రభూ...తెలిసే చేశాను. దొరికిపోనన్న నమ్మకంతో చేశాను..." సాగరుడు వణికే కంఠంతో అన్నాడు.

"భద్రకా!" మహారాజు బిగ్గరగా అన్నాడు.

"ప్రభూ!"

"రుద్రాక్షుడూ, ఆయన పుత్రిక దీపాంకుర మా సన్నిధికి రావాలి. సగౌరవంగా తీసుకురండి!" కుబేరవర్మ ఆజ్ఞాపించాడు.

***

నంది గుండె దడదడ కొట్టుకుంది. ఇద్దరు భటుల మధ్య తన తండ్రి నెమ్మదిగా నడిచి వస్తున్నాడు. శారీరకంగా కొంత సన్నబడినట్టున్నా, నడకలో ఠీవీ, గాంభీర్యం అలాగే ఉన్నాయి. గెడ్డమూ, మీసాలూ పెరిగి ఉన్నాయి. కళ్ళు వెలుతురుతో నిండి ఉన్నాయి; మునుపటిలాగే. ఆ కళ్ళల్లో దైన్యం లేదు. దిగులు లేదు. సభలో ఉన్న వాళ్ళందరి చూపులూ ఆయన మీదే ఉన్నాయి. ఆయన చూపులు మహారాజు కుబేరవర్మ మీద ఉన్నాయి.

"స్వాగతం రుద్రాక్షా! రా!" కుబేరవర్మ గంభీరంగా అన్నాడు.

రుద్రాక్షుడు కుబేరవర్మకు మౌనంగా అభివాదం చేశాడు.

"అమ్మాయి ఏది?" కుబేరవర్మ అన్నాడు.

"ఇదిగో ప్రభూ వచ్చేసింది.." అంటూ భద్రకుడు అంతఃపురంవైపు ద్వారం వద్ద నుండి వస్తూ అన్నాడు.

దీపాంకుర తల వాల్చుకుని మెల్లగా నడుస్తూ వస్తోంది.

నంది కళ్ళు మెరుస్తున్నాయి. తన చిన్ని చెల్లిని ఎన్నాళ్ళకు చూస్తున్నాడు! దీపాంకుర చిక్కిపోయింది. ముఖంలో, కళ్ళల్లో దైన్యం, నిరాశ స్పష్టంగా అవుపిస్తున్నాయి. ఒకవైపు తండ్రి, మరోవైపు చెల్లి...ఇద్దర్నీ ఒకే సారి కౌగిలించుకోవాలనిపిస్తోంది నందికి. ఏదో భావోద్వేగం అతణ్ణి కుదిపేస్తోంది. కళ్ళల్లో తడి ఏర్పడుతూ పల్చటి తెరలా అడ్డుపడుతోంది.

సింహాసనం వేదికకు అటూ ఇటూ మౌనంగా నిలుచున్న రుద్రాక్షుణ్ణీ, దీపాంకురనూ కలియజూశాడు కుబేరవర్మ.

"రుద్రాక్షా, నీకు అన్యాయం జరిగింది. రాజద్రోహి, దేశద్రోహి అనే ఆరోపణలతో నీకు యావజ్జీవ కారాగారవాస శిక్ష విధించబడింది..."

"ప్రభూ..."

"ఔను రుద్రాక్షా! నీ మీద మోపబడిన అపరాధం చేసింది నువ్వు కాదు; ఇప్పటిదాకా మన మహామంత్రిగా ఉంటూ సాగరామాత్యుడు అని పిలిపించుకున్న సాగరుడు! నీకు విధించిన శిక్ష ఈ క్షణం నుండీ ఉపసంహరించబడింది. నువ్వు నిరపరాధివి!"

రుద్రాక్షుడు తల తిప్పి సాగరుడి వైపు చూశాడు. సాగరుడు తల దించుకున్నాడు.

"నందకుడి చేత ఆ కల్పిత లేఖను నీ పేరిట సాగరుడు వ్రాయించాడు! నీకు విధించిన శిక్షకు అనుబంధంగా నీ పుత్రికనూ, పుత్రుడినీ శిక్షించాల్సి వచ్చింది. నీ పుత్రిక దీపాంకురకు విముక్తి కలిగిస్తున్నా.."

"ప్రభువులకు శతకోటి ధన్యవాదాలు. తమరు విధించిన శిక్ష కన్నా నింద నన్ను ఎక్కువ బాధ పెట్టింది. నా నిర్దోషిత్వాన్ని తమరే నిరూపించారు.."

"నేను కాదు రుద్రాక్షా...నీ ధన్యవాదాలు అదిగో ఆ నిత్యనిర్మలానంద యోగి పుంగవులకు సమర్పించుకో. ఆయన జ్ఞాననేత్రంతో చూసి, మా కళ్ళు తెరిపించారు!" కుబేరవర్మ నందివైపు చూపుతూ అన్నాడు.

రుద్రాక్షుడు మంత్రముగ్ధుడిలా నంది వైపు అడుగులు వేశాడు. నంది లేచి నిలుచున్నాడు. తనవైపు చూస్తున్న రుద్రాక్షుడి కళ్ళల్లోకి చూశాడు.

"ఆర్యా, నమస్కరించకండి. మీరు పెద్దలు. ఆశీర్వదించాల్సిన వారు!" అన్నాడు రెండు చేతుల్నీ పట్టుకుంటూ.

లాలస చిరునవ్వుతో చూస్తోంది.

దీపాంకుర తండ్రి వైపు పరుగెత్తుకు వచ్చింది. "నాన్నా..." అంటూ ఏడుస్తూ అతని మీద వాలిపోయింది.

రుద్రాక్షుడు ఈదురుగాలికి వణికే తీగలా కదిలిపోతున్న కూతుర్ని పొదివి పట్టుకున్నాడు.

"ఏడవకు తల్లీ...మహారాజుగారు మనకు పునర్జన్మ ప్రసాదించారు.." రుద్రాక్షుడు బొంగురుగా అన్నాడు.

నంది దీపాంకుర తల మీద అరచేతిని ఉంచాడు. "ఏడవకమ్మా!" అన్నాడు ఓదార్పుగా.

"సాగరా, నువ్వు ఏదైనా మనవి చేయదలుచుకున్నావా?" మహారాజు కుబేరవర్మ ప్రశ్నించాడు.

సాగరుడు బలహీనంగా తల అడ్డంగా ఊపాడు.

"భద్రకా, సాగరుడికి సంకెళ్ళు వేయి!" కుబేరవర్మ ఆజ్ఞాపించాడు.

కాసేపట్లో సాగరుడి చేతులనూ, కాళ్ళనూ సంకెళ్ళు బంధించాయి.

మహారాజు సాగరుడికి విధించే శిక్ష ఏమిటో వినాలన్న ఆత్రుతతో సభలో అందరూ ఊపిరి బిగపట్టి, చెవులు రిక్కించారు.

"సాగరా, నువ్వు చేసిన దారుణ నేరానికి నీతిమంతుడూ, దేశభక్తుడూ అయిన రుద్రాక్షుడి యావజ్జీవ కారగారవాస శిక్షను నీకు విధిస్తున్నాం!" కుబేరవర్మ గంభీరంగా అన్నాడు.

సభలో కలకలం బయలుదేరింది.

"భద్రకా, అపరాధిని కారాగారంలో పడవేయించు! తీసుకుపో!" కుబేరవర్మ కంఠం ఖంగుమంది.

మహామంత్రిగా అధికారం ప్రదర్శిస్తూ, రాణించిన సాగరుడు వంచిన తల ఎత్తకుండా వెళుతున్నాడు.



"ఆచార్యా!" మహారాజు కుబేరవర్మ రాజగురువుని ఉద్దేశించి అన్నాడు.

"మహారాజా!" రాజగురువు సులోచనాచార్యుడు మహారాజు వైపు చూస్తూ అన్నాడు.

"దయచేసి, కొంచెం ఇటు దయచేయండి!"

సులోచనాచార్యుడు తన స్థానం నుండి లేచి, సింహాసనం వేదిక వద్దకు నడిచి, ప్రశ్నార్థకంగా చూశాడు.

మహారాజు కుబేరవర్మ రాజగురువు వైపు చిరునవ్వుతో చూశాడు. "ఈ క్షణం నుండీ రాజగురుదేవులూ, మహామాత్యులూ మీరే! ఆ ఆసనాన్ని అధిష్టించండి!"

"మహారాజా!"

"మాకు మార్గదర్శనం చేయండి మహామాత్యా!" కుబేరవర్మ గంభీరంగా అన్నాడు. "ఆస్థాన లేఖకుడు ధనదాహంతో చేయరాని పని చేశాడు. అతనికి వేయదగిన శిక్షను సూచించండి!"

సులోచనాచార్యుడు తలవాల్చి చేతులు కట్టుకుని, నిలుచున్న నందకుడి వైపు చూశాడు. అదే సమయంలో నందకుడి సమీపానికి వస్తున్న లవంగి ఆయన దృష్టిని ఆకర్షించింది.

"మహారాజా, నందకుడి భార్యను 'ఆదర్శ మహిళ' అన్నారు మీరు. ఆదర్శ మహిళను ముందుగా అభినందించాలి. అనంతరం అపరాధికి శిక్ష" అన్నాడు సాభిప్రాయంగా సులోచనాచార్యుడు.

"మీ సూచనలో ఔచిత్యం ఉంది!" అంటూ మహారాజు లవంగి వైపు చూశాడు. "అమ్మా, లవంగీ, భర్త చేసిన పాపాన్ని నువ్వు నిస్సంకోచంగా వెల్లడించావు. ఏదైనా కానుక కోరుకో!"

లవంగి పైట చెరగు రెండు చేతుల్తో పట్టుకుంది. కన్నీళ్ళతో మహారాజు వైపు చూసింది. "పతి భిక్ష...ప్రసాదించండి..ప్రభూ!"

కుబేరవర్మ క్షణకాలం ఆలోచించాడు. "మహామాత్యా.." అన్నాడు సులోచనాచార్యుణ్ణి చూస్తూ.

"మహారాజా, నందకుడు తన ఉద్యోగధర్మం విస్మరించి, అసత్య లేఖ లిఖించి, ఆ వృత్తికీ, ఆ పదవికి తాను తగడని నిరూపించుకున్నాడు. ఆస్థాన లేఖక పదవి నుండి తొలగించడమే తగిన శిక్ష."

కుబేరవర్మ తల పంకించాడు. "అపరాధి నందకుడిని ఆస్థాన లేఖక పదవి నుండి తొలగిస్తున్నాం. ఆ పదవితో పాటు అతనికి ధారాదత్తం చేసిన మడులూ, మాన్యాలూ, గృహవసతీ తదితర సదుపాయాలను ఉపసంహరిస్తున్నాం. అతని ధర్మపత్ని కోరికను మన్నించి, కారాగార శిక్ష విధించకుండా నందకుణ్ణి వదిలివేస్తున్నాం!"

లవంగి చేతులెత్తి నమస్కరించింది. నందకుడు ఆమెను అనుసరిస్తూ మహారాజుకు చేతులు జోడించాడు.

"భర్త తస్కరించిన వజ్రాలహారాన్నీ, మేము అతనికి బహూకరించిన ముత్యాలహారాన్నీ లవంగి కామరూపాంబికకు సమర్పించుకుంది. అందుకు అభినందనగా ఆమెకు ఒక రత్నహారం ఇవ్వబడుతుంది!" మహారాజు కుబేరవర్మ ప్రకటించాడు.

లవంగి మళ్ళీ నమస్కరించింది. సభలో హర్షధ్వానాలు వ్యాపించాయి.

"మహారాజా, మరొక ఆజ్ఞ వెలువడాల్సి ఉంది. సులోచనామాత్యుడు చిరునవ్వుతో అన్నాడు. "రుద్రాక్షుడికి.."

"గుర్తుంది మహామాత్యా" అంటూ కుబేరవర్మ రుద్రాక్షుడి వైపు తిరిగాడు. "రుద్రాక్షా, నీ సర్వసైన్యాధ్యక్ష పదవి నీదే! ఈ క్షణం నుండీ సర్వసైన్యాధ్యక్షుడివి. ఆ పదవిలో కొనసాగిన సమరసేనుడు నీకు ప్రధాన సహాయక పదవిలో ఉంటాడు.."

"ప్రభువులు క్షమించాలి.." రుద్రాక్షుడు వినయంగా అన్నాడు. "నేను ఆ పదవి చేపట్టలేను..."

"రుద్రాక్ష, మనసు గాయపడినందుకా?"

"కాదు ప్రభూ...నా గాయం ఇందాకే మాని పోయింది. దేశ బహిష్కరణకు గురైన నా ఒక్కగానొక్క కుమారుణ్ణి అన్వేషించి, చేరుకోవాలి.."

"ఓహ్...రుద్రాక్ష, సాగరుడి పగతో నీ కుటుంబానికంతటికీ నష్టం జరిగింది. నీ కుమారుడికి విధించిన దేశ బహిష్కార శిక్ష ఉపసంహరించబడింది!"

సభలో హర్షధ్వానాలు సద్దుమణిగాక రుద్రాక్షుడు అన్నాడు. "ప్రభువులకు ధన్యవాదాలు. శిక్ష ఉపసంహారం గురించి నా కుమారుడికి తెలియజేయాలి. అందుకోసం నేను దేశాటన చేయాలి..."

అవసరం లేదు సర్వసైన్యాధ్యక్షులూ!" నంది పైకి లేస్తూ బిగ్గరగా అన్నాడు.

మహారాజూ, మహామంత్రీ, రాజోద్యోగులూ, సభికులూ అందరూ నంది వైపు ఆశ్చర్యంగా చూశారు. యువరాణి లాలస చిరునవ్వుతో చూస్తోంది. రుద్రాక్షుడు, దీపాంకుర ప్రశ్నార్థకంగా చూస్తున్నారు.

"గురుదేవా!" మహారాజు ఆశ్చర్యంగా అన్నాడు.

నంది కొంచెం ముందుకు జరిగి మహారాజుగారి వైపు తదేకంగా చూశాడు.

"రుద్రాక్ష పుత్రుడు నంది కోసం అన్వేషించాల్సిన అవసరం లేదు. అతను ఈ నగరంలోనే ఉన్నాడు.."

"ఈ నగరంలోనా, గురుదేవా? ఎక్కడ?" కుబేరవర్మ గంభీరంగా అన్నాడు.

"ఇక్కడే!"

"ఇక్కడా?!"

"ఔను మహారాజా...ఇక్కడే మీ కళ్ళముందే!"

"గురుదేవా..మీరు.."

"గురుదేవా అనకండి మహారాజా. నేనే నంది!"

మహారాజు కుబేరవర్మ, మహామంత్రి నివ్వెరపాటుతో తమ ఆసనాల మీద నుండి లేచారు. వారితో బాటు కూర్చున్న రాజోద్యోగులందరూ లేచి నిలుచున్నారు. సభలో కలకలం. రుద్రాక్షుడు వణుకుతున్న కాళ్ళను అదుపులో ఉంచుకునే ప్రయత్నం చేస్తూ నందివైపు అడుగులు వేస్తున్నాడు. క్షణంలో అతనూ, నందీ, దీపాంకుర ఒకరి కౌగిలిలో ఒకరు ఒదిగిపోయారు.

"ఇది నిజమా? నంది నిత్యనిర్మలానందయోగి అయ్యాడా?" మహారాజు కుబేరవర్మ ఆశ్చర్యంగా అన్నాడు.

"ఔను నాన్నగారూ!" లాలస లేస్తూ బిగ్గరగా అంది.

సభ వెయ్యి కళ్ళతో యువరాణి వైపు చూసింది.

"లాలస!" మహారాజు కుబేరవర్మ కంఠంలో ఆశ్చర్యం గంటలా ధ్వనించింది.

"ఔను నాన్నగారు. నన్ను అపహరించుకుపోయిన దుర్మార్గుల చెరనుండి తప్పించుకుని, వెంటాడుతున్న వాళ్ళకు చిక్కకుండా ప్రాణాలు అరచేతిలో పెట్టుకుని పరుగెడుతూ, ఒక చీకటి వీధిలో తారసిల్లిన ఒక వ్యక్తి మీద వాలి, స్పృహ కోల్పోయాను. ఆయనెవరో నాకు తెలీదు. నేనెవరో ఆయనకు తెలీదు! తాను చేరదీసి రక్షించింది తనకూ, తండ్రికీ, చెల్లికీ శిక్షలు విధించిన కామరూప చక్రవర్తిగారి కూతురేనని తెలిసిన తరువాత కూడా నంది వెనకాడలేదు. ప్రతీకారం చేయాలనుకోలేదు. తన ప్రాణాలు పణంగా పెట్టి మీ కుమార్తెను రక్షించి, తీసుకువచ్చాడు.."

"అమ్మా.."

"మన రాజ్యంలోకి అడుగుపెట్టకూడదనీ, బహిష్కరణ శిక్ష ఉందనీ మొండికేశాడు. అపరాధులెవరో విచారించి తాము నిరపరాధులమని నిరూపించుకోవడానికి అతను మన నగరానికి రావాలని నేనే వాదించి ఒప్పించాను. యోగి వేషం నేనే ఆయనకు వేశాను. నిత్యనిర్మలానంద నామధేయం నేనే ఇచ్చాను!" లాలస ముగించింది.

"ప్రభూ, రాజాజ్ఞ ధిక్కరించి రాజ్యంలో అడుగుపెట్టాను. నా లక్ష్యం నెరవేరింది. నా తండ్రి నిరపరాధి

అని తేల్చగలిగాను. తండ్రికీ, చెల్లికీ విముక్తి కలిగించ గలిగాను. బహిష్కార శిక్షను నిర్లక్ష్యం చేస్తూ రాజ్యంలో ప్రవేశించినందుకూ, మారువేషంతో ప్రవర్తించినం దుకూ మీరు ఏ శిక్ష వేసినా అనుభవిస్తాను!" నంది వినయంగా అన్నాడు.

మహారాజు కుబేరవర్మ సింహాసనం మీద చతి కిల పడ్డాడు. కనుబొమలు ముడివేస్తూ, నుదురును అరచేత్తో రుద్దుకున్నాడు. ప్రశ్నార్థకంగా సులోచనా చార్యుడి వైపు చూశాడు.

"మహారాజా, రుద్రాక్ష పుత్రుడు రాజశాసనం ధిక్కరించి రాజ్యంలో పాదం మోపాడు. అది శిక్షార్హమే. కానీ దానికి మూలకారణం న్యాయరక్షణ, ధర్మరక్షణ. మన రాజ్యానికీ, ప్రభువుకూ, పరిపాలనా ధర్మానికీ విఘాతం కలిగించి, భవిష్యత్తులో ప్రమాదానికి కారణ మయ్యే అకార్యాలు చేసిన స్వార్థపరులను పట్టివ్వడా నికీ, అన్యాయాన్ని అరికట్టడానికీ నంది చేసిన శాసనో ల్లంఘన ఉపయోగపడింది. అది సాహసం! ఆ సాహసం అతను చేసిన శాసనోల్లంఘన నేరాన్ని సమూలంగా చెరిపివేసింది. నంది శిక్షార్హుడు కాదు, మహారాజా, ప్రశంసార్హుడు! తగు విధంగా ఆ యువ కిశోరాన్ని సత్కరించడం ఈ సభ విధి!" సులోచనా చార్యుడు నిర్ద్వంద్వంగా అన్నాడు.




"సముచితమైన నిర్ణయం. సులోచనామాత్యుల సూచనను పరిపూర్ణంగా గౌరవించి, పాటిస్తాం. మహావీరుడు నందిని అతని శక్తిసామర్థ్యాలకు తగిన ఉన్నత పదవిలో నియమిస్తాం!" మహారాజు కుబేర వర్మ సగర్వంగా అన్నాడు.

రుద్రాక్షుడు నందివైపు సగర్వంగా చూస్తున్నాడు.

"నందికి తగిన ఉన్నత పదవి ఏదో నేనే నిర్ణయిం చాను నాన్నగారూ.." లాలస స్పష్టంగా అంది.

"అలాగా.. ఏమిటమ్మా ఆ పదవి? చెప్పు! నంది ఆ పదవినే అలంకరించేలా చేస్తా!" కుబేరవర్మ లాలస వైపు చూస్తూ అన్నాడు.

"కామరూప రాజదంపతుల అల్లుడు పదవి!" లాలస కంఠంలో నిర్ణయం సంకోచం లేకుండా ధ్వనించింది.

సభ ఆశ్చర్యంలో మునిగిపోయింది. అందరితో బాటు నంది కూడా. అతనికీ ఇది ఊహించని పరిణా మమే. సభలోని మనుషుల్ని విగ్రహాల్లా మార్చివేసిన నివ్వెరపాటు నుండి మహారాణి మహిమాదేవి ముందుగా తేరుకుంది.

"లాలసా!" బిగ్గరగా అరిచిందామె.

లాలస తల్లివైపు చిరునవ్వుతో చూసింది.

"మతిపోయిందా నీకు?" మహారాణి గర్జించింది. "సభ్యతా, సంస్కారం, వంశగౌరవం అన్నీ మరిచిపోయావా?"

"మరిచిపోయానమ్మా. నా మాన ప్రాణాలు మహాపదలో ఉన్న తరుణంలో నంది చేతిని పట్టుకుని పరుగెత్తాను. రెండురోజుల పాటు నదీప్రవాహంలో ప్రయాణం చేసే సందర్భంలో ఈత కొట్టలేని మీ కూతురు నంది వీపు మీద బల్లిలా పడుకునీ ప్రాణాలు కాపాడుకున్నప్పుడు సభ్యతనూ, సంస్కా రాన్నీ, నా వంశగౌరవాన్నీ మరచిపోయాను. ఆశ్వి కులు వెంటాడుతూ ఉంటే, గంగిరెద్దుల వాడిలా వేషం వేసుకున్న నందితోపాటు, గర్భిణి అయిన గంగిరెద్దులవాడి భార్యగా రాత్రీ పగలూ కాళ్ళు బొబ్బ లెక్కేలా ప్రయాణం చేసినప్పుడూ అవన్నీ మరిచిపో యాను. గడపల ముందు గంగిరెద్దును ఆడించి, నంది ఆహారం అడుక్కు తెచ్చి ఇచ్చినప్పుడూ అవన్నీ మరిచిపోయాను!" లాలస గంభీరంగా అంది.

ఆమె మాటలు హర్షధ్వానాలు సృష్టించాయి. కుబేరవర్మ కూతురు దగ్గరగా నడిచాడు. "లాలసా, ఆపదలో రక్షించిన వ్యక్తి పట్ల మనసు ఆర్ద్రం అవడం సహజమే. నువ్వు అంతర్ధానమైనప్పుడు నిన్ను అన్వే షించి, సురక్షితంగా తెచ్చి అప్పగించే రాకుమారుడికి నిన్ను ఇల్లాలుగా చేసి, రాజ్యం ఇచ్చివేస్తానని ప్రకటిం చాను కూడా. అయితే, నిన్ను రక్షించి తీసుకు వచ్చిన వ్యక్తి రాకుమారుడు కాదు. నీ ఎన్నిక మమ్మల్ని ఆందోళనకు గురిచేస్తోంది. మా మాట విని..."

"నా మాట వినండి నాన్నగారూ! మీ ప్రకటన విన్న రాకుమారులలో ఒక్కరైనా ప్రయత్నించారా? నన్ను వెతికి తీసుకువస్తానని ఒక్క రాకుమార వీరు డైనా ప్రకటించాడా? నంది గురించి రెండు మాటలు వినండి. ఆపదలో నిస్సహాయురాలిగా అతన్ని ఆశ్ర యించినప్పుడు గానీ, ఒంటరిగా అతనితో చెట్ల మధ్యా పుట్టల మధ్యా కారడవులలో ప్రయాణం చేసి నప్పుడు గానీ, గంగిరెద్దుల వాని వేషంలో అతని భార్యగా నటించినప్పుడు గానీ, నదీప్రవాహంలో అతని వీపు మీద కూర్చున్నప్పుడు గానీ నంది నా వైపు చులకనగా చూడలేదు. అందగత్తె నిస్సహా యంగా తన గుప్పెట్లో ఉందన్న భావంతో, కోరికతో గానీ కామంతో గానీ చూడలేదు. నిస్సహాయురాలైన కన్యమీద కన్ను వేయకుండా కాపాడటం నిజమైన మగతనం నాన్నగారూ! అదే నిజమైన పురుష లక్షణం. అందుబాటులో ఉన్న అబల కోసం అర్రులు చాచని పురుష లక్షణం యదార్థమైన పురుష లక్షణం! ఈ లక్షణాలున్న ధైర్యవంతుడు, నిగ్రహం కలిగిన యువకుడు, వీరుడు మీ అల్లుడు కావాలని ఆశిస్తు న్నాను నాన్నగారూ... కేవలం రాకుమారుడిగా జన్మిం చిన సామాన్యుణ్ణి కాదు! నా వివాహం జరిగితే నందితో జరుగుతుంది. అంతే!"

మహారాజూ, మహారాణీ అయోమయంగా ముఖాలు చూసుకున్నారు. ఇద్దరూ అదే అయోమ యంతో సులోచనాచార్యుడి వైపు చూశారు.

"తన మాన ప్రాణాలను నిస్వార్థంగా కాపాడిన వీర యువకుడి వ్యక్తిత్వాన్ని కన్నెపిల్ల మనసు లతలా అల్లుకుపోతుంది. రుద్రాక్ష పుత్రుడు నంది ధీరుడూ, ఉదాత్తుడూ అయిన నాయకుడని స్పష్టంగా అర్థమవు తోంది. అందాల భరిణ అయిన యువరాణిని మరొక రైతే అంత నిర్వికారంగా అప్పగించేవారు కాదు. నేను రాజగురువుగా, మహామంత్రిగా, తమ శ్రేయోభిలాషిగా యువరాణి సౌభాగ్యవతి లాలసాదేవి ప్రతిపాదనను సమర్థిస్తున్నాను" సులోచనాచార్యుడు అన్నాడు.

సభాంగణంలో హర్షధ్వానాలు ప్రతిధ్వనించాయి. రుద్రాక్షుడు చెమ్మగిల్లిన కళ్ళతో నందిని చూస్తున్నాడు. నంది నివ్వెరపాటుతో లాలస వైపే చూస్తున్నాడు.

"నేను ఈ ప్రతిపాదన తెచ్చినప్పుడు నంది నిర్ద్వం దంగా తిరస్కరించాడు. అల్లుడు కమ్మని ఆజ్ఞాపిం చండి నాన్నగారూ!" లాలస అంది.

మహారాణి మహిమాదేవి కుమార్తె వైపు రెప్ప వేయకుండా చూసింది. "లాలసా, ఇది రాజకుటుంబా నికి సంబంధించిన విషయం; రాజ్యానికి సంబంధిం చిన విషయం కాదు. నిండు సభలో చర్చించాల్సిన అవసరం లేదు. అది అవాంఛితం కూడా!"

లాలస తల్లి వైపు చిరునవ్వుతో చూసింది. "నా వివాహమే జరిగితే రాజ్యమంతా, ఊరూవాడా, ఇంటింటా ఉత్సవాలు చేసుకోవాలని ఆదేశిస్తారే! రాజ్యమంతా పండుగ చేసుకునే విషయం కుటుంబానికి ఎలా పరి మితమవుతుందమ్మా!"

"అమ్మాయి చెప్పింది నిజం" కుబేరవర్మ అన్నాడు. "లాలస అదృశ్యమైన నాటి నుండీ ఈనాటిదాకా జరి గినవన్నీ మన సామ్రాజ్యమంతా తెలుసు. ఈ అంశాన్ని దాచవలసిన అవసరం లేదు.."

"ప్రభువుల అభిప్రాయం శ్లాఘనీయం!" అన్నాడు సులోచనాచార్యుడు.

మహారాజు రుద్రాక్షుడి వైపు తిరిగాడు. "రుద్రాక్షా నీ అభిప్రాయం ఏమిటో.."

"జరుగుతున్నదంతా ఏదో కలలాగా ఉంది. నా కాళ్లు నేలమీద లేవు! అడగకండి ప్రభూ. ఆజ్ఞాపిం చండి!" రుద్రాక్షుడు చెమ్మగిల్లిన కళ్ళతో చూస్తూ బొంగురుగా అన్నాడు.

"నందీ!" కుబేరవర్మ గంభీరంగా పిలిచాడు.

నంది ఆయన ముందుకు నడిచి, వినయంగా నిలుచున్నాడు.

"యువరాణి నిన్ను ఆజ్ఞాపించమంది. ఆజ్ఞాపి స్తున్నాం. మా కుమార్తెను వివాహం చేసుకో!"

నంది ఓరగా లాలస వైపు కాసేపు చూసి, మహా రాజు వైపు తిరిగి వినయంగా చేతులు కట్టుకుని తల వాల్చాడు. దీపాంకుర నంది దగ్గరగా జరిగి అతని చేతిమీద తన చేతిని వేసింది. ఆ స్పర్శ ధ్వని లేని భాషలో ఆమె ఆనందాన్ని అతనికి తెలియజేస్తోంది.

"మహారాజా, ఒక విషయం విన్నవించాలి..."

సులోచనాచార్యుడు అన్నాడు.

"చెప్పండి.."

"వివాహాలకు సిద్ధాంత ముహూర్తాలు ఈ మాసంలో మాత్రమే ఉన్నాయి. తరువాత ఈ సంవత్సరంలో శుభముహూర్తాలు లేవు.."

"ఈ మాసంలోనే నిర్ణయించండి. ఆలస్యం ఎందుకు?" కుబేరవర్మ చిరునవ్వుతో అన్నాడు.

సులోచనాచార్యుడి వేళ్ళూ, పెదవులూ కదులుతున్నాయి. గణన ముగించి, ఆయన మహారాజు వైపు చూశాడు. "దశమి, బుధవారం. చక్కటి ముహూర్తం ఉంది మహారాజా. అన్ని విధాలా శ్రేష్ఠమైన ముహూర్తం."

"శుభం! ఆనాడే మా కుమార్తె వివాహం!" కుబేరవర్మ ప్రకటించాడు ఉత్సాహంగా.

"రాజ్యమంతా చాటింపు వేయించండి!" మహారాణి అంది.

నంది కుబేరవర్మ వైపు వినయంగా చూశాడు. "మహారాజు గారికి ఒక మనవి. దేశాంతర వాసంలో ఉన్నప్పుడు నాకు ఆశ్రయం ఇచ్చిన కుటుంబాలు రెండు ఉన్నాయి. ఒకటి పుష్పగిరి రాజ్యంలోని శివగిరి పట్టణంలో, రెండవది రత్నకటకంలో ఉన్నాయి. ఆ కుటుంబాలను వివాహానికి ఆహ్వానించాలి. అందుకు తమ అనుమతి కావాలి...."

"అందుకు అభ్యంతరం ఏముంది నాయనా? ఆహ్వానించుదాం!" కుబేరవర్మ అన్నాడు.

"వివాహానికి ముందే నంది తన వేషం తీసివేసి, నిజరూపంలో కనిపించాలి!" అంది లాలస నవ్వుతూ. అందరూ నవ్వారు.

***

నందీ లాలసల వివాహం వైభవంగా జరిగింది.

వివాహానికి వచ్చిన భజరంగి కుటుంబాన్నీ, అపరంజి కుటుంబాన్నీ నంది లాలసా వస్త్రాలతో, ఆభరణాలతో సత్కరించారు. నంది భజరంగినీ, ఆయన పుత్రికలనూ రాజదంపతులకు పరిచయం చేశాడు. అపరంజినీ, ఆమె భర్త మోదకుడినీ పరిచయం చేశాడు. తాను తలదాచుకున్న విషయాన్ని లాలస తల్లిదండ్రులకు వివరించింది. కుబేరవర్మ ఆ విశిష్ట అతిథులను చిరునవ్వుతో చూశాడు. "మా అల్లుడిగారి పట్టాభిషేకం త్వరలో జరుగుతుంది. ఆ ఉత్సవం జరిగేదాకా మీరందరు ఇక్కడే మా అతిథులుగా ఉండాలి!"

"ఔను!" అంది మహారాణి మహిమాదేవి.

"మహారాజుగారికి చిన్న విన్నపం. ఆ కార్యక్రమానికి ముందు రెండు కార్యక్రమాలు జరగాలి.."

కుబేరవర్మ ప్రశ్నార్థకంగా చూశాడు.

నంది తన తండ్రి సమీపంలో నిలుచున్న చిన్ననాటి మిత్రుడు మానితుడిని దగ్గరగా రమ్మని సైగ చేశాడు. మానితుడు వచ్చి, రాజదంపతులకు వినయంగా నమస్కరించాడు.

"ఇతను నా ప్రాణ మిత్రుడు మానితుడు. నా చెల్లెలు దీపాంకుర వివాహం మానితుడితో జరిపించాలి..." నంది అన్నాడు.

"అలాగే జరిపించు నాయనా! శుభం!" కుబేరవర్మ అన్నాడు.

"దీపాంకురకు అంతఃపురం ఏడువారాల నగలు బహూకరిస్తుంది!" మహారాణి మహిమాదేవి అంది.

లాలస కొంచెం దూరంలో నిలుచుని సిగ్గు ఒలకబోస్తున్న దీపాంకురను దగ్గరకు తీసుకుంది.

"నందీ, నీ రెండో కార్యక్రమం ఏమిటి?" మహారాజు అడిగాడు.

"పట్టాభిషేకానికి ముందు కొన్నేళ్ళపాటు నేను మీ అడుగుజాడలలో నడుస్తూ పరిపాలనా శిల్పాన్ని అభ్యసించాలి" నంది వినయంగా అన్నాడు.

"అల్లుడుగారిది సముచితమైన నిర్ణయం. సామ్రాజ్య సంక్షేమానికి అది అవసరం!" సులోచనాచార్యుడు అన్నాడు.

"నందికి పరిపాలనలో శిక్షణ అవసరం ప్రభూ!" రుద్రాక్షుడు అన్నాడు.

"రుద్రాక్షా, సర్వసైన్యాధ్యక్షుడిగా నీ సేవలు రాజ్యానికి అవసరం. ఆ పదవిలో కొనసాగు!" కుబేరవర్మ అన్నాడు. "ఏదైనా అభ్యంతరం ఉందా?"

"తమ అనుమానం అర్థమైంది ప్రభూ. నేను చతురంగ బలాలకు అధ్యక్షుడిని. కాబోయే రాజు నందికి వ్యక్తిగత సేవకుణ్ణి కాదుగా!" రుద్రాక్షుడు నవ్వుతూ అన్నాడు.

"మా అల్లుడి పేరు మార్చివేస్తున్నాం" కుబేరవర్మ అన్నాడు. "నంది నంది కాదు; మహానంది!" అందరూ ఆశ్చర్యంగా చూశారు.

"అల్లుడిగారి శక్తిసామర్థ్యాలకూ, ధైర్యసాహసాలకూ, మేధాసంపత్తికీ, తగిన నామధేయం! సౌభాగ్యవతి యువరాణిని రక్షించడంలో ధైర్యసాహసాలూ, ఇక్కడ సాగరుడి కుట్రను ఛేదించడంలో అపారమైన తెలివితేటలూ చూపించారు!" సులోచనాచార్యుడు ఉత్సాహంగా అన్నాడు.

"ఔను. నా భర్త పేరు అనడానికీ, వినడానికీ కూడా అద్భుతంగా ఉంది; మహానంది!" లాలస నవ్వుతూ అంది.

అందరూ కరతాళ ధ్వనులు చేశారు.

(అయిపోయింది)




## చివరి చిరునవ్వు

*నిండు యవ్వనంలో ఉండగా చూశాను వాణ్ణి!*
*మా జీవితాల్లోకి పేజరొచ్చింది! అయినా సందేశాల్లేవ్!*
*మొబైల్ ఫోనొచ్చింది! అయినా మాటల్లేవ్!*
*ఫేస్‌బుక్కొచ్చింది! వాడి ఫేసు కనబడదు!*
*ట్విట్టరొచ్చింది! వాడు తప్ప ప్రపంచమంతా ఏం*
*చేస్తుందో చెప్తాడు!*
*ఇన్స్టాగ్రామొచ్చింది! పిల్లల ఫొటోలు పెడతాడు గానీ*
*వాడి ఫొటో పెట్టడు!*
*సామాజిక మాధ్యమాల పైనా గోడలు*
*మాకు తెలియకుండానే.*
*మా ముందు మొలవక ముందు*
*గలగలా గోదారిలా మాట్లాడుకునేవాళ్ళం!*
*గడ్డకట్టిన గంగలా అయిపోయాం!*
*షష్టి పూర్తికనుకుంటా తళుక్కున వాళ్ళ*
*ఆవిడతో మెరిశాడు ఫేస్‌బుక్కులో!*
*తల ముగ్గుబుట్టయింది! బాగా చిక్కిపోయాడు!*
*షుగరేమో!*
*కృతయుగంలో కొసరి కొసరి నాతో పాటలు*
*పాడించుకున్న*
*వాడి శ్రీమతి మాత్రం తల నెరిసిన అలమేలు*
*మంగలా ఉంది!*
*దిష్టి తగులుతుందని వాడి కూతురు రాత్రికి రాత్రే*
*తీసేసింది!*
*ఆన్‌లైన్ పలకరింపులు, లైకులతోనే*
*బతుకుచివరి మజిలీకి చేరుకున్నాము!*
*సాంకేతిక సరదాలు తీర్చుకుంటూ*
*వయసుతో పాటు మారిన మాటల పాటల గొంతులు*
*వినకుండానే*
*ఫేస్‌బుక్కులో వాడు ఫేడ్ అయిపోయాడు!*
*****
*మా నాన్నతో అందరినీ అన్‌ఫ్రెండ్ చేసేస్తున్నాను!*
*డొల్ల లైకులే తప్ప పలకరింతలు మాయం చేసిన ఈ*
*దిక్కుమాలిన ఫేస్‌బుక్కులోంచి!*
*మా నాన్న స్నేహితులెవ్వరూ నాకు తెలీదు!*
*నేను చెప్పానా వీడు లైక్ కొడతాడని పసి పిల్లాడిలా*
*కేరింతలు కొట్టేవాడు!*
*తెలిసినవాడికి, తెలీనివాడికి లైకులు కొడుతూ తెగ*
*సంబరపడిపోయేవాడు!*
*అదేమంటే వాణ్ణికొంచెం ఎంకరేజ్ చెయ్యాలిగా*
*అనేవాడు!*
*మీరంతా లైకులు కొడితే మానాన్న*
*సంబరపడిపోయేవాడు!*
*మీకు మా నాన్న పోస్టులకు లైక్ కొట్టే శ్రమ తప్పింది!*
*నిన్న రాత్రి తల కింద దీపం పెట్టేశాం!*



*ఈ రోజు పొద్దున సంచార భగవద్గీత వింటూ*
*ఊరేగింపుతో మా నాన్న వెళ్ళిపోయాడు!*
*పిడుక్కి, బియ్యానికి ఒకటే మంత్రంలా*
*చావుకి, బతుక్కి కూడా మీరు కొట్టగలిగేది లైకేగా!*
*ఒఖ్ఖ లైక్ కొట్టండి!*
*మా నాన్న తిరిగిరాని నిద్రలో ఉండగా తీసుకున్న*
*చివరి సెల్ఫీ ఇది!*
*'నీ సెల్ఫీ పాడుగాను' అని ఇప్పుడు తలమీద*
*మొట్టలేడుగా!*
*చివరి చిరునవ్వుతో చిట్టచివరి చిన్న జ్ఞాపకమిది!*
*లైక్ కొట్టరూ!*

**—చల్లా రామఫణి**
**సెల్: 92474 31892**



# జీవితమే ఒక ప్రతిఘటన

## (కోట శ్రీనివాసరావు కథాకథనం) 28

**కొత్త ఆర్టిస్టు నిలదొక్కుకోవాలంటే ఎస్టాబ్లిష్‌డ్ ఆర్టిస్టు సహకరించాలి. మా అబ్బాయిని ప్రోత్సహించి ధైర్యం చెప్పే బాధ్యత జె.డి.చక్రవర్తి, జగపతిబాబు తీసుకున్నారు.. ఒకరోజు షూటింగ్ స్పాట్‌కెళ్లాక చూస్తే ఒక సీన్‌కి అరేంజ్‌మెంట్స్ చేస్తున్నారు. అవన్నీ చూసి నా మనసు ఇబ్బందిపడసాగింది. అప్పుడు నా మానసిక పరిస్థితి బాబుకి చెప్పా. అలాగే చేద్దాం అన్నారు.**

# వాడిని అలా చూడలేనయ్యా... అన్నా!

ఉదయం లొకేషన్‌కి వెళ్ళగానే వాతావరణం చాలా సీరియస్‌గా ఉంది. ఆ రోజు మా అబ్బాయిని జగపతిబాబు చంపేసే సీన్ చిత్రీకరిస్తారని తెలిసింది. మా అబ్బాయి ఆంజనేయప్రసాద్ 'గాయం-2' చిత్రంలో నా కొడుకు వేషం వేశాడు. జగపతిబాబు మా అబ్బాయిని చంపి నా ఇంటిముందు తెచ్చి పడేసే సీన్ కోసం లొకేషన్‌లో పాడె కూడా సిద్ధం చేస్తున్నారు. నాకేమో ఆ వాతావరణం చూసి చాలా ఇబ్బందిగా అనిపించింది. ఎంతైనా కన్న కొడుకు కదా... చేసేది సినిమానే అయినా, నటనే అయినా నేను వాడిని పాడె మీద శవంలాగా... అసలు ఆ దృశ్యాన్నే జీర్ణించుకోలేకపోయా. 'ఏం చేయాలా?' అని కాస్త అటూ ఇటూ ఆలోచించి బాబు దగ్గరికెళ్ళి 'ఒక మాట చెప్పాలండీ..' అన్నా.

'చెప్పండి సార్.. మీ వాడు చాలా బాగా చేస్తున్నాడు. తిరుగులేదు. సినిమా పరిశ్రమకి చాలా మంచి విలన్ దొరికాడు. మీవాడు బోర్న్ ఆర్టిస్ట్ అండీ. మీ పేరు నిలబెడతాడు...' అని ఆయన చెబుతున్నారు.

'అది కాదండీ. మీరేమీ అనుకోకపోతే ఒక మాటండీ..' అన్నా.

చెప్పండి అన్నట్టు చూశారు.

### ఏ ముహూర్తాన అన్నానోగానీ వారం తిరిగేసరికల్లా....

'మా వాడిని నేను అలా పాడె మీద చూడలేనయ్యా. తలచుకుంటేనే కాస్త వణుకు వస్తున్నట్టుంది. నాకు మనస్కరించడం లేదు. వాడు అలా పడి ఉంటాడనుకుంటేనే నాకు ఏదోలా ఉంది. కాస్త అవాయిడ్ చేయండి. వాడిని అలా చూస్తే నేను యాక్షన్ చేయలేనండీ' అన్నా.

జగపతిబాబు ఏమనుకున్నారో ఏమో ఒక్క క్షణం ఆలోచించి 'మరేం ఫర్లేదు కోటగారు.. మీరు నింపాదిగా ఉండండి. ఆ సీన్‌లో అక్కడ మీ అబ్బాయి ఉండడు. డూప్‌ని పెడదాం. మీ ఫీలింగ్ నాకు అర్థమైంది' అన్నారు. ఆ సీన్‌లో వాడిని అలా చూడలేనని ఆ రోజు ఏ ముహూర్తాన అన్నానో గానీ, వారం తిరిగేసరికి నా బిడ్డని అలాగే చూడాల్సి వచ్చింది. ఆ సీన్ చేసిన వారానికి మావాడికి యాక్సిడెంట్ జరిగింది. ముందు వాడు బైక్ మీద వెళ్తుంటే, వెనుక కోడలు, మనవళ్లు కారులో వెళ్తున్నారు. అంతలోనే యాక్సిడెంట్ జరగడం, మా వాడు మమ్మల్ని వదిలిపెట్టి వెళ్ళడం... కడుపుకోత ఎవరికి అర్థమవుతుంది? నా భార్యని సముదాయించలేకపోయా. కళ్ళముందే కట్టుకున్నవాడిని పోగొట్టుకున్న మా కోడలుపిల్ల పరిస్థితిని మాటల్లో ఎలా చెప్పాలి? అన్నీ దిగమింగి పైకి ధైర్యంగా ఉంది. ఇప్పుడు నాకు కూతుర్లు ఇద్దరు కాదు. మా కోడలితో కలిపి ముగ్గురు. అసలు మా వాడు పోయాడని నేను ఇప్పటికీ నమ్మలేకపోతున్నా. చిన్నప్పటి నుంచే నా కాళ్లీట్లు చూసేవాడు. ఇదిగో మేం ఉంటున్న ఇంటిని దగ్గరుండి ప్లాన్ చేసి, ఇష్టపడి తనే కట్టించాడు. ఈ ఇంటి ప్రతి ఇటుకలో మా వాడి చెమట చుక్క ఉంది. ప్రతి ఇంచిమీద వాడి పేరుంది. వాడిని తలచుకుంటే నిద్రపట్టదు. తిండి తినాలనిపించదు. భగవంతుడు నా పట్ల అంత నిరాదరణ ఎందుకు చూపించాడో అర్థం కాదు. సర్లెండి.. మా వాడి సంగతి పక్కనపెడదాం.

### అదే జగపతిబాబు సిద్ధాంతం

జగపతిబాబు గురించి మరొక్కమాట చెప్పాలండీ.. అతనిలో నాకు బాగా నచ్చింది ఏమంటే 'లివ్ అండ్ లెట్ లివ్' తాను బతుకుతూ, పది మందిని బతికించాలనే సిద్ధాంతం ఉన్న నటుడు అతను. సెట్‌లో ఎవరైనా నిజంగా బాగా చేశారనే అనుకుందాం. అలాంటివారి గురించి 'ఫలానా వాడు చాలా బాగా చేస్తాడండీ' అని ధైర్యంగా నలుగురితోనూ చెప్పే గుణం అతనికి ఉంది. చాలా మంది అలా చెప్పరు. కాస్త పేరున్నవారు, హీరోలు అవతలివారి ప్రతిభను గుర్తించినప్పుడు చాలా ఉపయోగం ఉంటుందండీ. 'హీరోగారే చెప్పారంటే అతనిలో ఏదో ఉండే ఉంటుంది' అనే ఆలోచనతో అవకాశాలు ఇవ్వడానికి దర్శకనిర్మాతలు ముందుకు వస్తారు. అలా నాలుగు అవకాశాలు వస్తే ఆ సదరు వ్యక్తి జీవితం నిలబడుతుందనేది నా ఉద్దేశం.

### నాతో పాట పాడించిన నటుడు, దర్శకుడు హరీశ్

అలా ప్రతిభావంతుల్ని ప్రోత్సహించేవారిలో





# మనసున్న దర్శకుడు!



**వ్య**క్తిగా నేను ఇష్టపడే దర్శకుడు వి.వి.వినాయక్. అసిస్టెంట్ డైరెక్టర్‌గా, కో డైరెక్టర్‌గా ఉన్నప్పటి నుంచే నాకు బాగా తెలుసు. ఎలాగైనా డైరెక్టర్ కావాలనే లక్ష్యంతో పనిచేసేవాడు. ఎప్పుడూ పని మీదే ధ్యాస. షూటింగ్ పూర్తవగానే డైరెక్షన్ డిపార్ట్‌మెంట్ కుర్రాళ్ళు చాలా వరకు సాయంత్రం రిలాక్స్ కావాలనుకుంటారు. కానీ వినాయక్ అలా అనుకునే వాడు కాదు. షూటింగ్ పూర్తయిన తర్వాత కూడా డైరెక్టర్‌గారితో కూర్చుని డిస్కస్ చేసేవాడు. సబ్జెక్ట్ మీద గ్రిప్ తెచ్చుకోవాలనే కుతూహలం కనబరిచేవాడు. అందుకే ఇప్పుడు *24* శాఖల మీద మంచి పట్టున్న దర్శకుడు అనే పేరు తెచ్చుకున్నాడు. అతని కష్టానికి తోడు అదృష్టం కూడా కలిసొచ్చింది. మంచి ఫ్యామిలీ నుంచి వచ్చిన కుర్రాడు కాబట్టి అతనిలో మానవత్వం కనిపిస్తుంది.

అవతలివాడి బాధ, మంచి, చెడు చూసి గౌరవంగా మాట్లాడతాడు. ఎవరికి ఎంత గౌరవం ఇవ్వాలో అతనికి బాగా తెలుసు. ఎవరినీ అనవసరంగా తూలనాడడు. అతని దర్శకత్వంలో రెండు, మూడు సినిమాల్లో మంచి వేషాలు వేశాను. ప్రభాస్ నటించిన 'యోగి'లో నడుం నొప్పి ఉన్న వ్యక్తిగా చాలా మంచి పాత్ర చేశా. నా ఫ్రెండ్స్ అప్పుడప్పుడూ ఆ పాత్ర గుర్తుచేస్తుంటారు.

మరొకరి పేరు తప్పక చెప్పాలి. ఆ వ్యక్తి హరీశ్ శంకర్. ఇప్పుడు ప్రముఖ దర్శకుడు. నాకు హరీశ్ చిన్నతనం నుంచే తెలుసు. అతను మంచి రచయిత, దర్శకుడు అని లోకానికి తెలుసు. కానీ నాకు మాత్రమే తెలిసిన విషయం అతనిలో చక్కటి నటుడున్నాడని. బి.హెచ్.ఈ.ఎల్‌లో అతని నాటకాలు నేను చూశాను. విషయం ఉన్న కుర్రాడని, పైకి వస్తాడని అప్పుడే అనిపించింది. నాకు కొడుకులాంటి వాడు. 'గబ్బర్‌సింగ్'లో అతను నాతో ఒక పెద్ద ప్రయోగాన్నే చేయించాడు. నటుడిగా కోట శ్రీనివాసరావు డైలాగు చెబితే ఎలా ఉంటుందో తెలుగువాళ్లందరికీ ఎరుకే. కానీ నాతో పాట పాడించి నా గొంతును ఫుల్ ఫ్లెడ్జ్‌గా తెలుగువాళ్ళకి పరిచయం చేశాడు.

'మందుబాబులం మేము మందుబాబులం, మందుకొడితే మాకు మేమే మహారాజులం...' అనే ఆ పాటను ఎలా పాడానో తలచుకుంటే నాకిప్పటికీ నవ్వు ఆగదు. నా చేత ఆ పాట పాడించిన ఘనత హరీశ్‌కి దేవిశ్రీప్రసాద్‌కి దక్కుతుంది.

ఒకరోజు ఏదో షూటింగ్‌కి వెళ్తున్నా.

'సార్... హరీశ్ శంకర్‌గారు లైన్‌లో ఉన్నారు' అని మా అసిస్టెంట్ రాజు ఫోన్ ఇచ్చాడు.

'హలో.. ఏంటబ్బాయ్' అన్నా.

'ఏం లేదు బాబాయ్... మీకు ఇవాళ ఏమైనా షూటింగ్ ఉందా?' అడిగాడు.

'ఏం పనీ..?' అన్నా.

'ఏం లేదు. ఒక గంట మీతో పని ఉంది. ఒక వేళ ఎవరిదైనా షూటింగ్ ఉన్నా ఒక గంట పర్మిషన్ పెట్టి రాగలవా ప్లీజ్' అన్నాడు. 'సర్లే వస్తాను' అన్నా.

అతను అలా పిలవగానే నేనేమనుకున్నానంటే... 'డబ్బింగ్ డైలాగుల్లో ఏమైనా మార్పులు వచ్చాయేమో, కొత్తగా ఏమైనా రాసుకున్నారేమో, సెన్సార్ కట్‌లు ఏమైనా పడ్డాయేమో.. వెళ్ళి సింక్ అయ్యేలాగా చెప్పిరావాలేమో' అని. అదే ఉద్దేశంతో హైదరాబాద్‌లో ఉన్న ప్రసాద్‌ల్యాబ్‌కి వెళ్ళా. నా కారు నేరుగా డబ్బింగ్ స్టూడియో దగ్గరకు వెళ్ళబోతోంటే 'అక్కడికి కాదు, ఇక్కడిక్కడే' అని హరీశ్ శంకర్ మధ్యలో రికార్డింగ్ స్టూడియో దగ్గర ఆపాడు. 'ఇక్కడ ఆపుతున్నాడేంటి? అందరూ ఇక్కడున్నారేమోలే' అనుకుంటూ దిగా. లోపలికి తీసుకెళ్ళాడు. రికార్డింగ్ రూమ్ తలుపు తీస్తే అక్కడ దేవిశ్రీ ప్రసాద్ ఉన్నారు.

'రండి కోటగారూ.. ఎలా ఉన్నారు' అని ఆత్మీయంగా పలకరించారు దేవి.

కుశల ప్రశ్నలు అయ్యాక నన్ను కూర్చోపెట్టి మందుబాబులం పాట ప్లే చేసి 'ఎలా ఉంది కోటగారు' అని అడిగారు.

'బావుందండీ. మీరే పాడినట్టున్నారు. నేను యాక్ట్ చేశాను. ఆ వేళ సెట్‌లో విన్నాను. చాలా మంచి ట్యూన్. క్యాచీగా ఉంది. జనాల్లోకి వెళ్తుంది' అని చెప్పా.

ఆ కుర్రాడు అంతా విని 'నిజమేనండీ. అందుకే ఇప్పుడు మీరు పాడబోతున్నారు ఈ పాటని' అన్నారు.

ఏదో జోక్ చేస్తున్నారు...తమాషాకి అంటున్నారని అనుకున్నా. వాళ్ళు నాతో పాట పాడించాలని ఫిక్సయ్యారనే విషయం నాకు అర్థం కాలేదు. 'నేను పాట్టం ఏంటి?' అన్నా.

'కాదు కాదండీ... నేను పాడితే మంచి సింగర్ పాడినట్టు ఉంది. మీరేమో... కాస్త రఫ్ వాయిస్‌తో పాడగలరు. చాలా నేచురల్‌గా సెట్ అవుతుంది. తాగుబోతు పాడినట్టు అనిపిస్తుంది. నేను, హరీశ్ ఆ విషయాన్నే డిస్కస్ చేసుకుని మిమ్మల్ని పిలిపించాం' అన్నారు దేవి.

'దేవి పాడితే మీ ఏజ్‌కి సరిపోయినట్టు, పెద్ద వాళ్ళు పాడినట్టుగా రావడం లేదు. నా మాట విని పాడండి బాబాయ్ మీరు' అని హరీశ్ కూడా అన్నాడు.

'బావుండదండీ నేను పాడితే' అని సర్దిచెప్పబోయా. కానీ వాళ్ళిద్దరూ ఒప్పుకుంటేనా?..

'లేదు లేదండీ.. మీకు తాళజ్ఞానం ఉంది. మీరు పాడగలరు' అని ఇద్దరూ కలిసి చెప్పారు. దేవి నన్ను ఇంకో రూమ్‌లోకి తీసుకెళ్ళి హెడ్‌ఫోన్స్ పెట్టారు. నా పక్కన నిలబడి ఒక్కోలైనూ పాడసాగారు. ఆయన పాడటం దాన్ని అందుకుని నేను పాడటం, ఆయన పాడటం, నేను పాడటం.... ఇదే వరస. ఎలా జరిగిందో, ఎప్పుడు రికార్డింగ్ అయిందో నాకు తెలియనేలేదు. రికార్డింగ్ పూర్తయింది అన్నారు. నా చెవిలో హెడ్‌ఫోన్స్ తీస్తూ 'చూడండి బాబాయ్.. ఈ పాట ఎంత ట్రెండ్ క్రియేట్ చేస్తుందో' అన్నారు దేవి. 'ఏం జరుగుతోందో నాకేం అర్థం కాలేదు. 'నేనేంటి? పాడటమేంటి?' అని అంటూ బయటికి వచ్చా. అప్పుడే లోపలికి వస్తూ కీరవాణిగారు కనిపించారు. 'ఏంటి కోటగారు.. రికార్డింగ్ స్టూడియోకి వచ్చారు' అని పలకరించారు. 'ఇలా జరిగిందండీ... నేను పాడటమేంటి?' అని ఆయనకు అంతా చెప్పా. 'ఓహ్.. మీరు పాడితే బానే ఉంటుందండీ. అందులోనూ మందు పాట అంటున్నారు. దేవిశ్రీప్రసాద్ ఏదీ ఊరికే చేయడు. చేశాడంటే విషయం ఉండే ఉంటుంది. రండి చూద్దాం' అని నాతో పాటు ఆయన కూడా లోపలికి నడిచారు.



**(ఇంకా ఉంది)**


**–డా.చల్లా భాగ్యలక్ష్మి**

**సెల్: 88850 55528**




# బాల్కనీ

**కరెంట్ పోయింది.**

**అంతా చీకటి దుప్పటి కప్పినట్టయింది.**

**చీకట్లో నిశ్శబ్దంగా ఓ కారు అపార్ట్‌మెంట్‌కి కాస్త దూరంలో ఆగింది.**

**కారులోంచి ఓ వ్యక్తి నిశ్శబ్దంగా దిగాడు. ఎటూ చూడలేదు. పరుగులాంటి నడకతో అపార్ట్‌మెంట్ ద్వారం దగ్గరకు చేరుకున్నాడు.**

వాచ్‌మన్ లోపల ఎక్కడో ఉన్నట్టున్నాడు.

నిశ్శబ్దంగా మెట్లెక్కాడు. బాల్కనీ చేరాడు.

బాల్కనీపైన శవం అలాగే పడి ఉంది. దానివైపు చూడాలంటేనే భయం వేసింది. 'అయినా తప్పదు' అనుకున్నాడు.

తాను తెచ్చిన దుప్పటి పరిచాడు. కళ్ళు మూసుకుని శవాన్ని దుప్పటి మీదకు లాగాడు. దుప్పటితో శవాన్ని చుట్టచుట్టాడు.

ఆ మూట ఎత్తలేకపోయాడు. చాలా బరువుగా ఉంది.

ఈడ్చుకుంటూ ముందుకు సాగాడు. మెట్ల మీద నుంచి లాగాడు.

'శవం కదా. నొప్పి తెలియదు' అనుకున్నాడు.

యాంత్రికంగా లాగుతున్నాడు కానీ అతని శరీరమంతా వణుకుతోంది. కాళ్ల శక్తిలేనట్టు నిలవలేకపోతున్నాయి. 'కానీ తప్పదు'. శక్తి కూడదీసుకుని లిఫ్టులోకి లాక్కెళ్ళాడు. గ్రౌండ్ ఫ్లోర్ బటన్ నొక్కాడు. లిఫ్టులో కదలికలేదు. మళ్లీ తిట్టుకున్నాడు. 'కరెంటు లేకపోతే లిఫ్టు కదలదు. ఇప్పుడీ శవాన్ని మెట్ల మీద నుంచి తీసుకువెళ్లాలి. కరెంటు వచ్చేదాకా ఎదురు చూడలేడు'.

మళ్లీ శక్తినంతా కూడదీసుకుని శవాన్ని లాగటం ఆరంభించాడు. మెట్ల దగ్గరకు తీసుకెళ్ళాడు.

ఇంతలో ఎదురుగా ఉన్న తలుపు తెరచుకుంది. 'అబ్బ దోమలు చంపేస్తున్నాయి. వెధవ కరెంటు' అంటూ బయటకు వచ్చిన ఆయన చీకట్లో నల్లగా ఆకారాన్ని చూసి బెదిరాడు. 'ఏయ్ ఎవరు నువ్వు?' భయంతో అరిచాడు. దానికే బెదిరాడా వ్యక్తి. తాను లాగుతున్న మూటను అక్కడే వదిలి పరుగుకు సిద్ధమయ్యాడు. దాంతో అతడికి ధైర్యం వచ్చింది. 'ఏయ్ ఆగు' అని అరిచాడు. అతడి అరుపులకు పక్కింటి వాళ్ళు బయటకు వచ్చారు.

ఆ వ్యక్తి వెంటనే పరుగు లంకించుకున్నాడు.

'ఏమిటది?' అని మూటపై నున్న దుప్పటిని తొలగించాడాయన. ఇంతలో టప్‌మని కరెంటు వచ్చింది.

ప్రాణంలేని కళ్ళు, తెరచి ఉన్న నోరు అతడి వైపు నిర్భావంగా చూశాయి. పెద్దగా కేక పెట్టాడాయన.

***

'జరిగింది చెప్పండి' మరోసారి ఆయనతో చెప్పించాడు డిటెక్టివ్ శరత్.

'పారిపోయిన వ్యక్తిని మీరు సరిగ్గా చూడలేదు కదా?' అడిగాడు. తల అడ్డంగా ఊపాడు ఆయన. 'చీకట్లో కనబడలేదు. అంతా చాలా వేగంగా జరిగింది. కానీ అంత వయసున్న వ్యక్తిలా అనిపించలేదు. కుర్రాడిలా అనిపించాడు'.

'మీరు ఆ కుర్రవాణ్ణిగానీ, శవంగా మారిన ఆ మనిషిని కానీ అంతకుముందు ఎప్పుడూ చూడలేదా?'

'లేదు. కానీ వాచ్‌మన్ ఉన్నాగానీ ఇలాంటివి జరగటం ఆశ్చర్యంగా ఉంది. కోపంగానూ ఉంది?'

ఆయన చెప్తుండగానే వాచ్‌మన్ వచ్చి తలవంచుకుని నిలబడ్డాడు.

'మరణించిన వ్యక్తిని ఎప్పుడూ చూడలేదా నువ్వు?' అడిగాడు శరత్.

'అంతా చీకటిగా ఉంది కదా సార్. కరెంటు లేదు'.

నవ్వాడు శరత్. 'నీకు తెలిసి ఉండాలి. ఎందుకంటే అక్కడ మూడు గ్లాసులు ఉన్నాయి. వాళ్లిద్దరితో పాటు నువ్వూ తాగి ఉండాలి. గ్లాసులపైన వేలిముద్రల వివరాలు వస్తే నిజం బయటపడుతుంది. అంతవరకు ఆగకుండా నిజం చెప్పెయ్. లేకపోతే నేరస్తులను దాచిన నేరం నీ మీదకు వస్తుంది' బెదిరించాడు శరత్. అతడు భయంగా శరత్‌వైపు చూశాడు. 'సార్. నాకు నేరం జరిగినట్టు తెలియదు సార్. చనిపోయినతని పేరు రంగ. అతను నాకు చాలా కాలంగా ఫ్రెండ్. అతడు పక్కన అపార్ట్‌మెంట్‌లో కొన్ని రోజులు వాచ్‌మన్‌గా పనిచేశాడు. తరువాత వేరే ఉద్యోగం వచ్చిందని వెళ్ళిపోయాడు'.

'ఏం ఉద్యోగం?'

'డ్రైవర్ ఉద్యోగం'.

'ఎవరి దగ్గర?'

చెప్పాడు వాచ్‌మన్.

'మీ అపార్ట్‌మెంట్‌లో సిసి టీవీలున్నాయి కదా, వాటి రికార్డింగ్స్ కావాలి' అడిగాడు శరత్.

**బాల్కనీలో పడి ఉన్న శవాన్ని జాగ్రత్తగా మూటకట్టాడతను. కానీ పైకెత్తలేకపోయాడు. ఎలాగో హైరానాపడి లిఫ్టులోకి చేర్చాడు. కానీ కరెంటు లేదు. మళ్ళీ ఈసురోమంటూ మూటను మెట్ల మీదనుండి ఈడ్చుకెళ్ళాడు. అంతలో ఫ్లాట్‌లో ఒకాయన తలుపులు తీసుకుని బైటకువచ్చి చీకట్లో ఆకారాన్ని చూసి ఎవరు ? ఎవరదీ ? అని గట్టిగా అరిచాడు. మూట వదిలేసి పరుగెత్తాడతను. అసలు అక్కడేం జరిగింది?**

'ఇస్తాం. కానీ నిన్న సాయంత్రం నుంచి కరెంటు లేదు'.

'అయినా ఇవ్వండి' అడిగాడు శరత్.

***

'నా ఇల్లు అపార్ట్‌మెంట్ ఎదురిల్లేనండి. రాత్రి కరెంటు లేక నిద్ర పట్టలేదు. బాల్కనీలో వాకింగ్ చేస్తున్నాను. కారు రావటం చూశాను. దాంట్లోంచి అబ్బాయి దిగాడు. కానీ కరెంటు వచ్చేసరికి పరుగెత్తుకు వచ్చి కారెక్కాడు. కారు వెళ్ళిపోయింది. ఆ వైపు' చూపించాడాయన.

'మీరు పరుగెత్తుకు వచ్చిన అబ్బాయిని చూశారా?'

'సరిగ్గా కనబడలేదు. కానీ అబ్బాయి పూల షర్టు వేసుకున్నాడు. ఇరవై లోపు ఉంటుంది వయసు'.

'కారు నెంబరు నోట్ చేసుకోలేదు కదా?'

'లేదు. సార్, ఆ ఆలోచన రాలేదు'.

'థాంక్యూ.' అన్నాడు శరత్ లేస్తూ.

***

'బాస్.. వాచ్‌మన్ ఇచ్చిన వివరాల ప్రకారం రంగ డ్రైవింగ్ లైసెన్స్ వివరాలు సేకరించాను. అతని ఇంటికి వెళ్ళాను. ఒంటరిగా ఉంటున్నాడు. ఇంకా పెళ్ళి కాలేదు. ఇంటి చుట్టుపక్కల వాళ్ళు చాలా నెమ్మదస్థుడని చెప్పారు. అతడు డ్రైవర్‌గా పని చేస్తున్నది శివరావు అనే వ్యక్తి ఇంట్లో. శివరావు బ్యాంకు మేనేజర్. ప్రస్తుతం నిజామాబాద్ బ్రాంచిలో పనిచేస్తున్నాడు. వారాంతంలో హైదరాబాద్ వస్తాడు. హత్య జరిగిన రోజు ఆయన ఊళ్లో లేడు'.

'ఊళ్లో లేనప్పుడు కారు ఎవరు వాడతారు?'

'అతని భార్య, పిల్లవాడు'.

'అతని భార్య కూడా బ్యాంకు మేనేజర్. వాళ్ళ అబ్బాయి ఎమ్మే చదువుతున్నాడు. ఇరవై ఏళ్లుంటాయి'.

'పేరు?'

'రవి'

***

'మా వాడు రాత్రి తొమ్మిది గంటలకే నిద్రపోతాడు. రాత్రిళ్లు బయట చిల్లర తిరుగుళ్లు తిరిగే అలవాటు లేదు' కచ్చితంగా చెప్పింది శివరావు భార్య గౌరి.

రవి వైపు చూశాడు శరత్.

తల వంచుకుని కూర్చుని ఉన్నాడు రవి.

'రంగ నాలుగేళ్ళుగా తెలుసు. మా కార్లో నన్ను ఆఫీసు దగ్గర డ్రాప్ చేస్తాడు. రవిని కాలేజీలో వదిలి వెళ్తాడు. మళ్లీ తిరిగి ఇంటికి తీసుకు వస్తాడు రోజూ. సాయంత్రం ఆరుగంటలయ్యేసరికి ఇద్దరం ఇల్లు చేరుకుంటాం. ఏమైనా ఫంక్షన్‌కి వెళ్లాల్సి ఉంటే తప్పించి ఆరు తరువాత రంగాని పంపేస్తాం. ఆ తరువాత అతను ఎటు తిరుగుతాడో, ఏం తాగుతాడో మాకు సంబంధం లేదు.

'రవికీ రంగకూ స్నేహం ఉందా?' అడిగాడు శరత్.

'డ్రైవర్‌తో స్నేహం ఏమిటి?' చిరాకుగా అడిగిందామె.

శరత్ మాట్లాడలేదు. రవివైపు పరీక్షగా చూశాడు. వంచిన తల ఎత్తలేదు రవి.

***

'బాగా తాగించారు. తల మీద బరువైన వస్తువుతో కొట్టారు. వెంటనే మరణం సంభవించింది. శరీరం మీద అక్కడక్కడా కనబడుతున్న దెబ్బలు ప్రాణం పోయిన తరువాత తగిలినవి. బహుశా నేల మీద లాగినప్పుడు గాయాలై ఉంటాయి' చెప్పాడు పోస్ట్‌మార్టమ్ డాక్టర్ పణి.

తల ఊపాడు శరత్.

***

రవి ఫొటో చూసి తల అడ్డంగా తిప్పాడు వాచ్‌మన్. 'ఆ రోజు రంగాతో తాగింది ఈ పిల్లవాడు కాదు' నిశ్చయంగా చెప్పాడు.

'మరి ఆ పిల్లవాడు ఎలా ఉంటాడు?' అడిగాడు శరత్.

'నేను సరిగ్గా చూడలేదు. బాల్కనీలో చీకటిగా ఉంటుంది. కానీ ఈ పిల్లవాడు కాదు' వాచ్‌మన్‌ని పరిశీలనగా చూశాడు శరత్. 'నువ్వు నిజం దాస్తున్నావు. అది నేరం'.

'నిజం సార్. నేను సరిగ్గా చూడలేదు. వాళ్ళిద్దరూ పైకి వచ్చి నాకు ఫోన్ చేశారు. అప్పటికి తొమ్మిది అయింది. నేను పైకి వచ్చాను. వెలుతురు నుంచి చీకట్లోకి వచ్చేసరికి సరిగ్గా కనబడలేదు. ఇంతలో కింద నుంచి ఫోను చేశారు. కిందకి వెళ్ళాను'.



'ఎవరు ఫోన్ చేసింది?'

'మా అపార్ట్‌మెంట్‌ను మెయిన్‌టైన్ చేసే మాధవసార్.'

'అబ్బాయి రవి కాదని ఎలా చెప్పగలవు?'

'అతడు ఈ అబ్బాయిలా లేడు. ఇతని కన్నా పొట్టిగా ఉన్నాడు. తెల్లగా ఉంటాడు'.

నవ్వాడు శరత్. 'నువ్వు రవిని చూడలేదు. రవి కన్నా ఆ అబ్బాయి పొట్టి అని ఎలా చెప్తావు?'

మాటల కోసం తడుముకున్నాడు వాచ్‌మన్.

'నిజం చెప్పు, ఏం జరిగింది? ఆ రోజు మీతో ఉన్నది ఎవరు?'

'నాకు రవిబాబు తెలుసు. రంగాతో రవి కూడా రెండు మూడుసార్లు వచ్చాడు. కానీ, కాస్సేపు అవగానే ఇంటికి వెళ్ళాలి, అమ్మ తిడుతుంది అని గోల చేసేవాడు. అందుకే అతణ్ణి తీసుకురావటం మానేశాడు రంగ. ఆ రోజు ఎవరో కొత్త అబ్బాయి వచ్చాడు'.

'అబద్ధం చెప్పావంటే..' బెదిరించాడు శరత్.

'నిజం చెప్తున్నా సార్. రంగాని బాల్కనీలో తాగనిచ్చినందుకు అపార్ట్‌మెంట్ వాళ్ళంతా నా మీద కోపంగా ఉన్నారు' చెప్పాడు వాచ్‌మన్.

***

అపార్ట్‌మెంట్ నుంచి తెచ్చిన వీడియోలు చూడటం ఆరంభించాడు శరత్. గేటులోంచి లోపలకు వచ్చేవారిని, లిఫ్ట్ ఎక్కేవారి కదలికలన్నింటినీ సిసి కెమెరా రికార్డు చేసింది.

ఒక్కొక్కరినీ పరిశీలనగా చూడటం ఆరంభించాడు శరత్.

వారంరోజుల సిసి టీవీ ఫుటేజ్ అది.

దాన్లో ఆ రోజు కాక రెండుసార్లు అపార్ట్‌మెంట్‌కి వచ్చాడు రంగ. రెండుసార్లూ అతడి వెంట రవి ఉన్నాడు.

వారు వచ్చిన సమయం నోట్ చేసుకున్నాడు శరత్.

హత్య జరిగిన రోజు మాత్రం రంగ ఒక్కడే వచ్చాడు.

కాస్సేపటికి వాచ్‌మన్ పైకి వెళ్ళాడు.

శరత్ భృకుటి ముడిపడింది. ఇద్దరే పైకి వెళ్ళారు. మరి మూడో వ్యక్తి ఎవరు? ఏడి? కాస్సేపటికి వాచ్‌మన్ కిందకి వచ్చాడు. ఇంకాస్సేపటికి కరెంటు పోయింది ఆలోచిస్తూ కుర్చీలో వెనక్కి వాలాడు శరత్.

ఈసారి ఆ రోజు ఉదయం నుంచీ చూడటం ఆరంభించాడు.

కరెంట్ వచ్చేసరికి శవాన్ని వదిలి పరిగెత్తుతున్నాడా వ్యక్తి. కానీ అపార్ట్‌మెంట్ గేటు నుంచి ఎవ్వరూ బయటకు పరుగెత్తినట్టు లేదు.

ఆలోచిస్తూ వీడియో చూస్తున్న శరత్ కళ్ళు పెద్దవయ్యాయి. మళ్ళీ మళ్ళీ రివైండ్ చేసి చూశాడు.

***

'మళ్ళీ వచ్చారేం?' ప్రశ్నించింది గౌరి.

'మిమ్మల్ని కొన్ని ప్రశ్నలు అడుగుదామని' సమాధానం ఇచ్చాడు శరత్.

'త్వరగా అడగండి. నేను, రవి బెంగళూరు వెళ్తున్నాం. వాడిని కొన్ని రోజులు అక్క దగ్గర ఉంచాలని అనుకుంటున్నాను'.

'ఎందుకని? హత్యా నేరం నుంచి తప్పించాలనా?' అడిగాడు శరత్.

'వాట్ నాన్సెన్స్' వాడికి దానితో సంబంధం లేదని చెప్పాను కదా?'

'మీ అబ్బాయికి రంగాతో సన్నిహిత స్నేహం ఉన్నట్టుంది. గత వారంలో రెండుసార్లు రంగాతో అపార్ట్‌మెంట్‌కి తాగటానికి వెళ్ళాడు. ఆ రోజు కూడా మధ్యాహ్నమే రవి అపార్ట్‌మెంట్‌లోకి వెళ్ళాడు. బహుశా మధ్యాహ్నం నుంచీ బాల్కనీలో రంగాకోసం ఎదురు చూస్తున్నాడేమో. రంగాని చంపి మీకు చెప్పి ఉంటాడు. నేరం రవి మీదకు రాకుండా ఉండేందుకు మీరు శవాన్ని వేరే చోట పారేయాలనుకున్నారు. రాత్రి కారులో వచ్చారు. మీరు డ్రైవ్ చేస్తున్నారు. రవి పైకి వెళ్ళి శవాన్ని బయటకు తీసుకురావాలని ప్రయత్నించాడు. కానీ మీ పథకం దెబ్బతిన్నది. బండారం బయట పడింది'.

ఆమె నిర్భావంగా చూసింది శరత్ వైపు. 'మీరు పొరపడుతున్నారు. రవి అమాయకుడు' అంది.

శరత్ ఫోన్ తీశాడు. 'ఇన్‌స్పెక్టర్ విజయ్. రంగ హత్య కేసులో హంతకుడెవరో తెలిసి చెప్పనందుకు రవిని, హత్య చేసిన నేరానికి గౌరిని అరెస్టు చేయాలి' చెప్పాడు.

ఫోన్ పెట్టి కత్తి గాటుకు నెత్తురు చుక్కలేనట్టు పాలిపోయిన గౌరితో అన్నాడు.

'రవి దుస్తులు మీకు బాగా సరిపోయాయి. అందరూ మిమ్మల్ని యువకుడు అని పొరపడ్డారు. కానీ మీరు రంగ రావడానికి ముందే అపార్ట్‌మెంట్ చేరుకుని అతడి కోసం ఎదురు చూశారు. మీ నడక మిమ్మల్ని పట్టించింది. నడక చూడకపోతే నేనూ యువకుడనే అనుకునేవాణ్ణి'. కూలబడింది గౌరి. 'రవి తప్పుదారి పడుతున్నాడని తెలిసింది. దానికి కారణం రంగ అనీ తెలిసింది. బెదిరించేందుకే వెళ్ళాను. కానీ వాడు పిచ్చిగా మాట్లాడాడు. కోపం పట్టలేక ఇటుకతో కొట్టాను. పడిపోయాడు. కానీ భయం వేసింది. వాచ్‌మన్‌కి ఫోన్ చేస్తే వెళ్ళి చూసి వచ్చి చచ్చిపోయాడని చెప్పాడు. ఎవరికీ చెప్పొద్దనీ, డబ్బులిస్తాననీ చెప్పాను. రాత్రి వాచ్‌మన్ కరెంట్ తీయగానే పైకి వెళ్ళాను. కానీ పని పూర్తయ్యేలోగా ఎవరో కరెంటు పోవటానికి కారణం కనుక్కున్నారు. 'నేను ఒక్కదాన్నే శవాన్ని లాగి కిందకు తీసుకురాలేకపోయాను' చెప్పింది గౌరి.

*—కస్తూరి మురళీకృష్ణ*

*సెల్: 98496 17392*




# బాల లీల... లీలా బాల!

**అవసరం ప్రయాణ సుఖమెరుగదు అంటుంది. యూ బై ఆర్ కంపార్ట్‌మెంట్. లారీలో తీసి కెళ్తున్న కోళ్ల కుప్పలా ఉన్నారు జనం ఆ డబ్బాలో. ఆ డబ్బా ఆ డబ్బా కాబట్టి! ఏ ప్రయాణం ఎవరి ప్రాణం మీదకొస్తుందో ఎవరికి తెలుసు!**

**"రైలు కదిలింది.. అమ్మో... రైలు కదిలింది!" ఆమె ఆందోళన కేకపెట్టింది. మొగుడి జవాబు వినిపించలేదు!**

"పేరుతో పిలువు తల్లీ" అన్నాడో పెద్దమనిషి.

"నేనెప్పుడూ ఆయన్ను పేరుతో పిలవనండీ" అందావిడ కేక ఏడుపులోకి దిగుతూ.

"సరే, మీ వారి పేరేంటో చెప్పమ్మా, మేం పిలుస్తాం"

"పక్షితీర్థాల నిటలాక్షరక్షాకరం"

"ఆ పేరు పిలిచే లోపు ఇంకో స్టేషనొస్తుంది. పొట్టి పేరుంటే చెప్పమ్మా".

"పీయన్నార్!" ఏడుపుతోనే చెప్పింది.

"రైల్లో పి.యన్.ఆర్ అంటే పేరెందుకనుకుంటా రండీ" అన్నాడొకాయన.

"నిటలాక్షం అనండి, చాలు" అంది ఆవిడ గద్గద గళం.

"అది కూడా నే పలకలేను. నీ పేరేంటో చెప్పమ్మా"

"బాలలీల"

"బాలలీల మొగుడో" అని మూడుసార్లు కోర్టు పిలుపేశాడు పెద్దమనిషి.

"బండెక్కావా లేదా" అని మూడుసార్లూ పక్కా యన వంత పాడాడు.

ఇంతలో ఆయన ఏదో ఊహ వచ్చినవాడిలా ఎమ ర్జెన్సీ కిటికీలోంచి తొంగిచూశాడు. "తల బయటపడేయ కండీ" అని ఆయన భార్య హెచ్చరిక వినకుండా చూసి చెప్పాడు, "గార్డుడబ్బాకి ఓ మనిషి వేలాడుతున్నాడు, ఆయనేనేమో"

నలుగురు పట్టుకుంటే బాలలీల కూడా చూసి "ఆ చొక్కారంగు ఆయనదే" అంది, కొద్దిగా కుదుటపడి వెనక్కిజారుతూ.

"తీగలాగుదాం" అన్నాడొకాయన.

"పది నిమిషాల్లో పక్కస్టేషనొస్తుంది. లాగడాలూ, ఆగడాలూ, సాగడాలూ ఎందుకండీ. ఇప్పటికే రైలు లేటు నడుస్తున్నది" అన్నాడాయన పక్కాయన.

"ఫరవాలేదులెండి! మా ఆయన చిన్నప్పుడు రైల్లో బఠానీలమ్మే వాడట" అంది బాలలీల.

"ఆ అనుభవం ఉంటే ఈపాటికి ఈ డబ్బాలోకి వచ్చేవాడుగా" అందో గొంతు.

"చాల్లెండి! ఆ వయసు వేరు, ఆ పట్టు వేరు" అన్నాడు పెద్దమనిషి.

***

ఆ తర్వాత, తర్వాత స్టేషన్లో రాజధాని ఎక్స్‌ప్రెస్‌కి తావిస్తూ ఈ రైలుని ఇంకో పది నిమిషాలు ఎక్కువ ఆపారు. ఎవరో చివరి డబ్బా దగ్గరకు వెళ్ళొచ్చి గార్డు ఎవరినీ చూడలేదన్నాడని చెప్పాడు. బాలలీలను ధైర్యం తెచ్చుకోమని ఓదార్చారు కొందరు ఆడవాళ్లు. ఇక తన నిర్ణయం తనదే! పెట్టేబేడాతో అక్కడే దిగింది బాల లీల. ఖాళీగా ఉన్న రైలు పట్టాలను చూపు అందినంత వరకూ చూసింది. చూసింది! పట్టాల చెకింగు వాళ్ల కాళ్లావేళ్లా పడి, సంగతి చెప్పి, ఆ తోపుడు బండిమీద వెనక్కు వెళ్ళింది. ఎన్నో దుష్టాంతాలు మనసు ముందు గంతులు వేశాయి. భర్త ఆచూకీ ఆనవాలు మృగ్యం అయింది. స్టేషన్ కనిపిస్తున్నది. బండి వాళ్లకు దండం పెట్టింది. అనవసరమైన బరువు తగ్గించేసి పదడుగుల్లో స్టేషనే ఇల్లులా చేరుకుంది.

ఆనందంలో విషాదంగా అక్కడిక్కడా భర్త జాడ కనిపించలేదు. ఎందుకు కనిపిస్తాడు నా పిచ్చిగానీ అనుకుంది. మొగుడి జేబులో రెండు నువ్వుజీడీలు తప్పితే ఏం లేవు! టికెట్లూ, డబ్బులూ తన చెంగుముడి లోనే ఉన్నాయి. అదేంటో, నువ్వు జీడీలొదిలిపెట్టలేడు నూజివీడబ్బాయి అన్నది గుర్తొచ్చింది. తనేం వయసు మళ్లిందీ కాదు. రూపం లేందీ కాదు!

**బాలలీల, పక్షితీర్థాల నిటలాక్షరక్షాకరం ఇద్దరూ భార్యాభర్తలు. ఓ సుముహూర్తాన రైల్లో బయలుదేరిందా జంట. రైలెక్కాక జాడలేకుండాపోయాడు నిటలాక్షం. గగ్గోలెత్తింది బాలలీల. ఆమెతోపాటే అంతా ఆందోళన పడ్డారు. నెలలు గడిచిపోయినాగానీ నిటలాక్షం జాడ దొరకలేదు. ఇక దాంతో లాయర్ సమరశంఖం రంగంలోకి దిగాడు. మరి అతనేం చేశాడు? నిటలాక్షం జాడ దొరికిందా? లేదా?**

తమది రెండుగదుల ఇల్లు మహానగరంలో. వెళ్లి తాళం తీస్తుంటే "అదేంటమ్మా ఒక్కదానివే వచ్చావు, పది రోజుల యాత్ర అని చెప్పావుగా" అనడిగే వాళ్లు ముసురుతారు!

ఆ చికాకెందుకని పుట్టింటికి వెళ్ళింది. సంగతి వివ రించింది. వాళ్లకీ పరిస్థితి అర్థం కాలేదు. కారణం బోధపడలేదు.

"ఇదేదో, బుర్ర వెర్రే! ఇంకో మార్గం లేదు. ఆయన మెదడు కదిలి వచ్చిందాకా నువ్వక్కడ ఉండాల్సిందే. నీ తోడ బుట్టిందాని బతుకట్టా అయింది. నీ బతు కిట్టా అయింది! చేతుల్లేనిదాన్ని కాదమ్మా. నాకు నా తమ్ముడు తోడున్నాడు" అని దగ్గరకు తీసుకుంది.

"అమ్మమ్మ వాళ్ళకు నీ మీద కోపం తగ్గిందా" అంది ఆనందంగా బాలలీల.

***

రోజులు గడుస్తున్న కొద్దీ అందరి అభిప్రాయాలూ ఒకటవుతున్నాయి. రోజులు నెలలవుతున్నాయి. ఆ అభిప్రాయం తన బాగుకోరే ఆచరణ కావాల్సిందే! అమ్మ నాన్న, తమ్ముళ్ళు, అక్క బావ. "కాశీకి పోయే వయసులో, కట్టుకున్నవాడు సన్యాసం వదిలొచ్చి సంసారం చేద్దాంరా అన్నాట్ట" అన్నాడు బావ. దాని అర్థం ఏంటంటే వయసులో ఉన్న దానికి సంసార సుఖం త్యాగం చేయడంలో అర్థం లేదని! అందులో నిజం లేకపోలేదని తనకూ అనిపిస్తున్నది. పనిగట్టు కుని పలకరించే మగ బుద్ధులు మాటు వేస్తున్నాయి. మాటలు వేస్తున్నాయి. అన్నిటికీ మించి పుట్టింటికి తను బరువవుతున్నదేమో! తన వేదనంతా తల్లితో చెప్పింది. తల్లి తన తమ్ముడితో మాట్లాడుతూ అంది, తమ్ముడు పేరున్న లాయరు కాబట్టి. ఇదేం చట్టం తట్టుకోలేని సమస్యేం కాదు కాబట్టి! బాలలీలకు అది సమంజసంగానే అనిపించింది.

***

ఒకరోజు బాలలీల మేనమామ లాయరు సమర శంఖం నెల్లూరెళ్లొస్తుంటే రైల్లో బఠానీలమ్ముతూ నిట లాక్షం కనిపించాడు. సమరశంఖాన్ని గుర్తుపట్టే అవ కాశం లేదు. పైగా సమరశంఖానికి తన ముఖాన్ని అప్పుడప్పుడూ అంతుపట్టనిరీతిలో మార్చి చూసుకో వడం హాబీ. ప్రేమ తడబాటుపడ్డ బ్రహ్మాచర్యంలో ఉన్నాడు మహాధనవంతుడై ఉండి కూడా. ఆ బ్రహ్మా చర్యం అనే తపస్సుని బాలలీల భంగం చేస్తుందేమో భయం వేసింది తల్లికి, బాలలీల అవలీలగా ప్రలోభా లలో పడే రకం కాదని తెలిసినా!

సమరశంఖం అదేమార్గంలో అయిదారుసార్లు తిరి గాడు. నిటలాక్షం, బఠానీలే కాదు, రకరకాల వ్యాపా రాలు చేయడంలో దిట్ట అనీ, మాటల కోటేశ్వరుడనీ తెలుసుకున్నాడు. బలాలు, బలహీనతలూ అవగా హన చేసుకున్నాడు. పేపర్లో ప్రకటనకన్నా రైల్లో పోస్ట ర్లంటించడమే సబబుగా అనిపించి, తను ఇవ్వబోయే ప్రకటన తనవాళ్ల ముందు చదివి వినిపించాడు.

"ఇదేదో బాగానే ఉందిగానీ మనిషి తెలిసీ, మని షెక్కడున్నాడో తెలిసి చడీచప్పుడు లేకుండా ముఖం చాటెందుకు చేసుకున్నాడో తెలుసుకోవడం తెలివిగల పనని నా ఉద్దేశం" అంది బాలలీల తల్లి.



తెలీదన్నాడు జడ సాంబలు.

బ్యాంకులో ఎంతుందో తెలీకపో యినా, ఎంతో కొంత ఉండ కుండా ఉండదుగా, ఆ కొంత ఎంతైనా, ఎంత చేయాలని, ఏం చేయాలని జోడుగా కూడబెడుతున్నారు?! ఈ లోపులో జడసాంబలు భార్య ఎవరో తెలిసింది!

***

ఒక సంసారాన్ని ఎలా నిలబెట్టాలా అని చూస్తుంటే రెండు సంసారాల బాధ్యత తనదే అయినట్లుంది!

"బాగుంది రా! కోర్టులో గోలే ఏకాకి గోలైన నీకు, గోలె క్కడ చేయాలో తెలియని ఏకాకుల గోల తోడై, మూడు కాకుల గోలలా ఉంది" అంది అక్క తమ్ముడితో.

"ఏమో అనుకున్నాగానీ, భలే ఊహ నాటావే అక్కా" అన్నాడు తమ్ముడు.

ఆ ఊహకు రూపం వచ్చి పెద్ద బిల్డింగయింది. కిందంతా లైబ్రరీ. పైన సభలు సమావేశాలహాలు, ఆ పైన విశ్రాంత హరితశోభ. వెనక తోటలో బఠానీ తీగల పెంపకం, ఎంతో కాలం కరగకుండా తయారైంది! మనీ, మనసు రెండూ ఉన్నవాడు సమరశంఖం కాబట్టి!

జడసాంబలూ, నిటలాక్షం అందులో మేనేజర్లు అయ్యారు! కొద్దికాలం లోనే ముగ్గురూ విడదీయరాని బంధమయ్యారు.

***

ఒకరోజు ముగ్గురూ పైన లాన్లో కూర్చున్నారు.

"జీవితంలో విజయాలు సాధించి, ఆదర్శంగా నిలిచిన వాళ్లు చాలామంది సున్నాతోనే మొదలుపెట్టారు. ఈ రోజుల్లో ఏ వృత్తీ తృణీకరించేది కాదు. కావల్సిందల్లా వ్యక్తికి ఓ లక్ష్యం చేరుకునేదాకా మనసు నుండి పట్టు జారకూడదు" అన్నాడు సమరశంఖం.

"అందులో ఏ మాత్రం సందేహం లేదు" అన్నారు జడసాంబలు, నిటలాక్షం.

"మీరు లక్ష్యం ఉన్నవాళ్లా లేనివాళ్ళా" అన్నాడు నిటలాక్షం.

"ఏంటో! అది" అడిగాడు సమరశంఖం.

"మీ దగ్గర ఉద్యోగమే" అన్నాడు జడసాంబలు...

"అవును, నాదీ అదేమాట" అన్నాడు నిటలాక్షం.

"ఇదంతా ఎందుకు నేనెళ్ళి కాళ్లు పట్టుకుని కడివెడు నీళ్ళతో కడిగి శుభ్రం చేస్తాను" అన్నాడు బాలలీల తండ్రి.

"మీ పాత్రలో నీళ్ళు ఎప్పుడో ఎండిపోయాయి. కడిగి ఓ పెళ్ళి, కడక్కుండా ఓ పెళ్ళి, కడిగించు కోకుండా మీ పెళ్ళి అయిపోయాయి. మీ పనిలో మీరుండండి చాలు. ఈ పనిలో నేనూ, తమ్ముడూ ఉన్నాంగా" అంది తల్లి.

"అవున్లే పుట్టింటి ముద్దు మొదలైందనేగా నీ మాట పోటు" గొణిగాడు తండ్రి.

***

చిత్రకారుల రంగుల బొమ్మలు రైల్లో తిరుగుతున్నాయేంటా అనిపించే పల్లీలమ్మే వాళ్ల మంచిలో పుచ్చుపల్లీల మీద ఒట్టేసి చెప్పారు, నిటలాక్షం చిలిపి కట్టైకాదని. మిగిలింది, నిటలాక్షంతో జాయింటు బ్యాంకు అకౌంటున్న జడసాంబలుతో మాట్లాడాలి విడిగా అనుకున్నాడు సమరశంఖం. జడసాంబలు తన పుస్తకాల్నే థర్డ్ హ్యాండుగా అమ్ముకునే కాలక్షేపంలో ఉన్నాడు. భార్య విసిరితే బయటపడ్డవాడు. జీవితంలో చదువుని మించిందిలేదని ఇంటినిండా పుస్తకాలు పేర్చాడు. అవి గోడల్ని వెనక దాచేస్తున్నాయి. ఒకసారేదో మాటొచ్చి "నీ బుల్లితెర తీట తీరేస్తా" అన్నాడు. ప్రతిగా "నీ పుస్తకాలన్నీ బైట పారేస్తా" అంది భార్య. అది చిలికి, చిలికి గాలివాన్నై, పేరు పెట్టని తుఫాన్నై, చివరికి పుస్తక విక్రయ విసర్జన వేదికగా రైలుని చేసుకుని కదులుతున్నాడు! జడసాంబలు ఏకాకిగోల తెలిసింది కానీ నిటలాక్షం నీలుగుడే తెలివికి అందడం లేదు! ఆ విషయం తనకూ ఏం

"నాకు చాలా సంతోషంగా ఉంది. అయితే కొంచెం నొప్పి కలిగింది."

"ఏంటది!" అన్నారిద్దరూ.

"ఉద్యోగం అని చెప్పడం."

"ఉద్యోగాన్ని ఉద్యోగం అనకుండా ఏం అంటాం?"

"ఏమీ అనకుండా, ఈ సంస్థను మీకు రాసిస్తాను."

"అప్పుడు మా ఉద్యోగాలు పోతాయిగా" నవ్వుతూ అన్నారిద్దరూ.

"కాదు ఉద్యోగం చేస్తున్నాం అనడం పోతుంది!" అన్నాడు సమరశంఖం ఆనందంగా.

***

"పేరు సమరశంఖమేగానీ ఏ సమరానికీ శంఖం ఊదడు. సమరాలకు శంఖాలకు దూరంగా ఉంటాడు" అన్నాడు జడసాంబలు.

"అది నిజమే కానీ, మనకింత చోటివ్వడమేంటి, ఆ చోటు మనదే అనడం ఏంటి, నాకు అర్థం కావట్లేదు" అన్నాడు నిటలాక్షం.

"ఒకటిచెప్పనా, ఇందులో ఆయన స్వార్థం ఉందను కోడానికి వీల్లేదు. ఉన్నా అది స్వార్థం అనిపించుకోదు".

"నువ్వెన్ని చెప్పినా, నాకేదో అనుమానంగా ఉంది."

"అదే నీ అభిప్రాయం అయితే, నీవు రైళ్ల పట్టుకు వేళ్లాడడానికే పనికొస్తావు?"

"రైలు వెనక్కు కదులుతుంది కానీ ప్రయాణం ముందుకేగా"

"ఇప్పుడు నీవు వెనక ప్రయాణానికే సిద్ధమవుతున్నావనిపిస్తోంది".

"ఏమిటీ ఏదో వెనకా ముందాడుతున్నారు" అంటూ వచ్చాడు సమరశంఖం.

"ఏంలేదు, మీరు పెళ్ళెందుకు చేసుకోకూడదు, అని అడగాలా వద్దా అని" అన్నాడు జడసాంబలు.

"చేసుకుంటా, చేసుకుందామనే నిర్ణయానికే వచ్చా. అయితే నా పెళ్ళికి మీరు జంటలుగా వచ్చి ఆశీర్వదించాలి" అన్నాడు సమరశంఖం.

కొంచెం తడబడి చెప్పాడు. "భార్య వదిలేసింది నన్ను" అని ఒకరు.

"నేను భార్యను వదిలేశాను" అని ఒకరు.

"మీ నిజాయితీకి మెచ్చుకుంటున్నాను. అయితే మీరు ఏకాకులై కావు, కావుమనడానికి బలమైన కారణాలున్నాయా?! తిరుగులేని సమాధానం నాకు కావాలి".

"లేవు" అన్నారిద్దరు.

"అవును లేవు" అంటూ వచ్చారు బాలలీల, జడసాంబలు భార్య లీలాబాల. నిలకడతప్పి నిలదొక్కుకున్నారు జడసాంబలు, నిటలాక్షం సభ్యతానందంగా.

"మేం నలుగురం కలిసి ఒకే ఒక ప్రశ్న వేస్తాం. మీ సమాధానం మా అదృష్టం. మా అదృష్టాన్ని పరీక్షించుకుంటాం".

"కొండి!" అన్నాడు సమరశంఖం నవ్వుతో.

"మీ ఏకాకి రాగానికి కారణమైన కోకిల ఎవరో తెలుసుకున్నాం. ఆ కోకిల మీ పక్కకువస్తే యుగళ గీతం పాడతారా లేదా".

"పాడను!" అని ఆగాడు సమరశంఖం నవ్వుతూ.

నలుగురూ క్షణం ఖిన్నమై చూశారు.

"సంసారశంఖం పూరిస్తా!" సమరశంఖం అనడంతో, 'మంగళవాయిద్యాలు వాయించండయ్యా" అన్నాయి నలుగురి నవ్వులు.

# సాకోర్చువాడె మనుజుడు

పి.వి. శేషారత్నం

**‘హాస్టల్ నుంచి బయలుదేరిన మెడికల్ విద్యార్థిని సావేరి ఏమైంది? ఎవరైనా కిడ్నాప్ చేశారా? అబ్బాయిల వేధింపులు తట్టుకోలేక ఆత్మహత్య చేసుకుందా?"**

**శీర్షికలు చూసి చేతిలో దినపత్రిక విసిరికొట్టింది సరోజ.**

**పేపరు తెరిస్తే ఈ మధ్య ఇవే వార్తలు. మళ్ళీ ఆమె మనసు అల్లకల్లోలమైపోయింది.**

ముక్కుపచ్చలారని ఒక ఆడపిల్ల ఉసురు తీశాడని తన కొడుకుని, వాణ్ణి పెంచిన తనను ఇప్పటికే ఊరూవాడా దుమ్మెత్తిపోస్తోంది. మీడియా అయితే దండయాత్రే చేసింది. తను అటు ఆఫీసుకీ వెళ్ళలేక ఇటు గుమ్మం తెరిచి వీధిలోకీ అడుగు పెట్టలేక ఇబ్బంది పడుతోంది. భర్త కూడా తననే దోషిని చేస్తున్నాడెందుకని?

తను, తన బిడ్డ ప్రహసిత్ ఒంటరివాళ్ళైపోయారు.

‘రోజీ!’ పిలిచింది. ఇంట్లోకి వచ్చిన తనని గమనించకుండా పరధ్యానంలో మునిగిపోయిన సరోజను జాలిగా చూసింది నిర్మల. ఆమెను చూడగానే సరోజ దుఃఖం కట్టలు తెంచుకుంది. ‘ఇలా ఎంతకాలం నిన్ను నువ్వే ఇంట్లో బంధించుకుంటావు రోజీ?’

‘కాలేజీలో ఎవరో పిల్ల కనిపించకుండా పోతే ఈ పిచ్చి జనాలు నా బంగారు తండ్రినే ఎందుకు దోషిని చేస్తున్నారు నిర్మలా?’ మా వాడు ప్రేమించానని వెంటబడ్డందుకే ఆ పిల్ల ఆత్మహత్య చేసుకుంటుందంటావా? అసలు అంత అందంగా ఉన్న ఆ పిల్ల ఎంతమందితో తిరిగి..ఏపాడు పనులు చేసి..’ ఆవేశం కదలాడింది సరోజ మాటల్లో.

‘రోజీ! నువ్వు మనస్ఫూర్తిగానే ఈ మాటలంటున్నావా? మనంకూడా ఆడవాళ్లమే అని మర్చిపోకు. సంప్రదాయాల మధ్య తండ్రి, నానమ్మ ప్రేమాభిమానాల మధ్య సున్నితంగా పెరిగిన ఒక తల్లిలేని ఆడపిల్లను అంతమాట అనడానికి అసలు నీకు నోరెలా వస్తోంది? నాకెలా తెలుసు అంటే మా నిత్యకు స్నేహితురాలు సావేరి’ నిర్మల కంఠంలో కాఠిన్యానికి హడలిపోలేదు సరోజ.

‘అంటే ఆ పిల్ల అన్నెంపున్నెం ఎరగనిదంటావు, నాకొడుకే పరమ నీచుడంటావు. అంతేనా?’

‘నేను ఏమీ అనడం లేదు. ఇప్పటికైనా ముసుగు తీసుకుని వాస్తవం గ్రహించమంటున్నాను. ఒక్కసారి నువ్వే నీమనసుని ప్రశ్నించుకో రోజీ! మీవాణ్ణి నువ్వెలా పెంచావో మీవాడి గురించి నా దగ్గర ఎన్నిసార్లు వాపోయావో నిజంగా నీకు గుర్తుండి ఉంటే ఇలా పరాయి పిల్లను దోషిని చెయ్యవు.’ నిర్మల మాటలతో సరోజ బావురుమంది.

నాలుగురోజుల క్రితం అప్పుడే ఆఫీసునుంచి వచ్చిన తను కొడుకు ఉగ్రరూపం చూసి విచలితురాలైపోయింది సరోజ. ప్రహసిత్ శక్తికొద్దీ గుప్పిళ్లు బిగించి అద్దాన్ని గుద్దడం గుర్తొచ్చింది. అర చేతిలో గాజుముక్కలు గుచ్చుకుని రక్తం కారుతున్నా వాడికి తెలియలేదు.

‘ఈ ఆడాళ్లంతా ఇంతే. అమ్మకి తెలియకుండా హోటళ్లకీ షికార్లకీ తిప్పానే, కావలసినవన్నీ కొనిచ్చానే, అయినా సుజన ఎంత మోసం చేసింది? చివరికి సావేరి కూడా నన్ను ప్రేమించకుండా అన్యాయం చేస్తోంది. ఇది నేను సహించను, దానిని వదిలిపెట్టను. ఇన్నాళ్లూ నేను కోరినది ఏదీ నాకు దక్కకుండా పోలేదు. ఆ సావేరిని వదిలిపెట్టను. నేనంటే ఏంటో చేసి చూపిస్తాను. దాని ఫొటోలు నెట్‌లో పెట్టి..’చేతిలోని గాజు గ్లాసు నేలమీదకి విసిరికొట్టాడు ప్రహసిత్.

ఆలోచిస్తున్న సరోజ ముఖంలోకే దీర్ఘంగా చూసిన నిర్మల అంది. ‘ఏం రోజీ, ఇప్పటికీ తప్పు ఆ పిల్లదే అంటావా?’

స్నేహితురాలికి సమాధానం చెప్పలేని సరోజ రెండు చేతులతో ముఖం కప్పుకుంది.

‘ప్రహసిత్ విషయంలో నేను ఓడిపోయాను నిర్మలా! వాణ్ణి సైకియాట్రిస్ట్‌కి చూపించేందుకు మా ఆయన ఒప్పుకోలేదు. ‘చుట్టుపక్కలవాళ్ళు మనవాడికి పిచ్చి అని ముద్రవేస్తారు, నాలుగు రోజులుపోతే వాడే సర్దుకుంటాడులే’ అనేశారు. నేనేం చెయ్యను? వీడేమో రోజురోజుకీ సినిక్‌గా తయారవుతుంటే ఆ దేవుడి మీద భారం వేసి ఊరుకోవడం తప్ప నేనేం చెయ్యలేకపోయాను.’

లోకంలో ఆడపిల్లల తల్లిదండ్రులూ మగపిల్లల తల్లిదండ్రులూ వేరువేరుగా లేరు.

అన్యాయమైపోయిన ఆడకూతురు కోసమైనా, చెడ బుట్టిన కొడుకుల కోసమైనా తల్లిదండ్రుల దుఃఖం ఒక్కటే.



కత్తికి రెండువైపులా పదును ఉన్నప్పుడు కుటుంబమో పౌరసమాజమో ఈ తరాన్ని కాపాడుకునేందుకు నడుం బిగించక తప్పదు.

***

జారిపోయిన చున్నీని కూడా పట్టించుకోకుండా ఒకమ్మాయి గబగబా కదులుతున్న రైలెక్కింది. ఎవరి వైపు చూడకుండా పదేపదే సెల్‌ఫోన్‌లోకి చూసుకుని కర్చీఫ్‌తో కళ్ళు తుడుచుకుంటోంది.

కంపార్టుమెంటులో అంతా దూర ప్రయాణాలవాళ్ళే అవడంతో లంచ్‌లు కానిచ్చేసి పగలే అయినా బెర్త్‌లు దించేసి పక్కలు పరుచుకుని నిద్రలకు ఉపక్రమించేశారు.

నేను ఎదురు బెర్త్ మీది ఆ అమ్మాయినే పరిశీల నగా చూస్తున్నాను. తరచు రైలు ప్రయాణాలు చేసే నాకిది మామూలే.

ఆ అమ్మాయి వయసు పద్దెనిమిది లోపేనేమో! చూడచక్కని కనుముక్కు తీరు. ఒత్తయిన కను బొమ్మలు, లక్కపిడతలాంటి నోరు. చాయకు మించిన శరీర చాయ.. వెరసి అందాల బొమ్మ. ఆ బొమ్మలో ఏదో లోపించినట్టుగా ఉంది. ఆ నవ్వు... ఆ పెదాలు ముడుచుకుని ఉన్నాయి. పదే పదే తుడుచుకోవడం వల్లనో ఏమోగాని ముక్కు, కనుదోయి చిన్నబోయి ఒకింత ఎర్రబడి ఉన్నాయి. అందరిలాగా ఆ పిల్ల లంచ్ చెయ్యలేదు. అసలు రావడమే కంగారు కంగారుగా వచ్చి రైలు ఎక్కిందేమో ఆ ఆందోళన కప్పిపుచ్చుకోవ డానికి విశ్వప్రయత్నాలు చేస్తోంది.

తననెవరూ గమనించలేదనుకుంటూనే అటూ ఇటూ చూసి మాటిమాటికీ హ్యాండ్‌బ్యాగ్‌లోని చిన్న పుస్తకం తెరిచి ఏదో రాస్తోంది. అంతలోనే ఏదో పను న్నట్టు మాటిమాటికీ బాత్రూం వైపు వెళ్ళి వస్తోంది. ఆ పిల్ల ఎందుకంత బాధపడుతోందో?

పద్దెనిమిదేళ్ళ అమ్మాయికి అప్పుడే అన్ని కష్టాలే ముంటాయి? నవ్వొచ్చింది నాకు. ఎందుకుండ కూడదు?

ఈకాలం కుర్రకారు గురించి చెప్పేదేముంది?

తల్లిదండ్రులిద్దరూ ఉద్యోగాలు చేయడంతో అతి గారం, చేతినిండా డబ్బు, కావలసినంత స్వేచ్ఛ, ఉచ్చం నీచం చెప్పే పెద్దవాళ్లు కరువవడం.. ఉన్న తల్లిదండ్రులకు వీళ్ళగురించి పట్టకపోవడం..పట్టినా వీళ్ళు వినకనపోవడం..జీవితాన్నంతటినీ పబ్బులు, పార్టీలు, షికారులు.. మాల్స్ అంటూ ఎప్పటికప్పుడే ఆస్వాదించేయాలనే తపన..

ఫలితంగా ప్రస్తుతం అమ్మాయిలు, అబ్బాయిలు ఇష్టపూర్వకంగానే ఆకర్షణను ప్రేమనుకుంటూ భ్రమలో అడుసులో కాలువేయడం.. కళ్ళు తెరిచేసరికి అమ్మాయి అయితే అందాకా స్నేహం పేరుతో ప్రేమ నడిపిన అబ్బాయి మొహం చాటేయడం, అమ్మాయి డాక్ట రును ఆశ్రయించడం లేదా ఆత్మహత్యకు పాల్పడడం లేదా అమ్మాయి ప్రేమకు నో చెబితే వేధింపులు, ఆసిడ్ దాడులు, తల్లిదండ్రులు లబోదిబోలు, పోలీసులు, కాలేజీల హంగామా, మానవ హక్కుల సంఘాలు, మీడియా తల్లిదండ్రులు, విద్యార్థి సంఘాలు, రాజ కీయ నాయకులతో ఆ అంశం మీద డిబేట్లతో సెన్సే షన్ వార్తలతో పదిరోజులపాటు పండుగ.. జనం టీవీలు వదలకపోవడం, ఈ వార్త పాచిదైపోయే లోగా అదృష్టవశాత్తూ కోతికి కొబ్బరికాయలాగా మరో హాట్ టాపిక్ దొరికేస్తే మళ్ళీ సెన్సేషన్ వార్త లతో పదిరోజుల పాటు పండుగ. ఈలోగా పాతవిష యాన్ని అందరూ కన్వీనియంట్‌గా మరచిపోవడంతో ఊపిరి పీల్చుకున్న అబ్బాయి తాలూకువాళ్ళు పర పతి ఉన్నవాళ్ళయితే బెయిలు, రిలీజు అంతా గప్ చుప్.

పరిపక్వత లేని వయసు, పరిణతి చెందని మనసు, లేత ఈడు ప్రేమ, మనిషికీ మనిషికీ మధ్య అనుబంధ వారధిగా ఉండాల్సిన ప్రేమ, ఈనాడు పిల్లల పాలిట శాపమవుతోంది. దీనికి తోడు సినిమాల ప్రభావం, యుక్తవయసులో వచ్చే మానసిక ఒత్తిడులకు తట్టు కోలేకపోవడం... ఇదంతా ఈరోజుల్లో కామన్ అయి పోయింది. ఈకాలం పిల్లలను అర్థం చేసుకోవడానికి ఒక జన్మ సరిపోదు.

ఈ అమ్మాయి భగ్న ప్రేమికురాలా? లేక ఈ మధ్య కాలేజీల్లో ర్యాగింగ్ ముసుగులో పెరిగి పోయిన వేధింపులకు గురైన బాపతా?

ఆ అమ్మాయి కాస్త స్థిమిత పడినట్టు తన బెర్తు మీద కూర్చోవడంతో నేను అప్పుడే నిద్రలేచినట్టు నటిస్తూ బాత్రూంవైపు నడిచాను. నేను బాత్రూం వైపు వెళ్ళడం చూసి ఆ అమ్మాయి ఉలికిపడడం గమ నించనట్టే నేను నా పనిమీద కదిలాను. నేను బయ టికి వచ్చేసరికి వాటరింగ్ కోసమేమో రైలు ఆగి ఉంది. అది మిట్టమధ్యాహ్నం సమయమేమో బహుశా రైళ్లు వచ్చే సమయం కూడా కాదేమో ప్లాట్ ఫారాల మీద మనుషులు పలచగా ఉన్నారు. అప్పటి దాకా నిర్లిప్తంగా ఉన్న ఆ పిల్ల ఆసక్తిగా కిటికీ వైపు వంగి బైటకు చూస్తోంటే నేనూ అక్కడి దృశ్యం చూసి ముచ్చటపడ్డాను.

అక్కడ ఎన్ని కోతులో? తల్లి కోతులైతే పిల్లలు పొట్టలు పట్టుకుంటే పట్టాలమీద స్వేచ్ఛగా తిరు గుతూ దొరికిన అరటిపండు తొక్కలు, ప్రయాణి కులు కిటికీల్లోంచి పారేసిన పొట్లాలు విప్పుకుని, మరి కొన్ని బ్రెడ్ ముక్కల్నీ తింటూంటే చూడముచ్చటగా ఉంది. అప్పటికే ఒకటి రెండు కోతులయితే ఎలక్ట్రిక్ పోల్స్‌మీద ఎక్కి దిగుతూ అల్లరి చేస్తున్నాయి.

ఆ పక్కనే రైళ్ల వాటరింగ్ నీళ్ళు కారిపోయి ఒక కాలువ ఏర్పడినట్టుగా అది నిండి పైకిపొరలుతోంది. ఎంత నీరు వృథా అవుతోంది. దిగేటప్పుడు కంప్ల యింట్స్ బుక్‌లో రాయాలి అనుకున్నాను.

రైలు ఆగి చాలాసేపయినా కదల్లేదు. బహుశా క్రాసింగ్ కూడా ఉందేమో!

ఇంతలో హఠాత్తుగా ప్లాట్‌ఫాం మీద ఉన్న నలు గురు మనుషులు అరెరె అంటూ అరిచారు. అంత వరకు ఎలక్ట్రిక్ పోల్ ఎక్కి దిగుతూ విన్యాసాలు చేస్తున్న కోతుల్లో ఒకదానికి షాక్ కొట్టినట్టుంది. అంత పైనుంచి జారిపోయి సొమ్మసిల్లి పడిందో లేక చచ్చిపోయిందో కానీ చలనం లేకుండా కాలువ పక్కనే పడిపోయింది. ఏక్షణంలో ఎవరికి ఆయువు మూడుతుందో ఆ విధిరాతను ఎవరు తప్పించ గలరు? కాని అంతవరకు చలాకీగా కదులుతూ కను విందు చేసిన ఆ కోతి అలా పడిపోగానే మనసంతా బాధతో నిండిపోయింది.

ఎంత జంతువైనా దానికీ కుటుంబం ఉండనే ఉంటుంది కదా!

చప్పున ఆ అమ్మాయి వైపు చూశాను. ఆపిల్ల కళ్ళు తడిసి ఉన్నాయి. కోతి కోసమో తన కష్టాలు తలుచు కునో అర్థం కాలేదు.



ప్లాట్‌ఫాం మీద ఉన్న నలుగురూ చేష్టలుడిగి నిలబడిపోయారు. ఇంతలో నా ఎదురు అమ్మాయి అరిచింది. ఆమె కళ్ళు ఆశ్చర్యంతో విచ్చుకున్నాయి. 'అంకుల్..అటు చూడండి'.

ఆ అమ్మాయి పిలిచినందుకు కాదు నేను ఆశ్చర్యపోయింది.

అక్కడ అప్పటిదాకా ఆహారం కోసం తిరుగుతున్న కోతుల్లో ఒక బండ కోతి గబగబా పడిపోయిన ఆ కోతి దగ్గరకు పరిగెత్తి దానిని అటూఇటూ కదిపి ముందుకీ వెనక్కీ తిప్పి చూసి తర్వాత రెండు చేతులతోనూ పైకెత్తింది. వెంటనే అక్కడ పారుతున్న మురుగు కాలువ నీళ్లలోనే మరో రెండు సార్లు ముంచింది.

అంతే షాక్ తగిలిన కోతిలో చలనం వచ్చింది. అది కళ్ళు తెరిచి అటూ ఇటూ అయోమయంగా చూసి చెంగున గెంతుకుంటూ పారిపోయింది. చూస్తున్న మా అందరికీ మతి పోయింది. అందరం తేలికగా ఊపిరి తీసుకున్నాం.

ప్లాట్‌ఫాం మీద కుర్రాళ్లలో ఒకడు విజిలేస్తూ జరిగినదంతా సెల్‌ఫోన్‌లో రికార్డు చేయడం కనిపించి నవ్వుకున్నాను. కొన్నాళ్లపాటు యువతకు ఫేవరెట్ అయిన ఫేస్‌బుక్‌లో ఈ దృశ్యం తప్పకుండా హల్‌చల్ చేస్తుంది.

ఆ అమ్మాయి ఎదుటి బెర్తులోని నన్ను అప్పటికి గుర్తించి మళ్ళీ పలకరించినందుకు నాకెంతో ఆనందం కలిగింది.

ఆ అమ్మాయి ముఖం సంతోషంతో వెలిగిపోతోంది.

'నేనేమీ మాట్లాడకపోవడం చూసి తనే అంది.

'అది నిమిషంలో తీసుకున్న నిర్ణయం, ఆచరణ నిజంగా వండర్‌ఫుల్ అంది.

'అవునమ్మా! అది కోతి కనుకే సాటి జంతువుకి పైసా తీసుకోకుండా వైద్యం చేసి ప్రాణదానం చేసింది. దానికి కార్పొరేట్ సంస్కృతి గురించి తెలియదుగా.'

'అదేమిటి అలా అంటారు. దీనిని మనమూ ప్రయోగపూర్వకంగా చేస్తే ఎన్ని ప్రాణాలు రక్షించవచ్చో కదా అని నేననుకుంటున్నాను.'

'మన డాక్టర్లకి అంత మంచి బుద్ధి ఉంటే నాకొడుకు ఈపాటికి సజీవంగా ఉండేవాడని నేననుకుంటున్నాను.'

ఆ అమ్మాయి గాయపడినట్టు చూసింది నిట్టూర్పు విడిచిన నావైపు. 'ఐయామ్ సారీ! మీ అబ్బాయి చనిపోయాడా?'

'చంపబడ్డాడు. అవునమ్మా! డాక్టర్ల దుర్మార్గం కారణంగానే నేను వచ్చేలోగా నా భార్య డబ్బు కట్టలేకపోయిన కారణంగానే యాక్సిడెంటైన నాకొడుకు మృతదేహాన్ని నాకు కానుకగా ఇచ్చారు డాక్టర్లు. అది చూసి తట్టుకోలేక నా భార్య గుండెపోటుతో అక్కడికక్కడే కూలిపోయింది. వాళ్ళ అస్థికలు నిమజ్జనం చేయడానికే నేను ఈ ప్రయాణం చేస్తున్నాను.'

నా కళ్ళల్లో నీళ్ళు చూసి చలించిపోయినట్టుంది. 'అయామ్ సారీ అంకుల్! మీకు జరిగింది అన్యాయమే కానీ డాక్టర్లంతా...'

'ఈ డాక్టర్ల గురించి నాకు చెప్పకు. డబ్బు కక్కుర్తితో ప్రయోగాల పేరుతో ఎందరు అమాయకుల జీవితాలతో ఆడుకుంటున్నారో తెలిసి నాగుండె రగిలిపోతోంది.'

'డాక్టర్లందరూ అలాగే ఉంటారని ముద్రవేయకండి ప్లీజ్. పల్లెల్లో ప్రజలకు సేవ చేయాలనే ఒక పవిత్ర ఆశయంతోనే నేను కూడా వైద్య విద్యలో చేరాను' ఆ అమ్మాయి గొంతులో బాధ.

'అయితే మరి ఆత్మహత్య చేసుకోవాలని ఎందుకు అనుకుంటున్నావు?' అనుకోకుండా నేను అడిగిన ప్రశ్నకు విస్తుబోయిన ఆ అమ్మాయి ముఖంలో రక్తపు చుక్కలేకుండా పోయింది.

'నే..ను..నే..ను ఆ..త్మ..హ..త్య చేసుకుందామనుకుంటున్నానని మీకెలా తెలుసు?'

'అది తర్వాత చెప్తాను. ముందు నువ్వెందుకు చనిపోవాలనుకుంటున్నావో చెప్పు.'

తీక్షణంగా అంటున్న నన్ను నిర్లిప్తంగా చూసింది. 'అంకుల్! నాపేరు సావేరి. మా అమ్మంటే నాకెంతో ఇష్టం..మానాన్నగారి పేరు ప్రకాశరావు.'

'తెలుసు.'

'తెలుసా, ఎలా?'

'నువ్వు గుండెల మీద పెట్టుకున్న డైరీ మీద వాళ్ళ ఫొటోలు, పేర్లు కనిపిస్తున్నాయిలే. ముందు నువ్వు నా ప్రశ్నకు సమాధానం చెప్పు' ఆ తర్వాత సావేరి గొంతులో కావేరీ ఝరి వినిపించింది నాకు.

మా ఇంట్లో నాన్న ప్రకాశరావు, నాన్నమ్మ ఉంటాం. అమ్మలేని పసిగుడ్డుకి తనకిష్టమైన రాగం పేరు సావేరి అని పెట్టుకుని గుండెలమీద పెంచారు నాన్న, నాన్నమ్మ.

'ఇదిగో చూశావా అమ్మా నా బంగారు తల్లి కాలేజీలో ఫస్టొచ్చింది. ఈ వెండికప్పు చూశావా? మన సావేరికి ప్రజెంట్ చేశారమ్మా, ప్రిన్సిపాల్ ఎంత మెచ్చుకున్నారనుకున్నావ్? ప్రకాశరావు కంఠంలో సంతోషం పొంగిపోతోంది.

**తన ఎదురు బెర్తులో ఉన్న అమ్మాయినే గమనిస్తున్నాడతను. ఆమె కళ్ళు తడిగా ఉన్నాయి. బ్యాగ్‌లోంచి చిన్న పుస్తకం తీసి ఏదో రాస్తోంది. మాటి మాటికీ బాత్రూము కెళ్ళి వస్తోంది. ఇంత చిన్న వయసులో ఆమెకేం కష్టాలుంటాయి, ఆమె ఎందుకంత బాధపడుతోంది? ఒకవేళ భగ్న ప్రేమికురాలా, లేక ర్యాగింగూ, వేధింపులకు గురైన బాపతా? అతడు పరిపరి విధాల ఆలోచిస్తున్నాడు. మరి ఇంతకీ అతనేం చేశాడు?**

'అది నా మనవరాలురా. చదువుల సరస్వతిరా. నాతల్లే. ఉండు ఎన్ని పాడుకళ్ళు పడ్డాయో, దిష్టి తీస్తాను.'

నానమ్మ హడావిడి చూసి నవ్వింది సావేరి. 'చాదస్తం నానమ్మా, డాక్టర్ చదవాలనుకుంటున్న నాకే దిష్టి తీస్తానంటున్నావ్.'

'డాక్టరయితే మాత్రం దిష్టి ఉండదా ఏంటి? అయినా పిచ్చితల్లీ డాక్టరు చదువంటే చాలా కష్టం కదే'

'ఎంత కష్టమయినా సాధిస్తాను నానమ్మా. పల్లెటూళ్లల్లో ఎవరూ మా అమ్మలా చచ్చిపోకుండా కాపాడతాను'

'ఒరేయ్ ప్రకాశం మన సావేరికి రోజురోజుకీ పదహారు కళలూ వస్తున్నాయి. బంగారు బొమ్మలా ఉంది. రోజూ ఎందరి దిష్టి తగులుతోందో అని భయపడుతూ ఉంటానురా. ఇప్పుడు ఫస్టుకూడా వచ్చింది అంటే ఇక చెప్పేదేముంది?'

'పోనీలే అమ్మా ఓ కేజీ జీడిపప్పు దిష్టి తీసి నాకే ఇచ్చెయ్యి. తినేస్తాను.'

'చాల్లేరా వేళాకోళం. నాభయం నాది. అసలే ఈ కాలం కుర్రాళ్లు దుడుకువాళ్లు'

'నువ్వేం భయపడకమ్మా, నీ మనవరాలిని ఎవరూ ఎత్తుకుపోరులే కంగారు పడకు'

***

మెడికల్ కాలేజీలో చేరి హాస్టల్ నుంచి తలవంచుకుని నడుస్తున్న సావేరి తనను అనుసరిస్తున్న కుర్రాణ్ణి చూసి ఉలికి పడింది అలా అనుసరించడం ఇది నాలుగోసారి.

'ఇదిగో సావేరీ! నాకు సూటిగా మాట్లాడ్డం అలవాటు, నువ్వంటే నాకిష్టం, నిన్ను చూడకుండా ఉండలేను నువ్వు నాక్కావాలి, నిన్ను నేను పెళ్ళి చేసుకుంటాను.'

'పెళ్ళా ? నేను బాగా చదువుకుని డాక్టర్ కావాలనుకుంటున్నాను.'

'నన్ను పెళ్ళి చేసుకుని చదువుకుని, డాక్టర్ అవు, నాకేం తక్కువ?'

'ఏం ఎక్కువైనా నాకు అప్పుడే పెళ్ళి ఇష్టం లేదు. అంతే, 'సావేరి గొంతులో ఖచ్చితత్వానికి చిరాకేసింది ప్రహసిత్‌కి.

'నీకిష్టం అవాలంటే ఎలా ఉండాలో చెప్పు, అలాగే ఉంటాను.'

'అయితే ముందు నా వెంట పడడం మానెయ్'



## కీర్తి పెంచేసింది

ఇందులో విపరీతార్థం ఏమీ లేదు. అసలు సంగతేమి టంటే...ప్రస్తుతానికి కోలీవుడ్‌లో నయనతారే నెంబర్ వన్ హీరోయిన్. టాలీవుడ్‌లో స్టార్ హీరోయిన్లుగా పేరుతెచ్చుకున్న కొందరు కోలీవుడ్‌లో కూడా పాగా వేయాలని చూశారు కానీ అక్కడ వారి పప్పులేమీ ఉడకలేదు. నయనతారకే నెంబర్ వన్ స్థానాన్ని కట్టబెట్టారు.

ఆ స్థానానికి తగినట్టుగానే ఆమెకు రెమ్యునరేషన్ ముట్ట చెబుతూ వస్తున్నారు. దక్షిణాదిన మూడుకోట్ల రూపాయలు అందుకుంటున్న ఏకైక హీరోయిన్‌గా నయన తార పేరు గాంచింది.

ఇప్పుడు ఆమెకు జతగా కీర్తి కూడా అంత మొత్తాన్ని అందుకుంటోంది. సావిత్రి బయోపిక్‌లో కీర్తి నటిస్తున్న సంగతి తెలిసిందే! ఈ సినిమాకి కీర్తి మూడు కోట్లు పుచ్చుకుంటోందట! టాలీవుడ్, కోలీవుడ్‌లలో కీర్తికి ఉన్న డిమాండ్‌ను దృష్టిలో పెట్టుకుని ఆ సినిమా దర్శక నిర్మాతలు అంత మొత్తం ఇవ్వబోతున్నారట! ఇప్పటి వరకూ నయనతారకు మాత్రమే అంత ఇచ్చారు. ఇప్పుడు కీర్తికి అంత ఇస్తున్నారు. ఈ సినిమా హిట్ అయితే కనుక అన్ని సినిమాలకూ కీర్తి అంత మొత్తం డిమాండ్ చేయవచ్చన్న మాట వినబడుతోంది.



'అసలు నాకేం తక్కువ. ఇంత అందముంది. మాకు బోల్డు ఆస్తుంది. మీ ఆడాళ్లకి అంతకంటే ఏం కావాలి. డబ్బూ నగలేగా' అతని కంఠంలో వెటకారానికి ఒళ్ళు మండింది సావేరికి.

'ఛీ నువ్వసలు మనిషివి కాదు. వద్దంటోన్న మనిషిని పట్టుకుని వేలాడతావేం?'

'నన్ను కాదన్నావంటే నిజంగానే మనిషిని కాను.'

'ఈసారి వెంటబడ్డావంటే ప్రిన్సిపాల్‌కి కంప్లయింట్ చేస్తాను. తర్వాత మా డాడీకి చెప్పి పోలీసులకి అప్పగిస్తాను.'

'వాళ్ల మా ఇంటి కాపలా కుక్కలు. నాకెవరన్నా భయం లేదు. నువ్వెలా ఒప్పుకోవో అదీ చూస్తాను. పొగరుగా అని వెళ్ళిపోయాడు. ఆ రోజు కాలేజీ నుంచి హాస్టల్‌కి వచ్చి ఎంతసేపైనా సావేరికి తలనొప్పి తగ్గలేదు. 'ప్రహసిత్‌తో రోజూ ఈ గోల భరించలేకపోతున్నాను. నా మీదే ప్రాణాలు పెట్టుకున్న డాడీతో నాన్నమ్మతో ఎలా చెప్పను? వాళ్ల కంగారు పడి చదువే మానేయమంటే? అసలు కాలేజీకి వెళ్ళాలంటేనే భయమేస్తుంది. ఎన్ని రోజులని కాలేజి మానెయ్యను? పాఠాలు పోతుంటే లెక్చరర్లు తిడుతున్నారు. డాడీకి ఫోన్ చేసి చెబితే? అమ్మో పోలీస్ కంప్లయింట్ చేశానని కక్షగట్టి వాడు ఊరెళ్ళి డాడీని, నానమ్మని ఏమన్నా చేస్తే..?' ఎంతకీ ఆలోచన తెగడం లేదు. మధ్యలో పడుకున్నా కలతనిద్రే సావేరికి.

'హలో సావేరీ! నిన్నే..'

'ప్రహసిత్!' గుండె గొంతుకలోకి వచ్చేసింది సావేరికి. తను దారి మార్చినా వెంటబడుతున్నాడు.

'హమ్మయ్య నువ్వు నాపేరుతో పిలిస్తే ఎంత బాగుందో?'

'నువ్వెంతో మంచివాడివని విన్నాను ప్రహసిత్. నాజోలికి రావద్దని నిన్ను బతిమాలుతున్నాను'

'నన్ను ప్రేమించమని నేనూ బ్రతిమాలుతున్నాగా. పెళ్ళి ఇష్టం లేకపోతే అందాకా లవ్ అంటే అబ్జెక్షన్ లేదుగా'

'ఇలా మాట్లాడ్డానికి నీకు సిగ్గుగా లేదూ?'

'ప్రేమలో పడ్డవాళ్లకి సిగ్గూ ఎగ్గూ ఉండవు డియర్ సావేరీ'

'మంచిగా దారిలోకి వస్తావని మాట్లాడుతుంటే వినవేం? నీ సంగతి నాకు తెలియదనుకోకు? సుజన వ్యవహారం నాకు తెలుసు.'

క్రోధంతో ప్రహసిత్ కళ్ళు ఎర్రబడ్డాయి. 'దానికి పొగరెక్కి ఎవణ్ణో చేసుకుని పోయింది. మీ ఆడాళ్ళు తక్కువ వాళ్ళు కాదు. ఇంట్లోవాళ్ళు స్వేచ్ఛ ఇవ్వడం లేదో.. అని ఏడుస్తారు. ఇస్తే అబ్బాయిలతో స్నేహం చేసి వాళ్ళ జేబులు ఖాళీ చేస్తారు. మళ్ళీ మాకన్నా డబ్బున్న వాళ్ళు దొరికితే బుద్ధిగా తలవంచుకుని పెళ్ళి చేసేసుకుంటారు.'

'ఆడాళ్లంటే నీకింత చులకనభావం ఉందనే, నీ అసలు రంగు తెలిసే సుజన దూరం జరిగిపోయిందని తెలియని మూర్ఖుడివి.'

వెటకారం ధ్వనించింది అతని గొంతులో.

చాలా శ్రమపడి నాగురించి బాగానే తెలుసుకున్నావులే. నీ గురించీ నాకు తెలియదనుకోకు. చదువు చదువని నాతో వంక పెడుతున్న నువ్వు శేఖర్‌గాడితో ఎలా నవ్వుతూ మాట్లాడుతున్నావు?'

'ఇది చాలా తప్పు ప్రహసిత్! నీమూలంగా నేను కాలేజీ మానేసి ఎన్నో పాఠాలు మిస్సవుతున్నాను. క్లాసులో కాస్త తెలివైనవాడని శేఖర్ క్లాస్ బుక్స్ తీసుకుంటే తప్పేంటి? అని నువ్వనుకుంటున్నావు, కానీ నాకు తెలుసు నువ్వు ఆ శేఖర్‌ను ప్రేమిస్తున్నావు.'

'ఛీ చదువుకునే వయసులో కూడా ఎంతసేపూ ప్రేమ అనే పదం తప్ప మరోటి లేదా?'

'లేనేలేదు. ఇదిగో ఇప్పుడే చెబుతున్నాను సావేరి, నేను చిన్నప్పటి నుంచీ అంతే నాకు దక్కని వస్తువయినా మనిషయినా ఇంకెవరికైనా దక్కితే నా గుండె దహించుకుపోతుంది'

'ఏంటి బెదిరిస్తున్నావ్? ఆడాళ్లంటే బొమ్మలనుకున్నావా ఏంటి నీది నాది అనుకోవడానికి. మాకూ ఇష్టాయిష్టాలు, హక్కులు, అధికారాలు ఉంటాయి. నువ్వు నీపంథా మార్చుకోకపోతే అనవసరంగా అల్లరి పాలవుతావు. నీలాంటి మొండివాడితో మాట్లాడ్డం నాకిష్టంలేదు.'

'సరే ఈ విషయం విను. హాస్టల్ బాత్రూం సుందరి ఫొటోలు నాదగ్గరున్నాయి. ఏం చెయ్యగలనో తెలుసుగా'

'ఛీ ఎంతకి తెగించావు?' దుఃఖం చుట్టేసింది సావేరిని.

'నన్ను కాదంటే ఇంకా తీవ్ర పరిణామాలెదుర్కోవాల్సి వస్తుంది. నీ బాబునీ, నీ ప్రియమైన నానమ్మని కూడా చంపేస్తాను' ప్రహసిత్ చేతి దెబ్బకి అతను ఆనుకుని నిలబడ్డ కారు అద్దం భళ్లుమని పగిలిపోయింది.

సావేరి అవాక్కయింది. భయంతో వణికిపోయింది.

'మనందరి భవిష్యత్తు పాడవకూడదనే ఎంతో ఓర్చుకున్నా అయినా నామీద యాసిడ్ పోశాడు నానమ్మా. ఈ బాధ నేను భరించలేకపోతున్నాను. డాడీ..డాడీ ఎక్కడ నాయనమ్మా? అయ్యో వాడు చంపేశాడా? వాణ్ణి ఎవరూ ఏమీ చెయ్యలేకపోయారెందుకని నానమ్మా. ఆ పోలీస్ అంకుల్ కూడా చూశారు కదా వాడు దాడి చెయ్యడం నేను డాక్టర్ అవలేనా నానమ్మా..'

కన్నుమూసినా తెరిచినా ఈపాడు కలలు భరించలేకపోయాను అంకుల్. అందుకే నా శరీరం ఎవరికీ దొరకని విధంగా చచ్చిపోవాలని...' ఘొల్లుమన్నది కావేరి.

'అందుకేనా ఇలా రైల్వే కంపార్టుమెంటు బాత్రూంలో అన్ని ఏర్పాట్లూ చేసుకున్నావు?'

నామాటకి సావేరి కళ్ళు నీటికుండలయ్యాయి. 'అవును బతికి నేను ఎవరిని ఉద్ధరించాలి. ఇదే సరైన పరిష్కారం.'

రైలు స్టేషన్ సమీపిస్తున్నట్టు కూతపెట్టింది.

సావేరితో ఏదో చెప్పాలనుకున్న నా కనుగుడ్లు తిరిగిపోవడం మొదలైంది. నేను గుండె పట్టుకుని విలవిల్లాడిపోయాను. తలెత్తి నాకేసి చూసిన ఆ అమ్మాయికి విషయం వెంటనే అర్థమైందనుకుంటాను.

ఆ అమ్మాయి నాకు ఫస్ట్ ఎయిడ్ చేస్తూనే కంగారుగా ఎవరికో ఫోన్ చెయ్యడం..ఇంతలో స్టేషన్ సమీపించడం... స్ట్రెచర్‌మీద నన్ను తీసుకెళ్తుంటే...అంతవరకే గుర్తుంది. అంతా క్షణాల్లో జరిగిపోయింది. మళ్ళీ కళ్ళు తెరిచే సరికి ఆ అమ్మాయి నాముఖంలోకి ఆదుర్దాగా చూస్తోంది.

'ఎలా ఉంది అంకుల్ ఇప్పుడు?'

నాకు దుఃఖం ముంచుకొచ్చింది. 'ఎవరికోసం ఇంత కష్టపడి బ్రతికించావమ్మా!' చేతికి అందివచ్చిన కొడుకు పోయాడు. కట్టుకున్న భార్య పోయింది. నాకు జీవితం మీద ఆశ ఎప్పుడో పోయింది.!'

'నాలాంటి వాళ్ళ కోసం బ్రతకండి అంకుల్! మని

షిగా పుట్టి కూడా బాధతో విలవిల్లాడుతున్న మిమ్మల్ని అలాగే వదిలేస్తే మనం చూసిన కోతికంటే కూడా నేను హీనురాలిని అయిపోనా?'

'కానీ పాపం నువ్వు ఏదో ఆత్మహత్య చేసుకుని నీ కష్టాల నుంచి విముక్తి..'

ఆ అమ్మాయి తన చేత్తో నానోరు మూసేసింది.

'లేదంకుల్, మీరు నొప్పితో విలవిల్లాడుతుంటే నాకు ప్రాణం విలువ తెలిసివచ్చింది. అయినా నాది ఎంతో చిన్న సమస్య? దానికే విచలితురాలినైపోయి అలాంటి నిర్ణయం తీసుకున్నందుకు ఇప్పుడు ఆలోచించి సిగ్గుపడుతున్నాను. మా డాడీ, నానమ్మ ఎంత కుమిలి నలిగిపోయారో వాళ్లను మళ్ళీ కళ్ళతో చూశాకే అర్థమైంది. అసలు నేనెందుకు చావాలి, నావైద్యంతో ఎందరినో బ్రతికించాలిగానీ.. కోతిలాంటి ఒక నోరులేని జంతువు సాటి జంతువుకోసం అంత సమయస్ఫూర్తి ప్రదర్శించి ప్రాణం పోస్తే మనిషిగా పుట్టిన నేను ఎందరికో ప్రాణదానం చేయాల్సిన వృత్తివిద్యలో చేరి నన్ను నేను చంపుకోవడమేంటి? నా ధ్యేయమే నాకు దారి చూపిస్తుంది. నేను డాక్టర్

'అందుకేగదమ్మా సుమతీ శతకకారుడన్నాడు, 'ఆకొన్న కూడె యమృతము..తాకొంచకనిచ్చువాడె దాత ధరిత్రిన..సోకోర్చువాడె మనుజుడు..తేకువగలవాడె వంశతిలకుడు సుమతీ అని. కష్టాలకు ఓర్చుకున్నప్పుడే మనిషి జన్మకు సార్థకత!'

సావేరి మనోహరంగా నవ్వి అంది. 'సారీ అంకుల్! మీ గురించి ఎవరికి తెలియజెయ్యాలో అర్థంకాక..'

'నాలాంటి వారికి నువ్వున్నావుగా... అదే పదివేలు'

నాదగ్గర సెలవు తీసుకుని సావేరి ఆత్మవిశ్వాసంతో ధీమాగా నడిచి వెళ్లిపోతోంటే నేను మనసారా నవ్వుకున్నాను.

తర్వాత డాక్టర్ మిత్రాతో కలిసి ఆయన కారులోనే సరదాగా భోజనం చేయడానికి వాళ్ళింటికెళ్ళిపోయాను.

'అబ్బ మీరు సైకియాట్రిస్టే కాదు, ఎంత గొప్ప నటులో నా కళ్ళారా చూసి కూడా నమ్మలేకపోతున్నాను పట్టాభిగారూ! గుండెనొప్పి అని ఆ కనుగుడ్లు తిప్పడం, చెమటలు పట్టించుకోవడం..విలవిల్లాడడం..ఓహ్..ఏం నటించారండీ బాబూ!' డాక్టరు




చదువులో పాసై పల్లెల్లో పేదలకు వైద్యం చేయాలి. మా అమ్మలాగా వైద్యం అందకుండా ఎవరూ చచ్చిపోకూడదు. అందుకే నా సమస్యను ఎలా పరిష్కరించుకోవాలో నేను నిర్ణయించుకున్నాను.'

'శభాష్ సావేరీ. చూశావా, సమస్య గులకరాయిలాంటిది సావేరీ! కళ్ళకి అడ్డుగా పెట్టుకుంటే లోకాన్నే కమ్మేస్తుంది. దూరం పెడితే నలకంత అయిపోతుంది.'

నాకు తెలుసు ఒంటరిగా సాయం చెయ్యలేకపోయినా గుంపులో కలిసి హడావిడి చెయ్యడానికి సాటివిద్యార్థులు, మానవహక్కుల సంఘాలవాళ్ళు, పోలీసులు తయారే. ఇంక జరిగిన ఇరవై శాతం విషయాన్ని నూరుశాతంగా ఎలా చెయ్యాలో తెలిసిన మీడియా సృష్టించే గగ్గోలు ప్రహసిత్‌కీ అతగాడి తల్లిదండ్రులకు గొప్ప వాతలే అవుతాయి. ఇంత జరిగాక ప్రహసిత్ సావేరినే కాదు మరే ఆడపిల్ల జోలికీ పోలేడు.

ఆలోచనలో పడిపోతున్న నా తలపై ఆప్యాయంగా చెయ్యి వేసింది సావేరి.

'మీ గుండెనొప్పి నాకు ప్రాణం మీద తీపి కలిగించడంతో పాటు కాబోయే డాక్టరుగా నాకర్తవ్యాన్ని కూడా గుర్తుచేసింది.'

మిత్రా చనువుగా భుజం మీద చరిచాడు

'మీలాంటి ఒక మంచి డాక్టరును లోకానికి అందించేందుకు ఆ మాత్రం శ్రమపడకపోతే ఎలా చెప్పండి డాక్టరుగారూ! ఆత్మహత్య చేసుకోవాలనే ఆలోచన క్షణికం..చుట్టుప్రక్కలవాళ్ళో ఆత్మీయులో ఆ క్షణాన్ని గుర్తించి వాళ్ళను నేర్పుగా ఆ మూడ్ నుంచి తప్పించగలిగితే చాలు జీవితాన్ని అందరికంటే ఎక్కువగా వాళ్ళు ప్రేమిస్తారు. దురదృష్టవశాత్తూ ఆత్మహత్యలకు పాల్పడేవాళ్ళు ముందుగానే తమ ఆక్రోశం వెలిబుచ్చుతూ ఎన్ని సంకేతాలిచ్చినా సమాజం గుర్తించకపోవడం వల్లనే చిన్న చిన్న సమస్యలకే ఇలాంటి విద్యాకుసుమాలు రాలిపోతున్నాయి.

ఆ మధ్య ఓసారి ఈ అమ్మాయి ఉండే హాస్టలు వార్డెను, మా చెల్లెలు సత్యవతిని చూసేందుకు హాస్టలు కెళ్లినపుడు తలవంచుకుని విచారంగా రూంకి వెళ్తున్న ఈ అందాల బొమ్మనుచూసి విస్తుబోతోంటే మా సత్యవతి చెప్పింది,

'చాలా తెలివైన పిల్ల అన్నయ్యా! ఇంటిమీద బెంగో బయట వేధింపులో తెలియదుగానీ ఎవరితోనూ కలవకుండా ఈమధ్య ఒంటరిగా ఏడుస్తూ రాసుకుంటూ ఉండడం రెండు మూడు సార్లు గమనించాను. ఆత్మాభిమానం వల్లనో ఏమో నాతో నోరు విప్పలేదు. మాయ

దారి కుర్రాళ్ళు ఈ పిల్లను బ్రతకనిచ్చేలా లేరు.'

నా సూచనతో సత్యవతి రహస్యంగా సాధించి అందించిన ఆపిల్ల డైరీ ద్వారా ఒకవైపు ప్రేమగా పెంచుకుంటున్న తండ్రి, నానమ్మ, మరోవైపు డాక్టర్ కావాలన్న తపన, ఇంకోవైపు వేధింపులు..పద్దెనిమిదేళ్ళ సావేరి నిస్సహాయంగా ఎంతగా క్షోభ పడిపోతోందో ఆపిల్ల అంతరంగం అర్థమైపోయింది.

ఏదో ఆమె ఆత్మహత్య చేసుకుంటూంటే బలవంతంగా అడ్డుకోవడం వల్ల ఆమెకు జీవితం విలువ తెలియదు. జీవితాన్ని ఓ సవాల్‌గా ఎలా తీసుకోవాలో ఆమెకు తెలియజేయడం ద్వారానే అర్థమవుతుందని నాకు తెలుసు. ఒక్కసారి ఆమె మార్గం మార్చుకుంటే ఆమెకు ఎదురే ఉండదు.. అందుకే నాపనులు పక్కనబెట్టి నా దృష్టిని సావేరిపైనే కేంద్రీకరించాను.

ఆమె హాస్టల్‌నుంచి కాలేజీకి కాకుండా దారి మళ్ళడంతో ఆమె అంతరంగం అర్థమైపోయింది. వెంటనే నా యాక్షన్ ప్లాన్ అమలు చేశాను. రైలెక్కిన దగ్గర నుంచి సావేరి పదేపదే బాత్రూమ్‌కి వెళ్తూ అక్కడ తన చావుకు పరికరాలు దాచుకోవడం గమనించాను. అందరినీ పోగొట్టుకున్నానన్న నా కథ విని కూడా స్పందించని సావేరి గట్టి నిర్ణయంతోనే ఉందని అర్థమైంది నాకు. ఆమె దృష్టి ఎలా మళ్ళించాలా అనుకుంటున్న సమయంలో అనుకోకుండా జరిగిన కోతి వ్యవహారం కొంత కలిసొచ్చింది.

కానీ ఇంకా చావుకి బ్రతుక్కి మధ్య ఊగిసలాడుతున్న ఆమె అంతరంగంలోని డాక్టర్‌ను కదిలించే ఉపాయం తట్టి మీలాంటి మిత్రులకు ఫోన్లు చెయ్యడానికి మళ్ళీ బాత్రూం వైపు వెళ్ళాను. అయితే ఎంత ఫస్టియర్‌లో ఉన్నా ఆమె కూడా కాబోయే డాక్టర్ కనుక నా గుండెనొప్పి నాటకాన్ని పసికట్టకుండా రైలు స్టేషన్ సమీపించే సమయం ఎన్నుకుని విజయం సాధించాను.'

నా మనసులో సాగరమథనం మొదలైంది.

నిజానికి నేను బ్రహ్మచారిని. లేని భార్యను, కొడుకుని ఇలాంటి కార్యం కోసం చంపేసినందుకు భగవంతుడు నన్ను క్షమించాలంటే ఇన్నాళ్లూ ఏ బాధ్యతలూ, గమ్యమూ లేక ఊళ్ళు పట్టుకుని తిరుగుతున్న నా బ్రహ్మచారి జీవితానికి ఒక ధ్యేయం కల్పించుకోక తప్పదు. 'ఆరంభింపరు నీచమానవులు విఘ్నాయాస సంత్రస్తులై..ఆరంభించి పరిత్యజింతురుదురు విఘ్నాయాత్తులై మధ్యముల్..' అన్నట్టు కాకుండా ధీరమానవునిలా చివరి వరకూ నిలబడి సాధిస్తాను.

రేపటితరం నేటి తరగతి గదుల్లో రూపుదిద్దుకుంటుంది అన్నది కొఠారి కమిషన్. కాని అందుకు విరుద్ధంగా తల్లిదండ్రులో, ఉపాధ్యాయులో, ప్రభుత్వమో విద్యాసంస్థలో మరి ఎవరి అలసత్వం వల్లనైతేనేం ఇప్పుడు తరగతి గదుల్లో దేశ భవిష్యత్తు సమాధి అవుతోంది. ఎన్నో ఆశలతో ఆశయాలతో కళాశాలలో అడుగుపెడుతున్న సావేరిలాంటి మొగ్గలు రాలిపోతున్నాయి. సంతోష్‌రెడ్డి, రిషితేశ్వరి, మనీషా, నందినిలాంటి ముక్కుపచ్చలారని బిడ్డలు విద్యార్జన దశలోనే తనువులు చాలించడం ఏ వ్యవస్థకూ మంచిదికాదు. లోపం ఎక్కడుందో నివారణా మార్గాలు ఏమిటో శోధించే మిషన్ ఒకటి నా మదిలో రూపుదిద్దుకోవడం ప్రారంభించింది.

**సెల్ 094 92 92 52 91**

# రాజకీయనేతల కంటే రోబోలే నయం ?

రాబోయే ఇరవైఏళ్ళ కాలంలో అనూహ్యమైన మార్పులు రానున్నాయి. రోబోల రాజ్యం రానున్నదని భావిస్తున్నారు. ఈ విషయంపై బ్రిటన్‌లో రెండువేలమందిని సర్వే చేసినప్పుడు ఆశ్చర్యకరమైన అభిప్రాయాలు వ్యక్తమయ్యాయి.

రాజకీయ నాయకులకంటే కూడా రోబోలు ఎంతో సమర్థంగా పనిచేస్తాయని సర్వేలో అభిప్రాయాలు వ్యక్తమయ్యాయి! వేర్వేరుచోట్ల జరిపిన ఈ సర్వేలో ప్రతి నలుగురిలోనూ ఒకరు ఇదే అభిప్రాయం చెప్పారు. 2037 నాటికి ఇది జరిగి తీరుతుందని 66 శాతంమంది అభిప్రాయపడగా, 16 శాతం మంది ఒకటీ రెండేళ్ళల్లోనే జరుగుతుందని అన్నారు. అదెంత మాత్రం సాధ్యంకాదనీ, సాంస్కృతిక, సామా జిక సంబంధమైన వైఖరులను రోబోలు అంచనావేయలేవని 36 శాతం మంది అభిప్రాయపడ్డారు.

అసంఖ్యాకమైన సంస్థల ఆదాయాలు రోబోల వల్ల గణనీయంగా వృద్ధిచెందినట్లు ఇటీవలి సర్వేలు వెల్లడించాయి. జాతీయ సంపద వృద్ధిలో ఉద్యోగ కార్మిక శ్రమకు సమానమైన రీతిలో రోబోలు పనిచేస్తున్నాయని వెల్లడించాయి. ఆర్థిక వ్యవస్థ అభివృద్ధికి నిర్ణయాలు తీసుకోవడంలో ఎన్నికైన ప్రజాప్రతినిధుల కంటే రోబోలే ఉత్తమంగా వ్యవహరిస్తాయని బ్రిటన్‌లోని ప్రతి నలుగురిలో ఒకరు అభిప్రాయపడ్డారు. మరో ఇరవైయేళ్ళలో ప్రభుత్వ వ్యవస్థలు వీటి హయాంలో నడుస్తాయని అభిప్రాయపడ్డారు.



రోబోల రాకపై ప్రపంచ వ్యాప్తంగా కార్మికులు, ఉద్యోగుల్లో భయాందోళన రేగింది. తమ ఉద్యోగాలకు ముప్పు వాటిల్లుతుందని వారు భయపడుతున్నారు. అయితే సర్వేలో పాల్గొన్న బ్రిటన్ నివాసితులు మాత్రం, రోబోల వల్ల తమ దేశం రివల్యూషనైజ్ అవుతుందని, అద్భుతమైన యంత్రవిప్లవం వస్తుందని పేర్కొన్నారు.

వచ్చే ఇరవైయేళ్ళలో తాము ఉద్యోగాలు కోల్పోతామని సర్వేలో పాల్గొన్న 24 శాతంమంది భావించగా, మరో 25 శాతం మంది మాత్రం వచ్చే పదేళ్ళలోనే ఇదంతా జరుగుతుందని నమ్ముతున్నారు. కాలిఫోర్నియా కార్యాలయాలు ఇప్పటికే గస్తీకి రోబోలనుపయోగిస్తున్నాయి. వెయిటర్లు, రూమ్ సర్వీస్ బోయ్స్‌గా, స్టేజి ఆర్టిస్ట్‌లుగా ఇప్పటికే ఉన్నాయి. మిల్టన్ కీనెస్‌లోని ఒక కార్యాలయం తమ సిబ్బందిపై అజమాయిషీకి రోబోను మేనేజర్‌గా అపాయింట్ చేసింది. డెబ్బైశాతం ఆఫీస్ మేనేజర్లు తమ టీమ్స్‌లో రోబోలను తీసుకోవాలనే అంశాన్ని పరిగణనలోకి తీసుకుంటుండగా, అదేమీ తప్పుకాదని వీరిలో సగంమంది భావిస్తున్నారు. రోబో పనితీరువల్ల ప్రతి పరిశ్రమలో ప్రతి ఉద్యోగిమీదా పెను ప్రభావం పడక తప్పదని యునైటెడ్ కింగ్‌డమ్ 'ఓపెన్ టెక్స్ట్' వైస్ ప్రెసిడెంట్ మార్క్ బ్రిడ్జెర్ అన్నారు. 'మార్పు' పరిమితి లేనిదని, అది అనంతమని, ఈ క్రమంలో కొన్ని ఉద్యోగాలు అదృశ్యమైపోతాయనీ అన్నారు. సర్జరీల్లో పాల్గొనడం సహా ఆరోగ్య రంగంలో రోబోలు ప్రధానపాత్ర నిర్వహిస్తున్నాయి. తక్కువ ఖర్చుతో ఆర్టిఫీషియల్ ఇంటెలిజన్స్ ప్రత్యామ్నాయంగా వచ్చే అవకాశం 83 శాతం మేరకు ఉన్నట్టు White House's Council of Economic Advisors (CEA) అన్నారు.

నవ్య

## పుస్తక సమీక్ష



### సత్యంవైపు పయనం

మునిమడుగుల రాజారావు

**ధర:** 60 రూపాయలు

**పేజీలు:** 96

**ప్రతులకు:** పాలపిట్ట బుక్స్, సలీమ్‌నగర్, మలక్‌పేట, హైదరాబాద్–36

ఫోన్: 040–27678430

తత్వశాస్త్రాలు అధ్యయనం చేసి మనిషి అస్తిత్వంపై విలక్షణ ఆలోచనలతో రాజారావు రాసిన పదిహేడు వ్యాసాలివి. జాగరూకత, జ్ఞాపకం, ఆలోచన, భయం, అహంకారం, బాధావిముక్తి, ఉనికి, సత్యంవైపు ఆలోచన వంటి అనేక అంశాల్లో మనల్ని మనం సరికొత్తగా దర్శించుకుని, కొత్తగా బతకడానికి దోహదపడే తాత్విక వ్యాసాలివి.

---

### అమ్మమ్మే గోదావరి

కథా సంకలనం

యర్రమిల్లి విజయలక్ష్మి, సూర్యనారాయణ మూర్తి, ప్రభాకరరావు

**ధర:** 120 రూపాయలు, **పేజీలు:** 160

**ప్రతులకు:** నవోదయ బుక్ హౌస్, కాచిగూడ క్రాస్‌రోడ్స్, హైదరాబాద్–27

మొబైల్: 9000413413



కుటుంబ వారసత్వంగా కథారచయితలైన తోబుట్టువులు ఈ ముగ్గురు రచయితలూ. ఈ కథా సంకలనం టైటిల్ పెట్టింది బాపూ కావడం విశేషం. వీరిలో విజయలక్ష్మి నాలుగు దశాబ్దాలుగా 200 కథలు, 15 నవలలు రాశారు. మానవ జీవన వైచిత్రి, చారిత్రక సంస్కృతిని చాటే విజయలక్ష్మి కథలు ఎనిమిది, సామాజిక రుగ్మతల్ని చిత్రించిన సూర్యనారాయణ మూర్తి కథలు ఎనిమిది, హృదయోద్వేగాల్ని మథించే మరో ఎనిమిది ప్రభాకరరావు కథలు ఇందులో ఉన్నాయి.

---



### కాగుతున్న రుతువు

కె.క్యూబ్ వర్మ

**ధర:** 80 రూపాయలు

**పేజీలు:** 174

**ప్రతులకు:** అన్ని ప్రముఖ పుస్తక దుకాణాలు మరియు కె.కె.కె. వర్మ, 11–3–11, కె.పి.ఎం. హైస్కూలు వద్ద, పార్వతీపురం –01

ఫోన్: 94 93 43 62 77

కొత్త తరం కవి కె.క్యూబ్ వర్మ. ఏదో ఒకటి రాసేయాలనే మనస్తత్వం కాదు. ప్రకృతిని కాపాడుకోవాలనే తపన కనిపిస్తుంది. మనకు తెలియనిదాన్నీ, ఒక కొత్తదనాన్నీ, కొత్త ఆలోచనల్నీ, కొత్త జ్ఞానాన్నీ ఆవిష్కరించే ఈ తరం కవితలే ఇవన్నీ.

---

### రేగడి నీడల్లా

కొంగనాడు కతలు

మార్టూరి సంజనా పద్మం

**ధర:** 100 రూపాయలు

**పేజీలు:** 132

**ప్రతులకు:** ఎం.వి.వసంత్‌నాయుడు, నెం 7, సాయిరామ్ లేఅవుట్, ధాలిరోడ్, ఉడుమలపేట, తిరుప్పు జిల్లా, తమిళనాడు.

మొబైల్: 91–9442627001




ఏడవ తరగతి విద్యార్థిని మార్టూరి సంజనా పద్మ. బళ్ళో తెలుగు లేకపోయినా సొంతంగా తెలుగు నేర్చుకుని రేగడి నేలల్లో బతుకుతున్న తెలుగు వారి జీవితాలను ఈ కథల్లో నిక్షిప్తం చేసిందీ బాలిక. తమిళనాడు లోతట్టు ప్రాంత మాండలికంలో రాసిన పదహారు కొంగనాడు కథలివి.

---



### కలువకుంట్ల కథలు

కథా సంపుటి

కలువకుంట్ల గురునాథ పిళ్ళై

**ధర:** 70 రూపాయలు

**పేజీలు:** 110

**ప్రతులకు:** అన్ని పుస్తక కేంద్రాలు

ఆరుపదుల వయసులో కలంసేద్యం ప్రారంభించిన రాయలసీమ మదనపల్లె రచయిత గురునాథపిళ్ళై. ఎన్నో కవితలూ, కథలూ, పద్యాలూ వెలువరించారు. డెబ్బైఅయిదేళ్ళ వయసులో వెలువడిన ఆయన 15 కథల తొలి సంపుటిది. ఈయన కథల్లో ప్రాంతీయత, నైతికత, మానసిక స్థిరత్వం ఆవశ్యకత వంటి అంశాలెన్నో కనిపిస్తాయి.

–లలితా త్రిపురసుందరి




**తెల్లారి ఆఫీసుకు వెళ్ళేసరికి, ఆఫీసులో అభిషేకం గారొక్కరే ఉన్నారు. ఆయన కూడా చాలా సీరియస్‌గా ఉన్నారు.**

**"ఏమైంది సార్?" అడిగాను.**

**"నవీన్‌ను, ఆ డైరెక్టర్‌ను కోర్టు ముందు ప్రవేశపెడితే, కోర్టు వాళ్ళిద్దరినీ జ్యుడీషియల్ రిమాండుకు పంపింది సార్! వాళ్ళిద్దరినీ చంచల్‌గూడా జైలుకు తరలించారు సార్! టాలీవుడ్ అంతా భగ్గుమంది సార్! నిన్నంతా ఒకటే మీటింగులు. రకరకాల అసోసియేషన్ల వాళ్ళు మీటింగులు పెట్టుకున్నారు. మన ప్రొడ్యూసరే దగ్గరుండి రెండు మూడు మీటింగులు నడిపించాడు. రాత్రి న్యూస్ ఏమిటంటే మిమ్మల్ని డైరెక్టర్స్ యూనియన్ నుండి బర్తరఫ్ చేయాలని అనుకుంటున్నారు సార్! యూనియన్ జనరల్‌బాడీ మీటింగు పెట్టి, మిమ్మల్ని బహిష్కరించాలని ప్రపోజల్ పెడుతున్నారు సార్!" అన్నాడు బాధగా.**

నేను కుర్చీలో కూలబడిపోయాను.

"సరే కానివ్వండి! నేను కూడా జనరల్‌బాడీ మీటింగులో నా వెర్షన్ వినిపిస్తాను" అన్నాను నిశ్చయంగా.

కానీ, మనసంతా చేదుమాత్ర తిన్నట్టుగా అయింది. నిన్నటి తీపిరుచి నాలుకమీద నుంచి ఇంకా పూర్తిగా పోకుండానే, ఈ గరళాన్ని రుచి చూడాల్సి వస్తోంది. తప్పు చేసింది అతను. దానికి నేను నింద మోయాల్సి రావడం, సంజాయిషీ ఇవ్వవలసిన అగత్యం ఏర్పడడం నాకే చికాకుగా అన్పించసాగింది.

అభిషేకం గారు కూడా ఆలోచనల్లో మునిగిపోయారు. కాసేపటికి తలెత్తి,

"అంతే సార్! మనం ఫైట్ చేద్దాం. జనరల్‌బాడీ మీటింగులో తీసుకునే నిర్ణయం కాబట్టి అంత ఈజీ కాదు. మొత్తం మెంబర్స్ అంతా వస్తారు. అక్కడే ఆ డైరెక్టర్ నిర్వాకాన్ని ఎండగట్టి, ఓటింగ్ పెట్టమని అడుగుదాం. నాకు తెలిసిన మిత్రులు చాలామందే ఉన్నారు. మీ ఫ్రెండ్స్ కూడా ఉన్నారు. ఎలాగూ ఇప్పుడున్న అధికార ప్యానెల్‌కు వ్యతిరేక వర్గం ఒకటి ఉండనే ఉంటుంది. మీకు ఆరోజు మైకు ఇప్పించే బాధ్యత నాది. మీరు మాత్రం జరిగింది జరిగినట్టు ఢంకా బజాయించి చెప్పండి. మన మెంబర్లలో యూత్ సభ్యులందరికీ మీరంటే అభిమానం సార్! చూద్దాం, ఏం జరుగుతుందో? అయినా ఈ యూనియన్లో మెంబరు అయినంత మాత్రాన మనకేం ఒరగపెడ్తున్నారు సార్?" అన్నాడు.

ఆ మాత్రం ధైర్యం, ఓదార్పు ఇచ్చినందుకు అభిషేకం గారి వైపు కృతజ్ఞతగా చూశాను.

కొంచెం మనసు తేలికయింది. ఇద్దరం బయట కెళ్ళి గణపతి కాంప్లెక్సులో బడ్డీ ముందర నిలబడి టీ తాగి వచ్చాము. లోపలికి రావడంతోనే అభిషేకం గారి ఫోన్ మోగింది. ఆయన స్క్రీన్ మీద పేరు చూసి, నాతో,

"మన ప్రొడ్యూసర్! ఏం చెప్పమంటారు?" అడిగాడు లోగొంతుకలో.

"ముందు మాట్లాడండి, ఏమంటాడో కనుక్కోండి?" అన్నాను.

"హలో! నమస్కారం సార్!"

"............."

"సార్! మీరున్నారా అని అడుగుతున్నారు. లేరని చెప్పనా!" అన్నారు అభిషేకం గారు నాతో, ఫోన్ దూరంగా జరిపి.

నేను కూడా అలాగే చెప్పమని చెప్దామనుకున్నాను. కానీ, ఏదో ఒకటి, ఎంత తొందరగా వీలయితే అంత



తొందరగా తేల్చుకుంటే మంచిది. ఐటీ రైడ్ చేయించి నప్పటి నుంచి అతనంటే నా మనసు కూడా ఉడికి పోతోంది.

"లేదు. ఆఫీసులోనే ఉన్నానని, ఆఫీసులోనే ఉంటానని చెప్పండి" అన్నాను.

అభిషేకం గారు ఏదో చెప్పబోయారు. నేను అతణ్ణి వారించి ఫోన్ మాట్లాడమని చెప్పాను.

****

ఒక్క గంటలో ప్రొడ్యూసర్‌తో పాటు ఓ ఐదారు గురు మా ఆఫీసుకొచ్చారు. వారిలో ఓ ఇద్దరు నిర్మాతలు మరో ఇద్దరు బౌన్సర్లు ఉన్నారు. అందరూ చూడ్డానికి బాగా బలిసిన పోట్లగిత్తల్లా ఉన్నారు.

అతను నన్ను పిలిచేవరకు వెళ్ళకూడదని నిర్ణ యించుకుని నేను నా రూములోనే కూర్చున్నాను. వాళ్ళంతా హాల్లో కూర్చోవడానికి కుర్చీలన్నింటినీ బర్రు బర్రుమని లాగుతూ, అరుస్తూ హంగామా చేయడం నేను సీసీ టీవీల్లో గమనిస్తూనే ఉన్నాను. బిగ్గరగా మాట్లాడుతూ, అరుస్తూ కేకలు వేస్తు న్నారు. కొంతమంది సీనియర్ నటులు మాత్రం నలుగురిలో మాట్లాడేటప్పుడు కొంచెం సంస్కార వంతంగా మాట్లాడుతారు. ప్రొడ్యూసర్లకు ఆ మాత్రం సంస్కారం కూడా అవసరం లేదన్నట్లుగా మాట్లాడుతుంటారు. కొత్తవాళ్ళ ముందు కూడా వాళ్ళ నోళ్ళ నుండి బూతులు ప్రవహిస్తుంటాయి. ఇప్పుడు కూడా అదే బూతు పురాణ శ్రవణం జరుగు తోంది. "అది ఇట్లాంటిది, అది వాడి దగ్గర పడు కుంది, ఇది వీడి దగ్గర పడుకుంది, మొగుడే దగ్గ రుండి పక్కలు పరుస్తాడు" వంటి మాటలు విన లేక నేను సీసీ టీవీలో సౌండ్ మ్యూట్ చేశాను.

ఈ తతంగమంతా నన్ను సైకలాజికల్‌గా బల హీనం చేసే ప్రయత్నమని నాకు తెలుసు. కానీ, ఇట్లాంటి తాటాకు చప్పుళ్ళకు జడవకూడదని, ఎటు వంటి పరిస్థితినైనా ఎదుర్కోవడానికి నేను సిద్ధంగా ఉన్నాను. ఈ రోజు అమీ తుమీ తేల్చుకోవాల్సిందే నని నేను కూడా ఫిక్స్ అయ్యాను.

నన్ను దెబ్బకొట్టాలని కాకపోతే, ఎంత బుద్ధిహీను డైతే మాత్రం తన సొంత కంపెనీ మీద తనే ఐటీ రెయిడ్ చేయించుకుంటాడు? అంటే, నా మీద అంత ద్వేషం పెంచుకున్నవాడి ముఖం చూడాలం టేనే నాకు జుగుప్సగా ఉంది.

"వీడొక క్యారెక్టర్‌లెస్ ఫెలో! అందితే జుట్టూ, అందకపోతే కాళ్ళూ పట్టుకునే రకం" అనుకుని, 'ఏంచేస్తాడో' అని వేచి చూస్తున్నాను.

బాయ్‌ని పిలిచి కాఫీలు, స్నాక్స్ తెప్పించుకుని తిన్నారు.

## జరిగిన కథ

*ఆస్కార్ అవార్డుల పోటీల్లో అతడి చిత్రం ఎంపికయిన సందర్భంగా అమెరికా వెళుతూ, గతం గుర్తుచేసుకున్నాడు ఆ తెలుగు దర్శకుడు. డీసీపీ పుష్పాకిరణ్ సహాయంతో సినిమా నిర్మించేందుకు సిద్ధమవుతాడు. హీరోయిన్ శ్రావణిని ప్రేమిస్తాడు. తన గతాన్ని చెప్పి, దర్శకుడికి దూరంగా వెళ్ళిపో తుంది శ్రావణి. డైరెక్టర్ ఇంట్లో హార్డ్‌డిస్క్ దొంగిలిం చిందన్న నెపంతో శ్రావణిని అరెస్ట్ చేస్తారు. డీసీపీ మేడం శ్రావణికి బెయిల్ ఇచ్చి, డైరెక్టర్ ఇంటికి తీసు కువస్తుంది. ఆమెని పెళ్ళి చేసుకోవాలనుకుంటాడు దర్శకుడు. తన ఆఫీసుపై ఐటీ రెయిడ్ జరగటంతో, చకచకా ఆర్థిక లావాదేవీలన్నీ చక్కబెట్టేస్తాడు దర్శ కుడు. పోలీస్‌స్టేషన్‌కి వెళ్ళి హార్డ్‌డిస్క్ చోరీ వెనుక ఉన్నవారిని కలుసుకుంటాడు. తరువాత శ్రావణిని తీసుకుని జ్యూయలరీ షాపుకి వెళ్ళి శ్రావణికి, తల్లికి నగలు కొంటాడు. జ్యూయలరీ షాపు యాడ్ క్యాంపెయిన్‌కి ఒప్పుకుంటారు. తర్వాత ఇద్దరూ కలిసి దర్శకుడి ఊరు వెళతారు. తల్లిదండ్రులకు శ్రావణిని కోడలుగా పరిచయం చేసి, తిరిగి హైద రాబాద్ వస్తారు. ఆ తర్వాత.....*



అలా గంటసేపు వాగీవాగీ, తర్వాత నన్ను పిలిచారు. నేను వెళ్ళలేదు. వాళ్ళందరి ముందు నన్ను దోషిలా నిలబెట్టి సరదా తీర్చుకుందామనుకున్నట్టుంది. అతణ్ణే లోపలికి రమ్మన్నాను. నా సమాధానం విని అటెండర్ మీద రంకెలు వేయడం నాకు కనిపిస్తూనే ఉంది.

రెండు నిమిషాల తర్వాత, నా రూములోకి వచ్చాడు.

నేను లేచి నిలబడి, "నమస్కారం సార్!" అన్నాను.

"ఊc, ఊc" అంటూ నా ఎదురుగా ఉన్న సీట్లలో కూర్చున్నాడు.

నేనే ముందుగా అటాక్ చేస్తే, అతను డిఫెన్సులో పడతాడనే ఉద్దేశంతో, "ఇన్‌కంటాక్స్ రెయిడ్ ఎందుకు చేయించారు?" అడిగాను.

నిజం నాకు తెలిసిపోయిందని, ప్రొడ్యూసర్ ఖంగు తిన్నాడు. "బ్బెబ్బె" అంటూ నీళ్ళు నమిలాడు.

"నాకు తెలుసు!" అన్నాను. కావాలనే 'సార్' అనలేదు. ఇక ఎప్పుడూ అతన్ని అలా సంబోధించను కూడా! మర్యాదకు అనర్హుడు వాడు.

"నువ్వే నీ కంపెనీ మీదే ఐటీ రెయిడ్ చేయిస్తే, అందులో ఏమైనా లొసుగులుంటే లోపలికి పోయేది కూడా నువ్వేనన్న మినిమం జ్ఞానం కూడా లేదా నీకు?" ఆగ్రహోదగ్రుణ్ణై గర్జించాను.

నా అరుపులు విని బయట అరుస్తున్న వాళ్ళ నోళ్లు మూతలు పడ్డాయి. గోల సద్దుమణిగింది. అభిషేకం గారు లోపలికి పరిగెత్తుకొచ్చారు.

ప్రొడ్యూసర్ ఇబ్బందిగా కదిలాడు. పరిస్థితి తారుమారయ్యేసరికి కంగారుపడ్డాడు. నన్నేదో చేయాలని వస్తే నేనే తిరగబడడం చూసి బిత్తరపోయాడు. ఓ నలుగురిని వెనకేసుకొచ్చి నన్ను బెదిరించాలనుకున్నాడు. కానీ, నేను ఎదురు తిరిగేసరికి ముందు కన్ఫ్యూజ్ అయ్యాడు.

తర్వాత తేరుకుని, తమాయించుకుని,

"నాకేం సంబంధం లేదు" అన్నాడు తెచ్చిపెట్టుకున్న బింకంతో.

"చెప్పు తీసుకుని తంతా! మరి మనమీద కంప్లయింట్ చేసిన వాడెవడో తెలిస్తే ఆ బాస్టర్డ్ పళ్ళు రాలగొట్టాలి. బ్లడీ బాస్టర్డ్స్..." అరిచాను.

ప్రొడ్యూసర్ కిక్కురుమనకుండా కూర్చున్నాడు. రెండు నిమిషాలకు నేనే శాంతించి,

"చెప్పు, ఎందుకు ఫోన్ చేశావ్? నేను ఆఫీసులో ఉన్నానా లేదా అని అభిషేకం గారికి ఫోన్ చేశావట, ఎందుకు?" ప్రశ్నించాను గట్టిగా.

ప్రొడ్యూసర్ అయోమయంగా చూశాడు. తర్వాత,

"ఆc! అదే, నువ్వు ఆ పోలీస్ కేసు వాపస్ తీసుకోకపోతే, మన బ్యానరును బ్యాన్ చేస్తామని కౌన్సిల్ వాళ్ళు అంటున్నారు. ఈ గొడవలన్నీ మన కెందుకు? కేసు వాపసు తీసుకోమని నిన్ను రిక్వెస్టు చేద్దామని ఫోన్ చేశాను. కేసు వాపసు తీసుకోండి సార్!" అన్నాడు బింకంగా.

"కేసు వాపసు తీసుకునే ప్రసక్తే లేదు!" అన్నాను నిశ్చయంగా.

"ఎందుకు తీసుకోవు? నువ్వు కేసు వాపసు తీసుకోకుంటే నాకు కోట్లకు కోట్లు నష్టం వస్తుంది."

"మీకెందుకు నష్టం వస్తుంది? మీ సినిమా ఆగిపోవడం లేదు కదా? పోలీసు కేసుకు, మీకు ఏంటి సంబంధం? వాడెవడో జైలుకు పోతే మీకేం నష్టం?" అన్నాను.

"నీకు టాలీవుడ్ సంగతి తెలియదయ్యా! ఇక్కడ అందరం కలిసి మెలిసి పని చేసుకోవాలి. ఆ డైరెక్టర్ జైలుకు పోతే, వాడు దర్శకత్వం వహిస్తున్న సినిమా ప్రొడ్యూసర్ నిండా మునుగుతాడు. వాడు మునిగితే వాడికి ఫైనాన్స్ చేసిన వాళ్ళు దివాళా తీస్తారు. ఇలా ఒకదానికొకటి లింక్ ఉంటుంది. ఆ ఫైనాన్షియర్లలో కొందరు డిస్ట్రిబ్యూటర్లు ఉన్నారు. వాళ్ళకు ఇబ్బంది కలిగితే, నా సినిమాలకు థియేటర్లు దొరకవు. నీ సినిమాను బయటకే రానీయరు. మీరు పిల్లలు, అర్థం చేసుకోవాలయ్యా!" అన్నాడు.

"మరి ఏదైనా పాడుపని చేసేముందు, ఒకరి జీవితాన్ని నాశనం చేసేముందు కూడా ఆ డైరెక్టర్ ఈ విషయాలన్నీ ఆలోచించాలి కదా? మనం చేసే పాడుపని బయటపడితే తనూ, తనతో పాటు తన నిర్మాత, మీరన్నట్టుగా ఇంకా ఎందరో మునుగుతారనే విచక్షణ జ్ఞానం తప్పుపని చేసిన వాడికే లేనిది, నాకెందుకుండాలి. వాడివల్ల అష్టకష్టాలు పడింది మేము. నరకయాతన అనుభవించింది శ్రావణి. హార్డ్ డిస్కు పోయిందనగానే, ఎన్నడూ

**టాలీవుడ్ సంగతి నీకు తెలియదు. ఇక్కడ అందరూ కలిసిమెలిసి పనిచేసుకోవాలి. నువ్వు కేసు వాపసు తీసుకోవాల్సిందేనంటూ బెదిరించాడు నిర్మాత. ఒప్పుకోలేదు దర్శకుడు. ఓ ఐదుగురు రౌడీలను వెంటబెట్టుకుని ఆఫీసుకొచ్చి గొడవ చేశాడు. అదీ వర్కవుట్ కాలేదు. బ్యాంకుకి వెళ్ళి బ్యానర్ ఎకౌంట్ సీజ్ చేయటానికి ప్రయత్నించాడు. అప్పుడు దర్శకుడు ఏంచేశాడు?**

ఆఫీసు ముఖం చూడని వాడివి, ఆఘమేఘాలమీద వచ్చి పోలీస్ కేసు పెట్టిందెవరు? నువ్వు కాదా? మరి నువ్వే పోలీసు కేసు పెట్టి, తప్పు నావల్ల జరగలేదు కాబట్టి, అది మరిచిపోయి, నువ్వు పెట్టిన కేసులో నీ వాళ్ళు ఇరుక్కునేసరికి ఇప్పుడు కేసు విత్‌డ్రా చేసుకోవాలా? వాడికి వీలైతే మరణశిక్ష వేయాలి. వాడు చేసిన పనికి అది కూడా తక్కువే తెల్సా?" అని ప్రొడ్యూసర్ ముఖంలో ముఖం పెట్టి ప్రశ్నించాను.

"అరే ఏంటయ్యా! వందమంది దగ్గర పండుకున్న దాని గురించి మాట్లాడుతున్నావ్? అదేం పెద్ద పతివ్రతా? దాని మొత్తం హిస్టరీ నాకు తెలుసు. దానిదీ, దాని తల్లిదీ... మెరకువీధి భాగోతమంతా నాకు తెలుసు. వీళ్ళ కులవృత్తి అదే కదా? అట్లాంటి దానికోసం కోట్లకొద్దీ రూపాయల నష్టాన్ని భరించాలంటావా ఏంటీ?" అన్నాడు చాలా క్యాజువల్‌గా.

నాకు కోపం నసాళానికి ఎక్కింది. ఒంట్లోని అణువణువూ మరిగి పోసాగింది. శరీరంలోని రక్తమంతా పరుగుపరుగున కళ్ళల్లోకి చేరింది. ప్రళయకాల రుద్రుడిలా, ఉద్రేకంతో ఊగిపోతూ, నా సీట్లోంచి లంఘించి, ప్రొడ్యూసర్ మీదకు దూకి వాడి కాలర్ పట్టుకున్నాను.

వాడు, "ఏయ్ ఏయ్!" అని అరవసాగాడు. నేను వాణ్ణి కుర్చీలో నుంచి లేపి బయటకు లాక్కొని వచ్చి, ఈడ్చి కింద పడేశాను. వాడితోపాటు వచ్చిన ఐదుగురి మధ్యలో పడ్డాడు.

"నా కొడకా! శ్రావణి గురించి ఇంకొక్క మాట మాట్లాడితే నాలుక కోస్తా!" అంటూ ఏదయినా కత్తి లాంటి పదునైన వస్తువు దొరుకుతుందా అని అటూ ఇటూ చూసి నా ఆఫీస్ టేబుల్ మీద ఉన్న పదునైన లెటర్ ఓపెనర్ తీసుకొచ్చి పొడవబోయాను. ఇంతలో అభిషేకం గారు నన్ను పట్టుకున్నారు. ప్రొడ్యూసర్‌తో వచ్చినవాళ్ళు అతణ్ణి కింద నుండి లేపారు.

"నా కొడకా! డబ్బుమదంతో పందిలా బలిసిన నీకు మనుషుల విలువేం తెలుస్తుంది రా! రోజుకో మురికి గుంటలో దొర్లే పందివి నువ్వు. నువ్వు శ్రావణి గురించి మాట్లాడతావా? శ్రావణి దేవతరా! నా దేవత! తన గురించి ఒక్క చెడ్డ మాట నోరు జారావో, నా కొడకా నాకీ సినిమా వద్దు ఏమొద్దు. నిన్ను చంపి జైలుకు పోతా! ఛల్ బయటకు నడువ్!



అంటూ వాణ్ణి బయటకు తోశాను.

ఎప్పుడూ ప్రశాంతంగా ఉండే మా అపార్ట్‌మెంట్ నా అరుపులతో దద్దరిల్లింది. అన్ని సినిమా ఆఫీసుల వాళ్ళు బయటకొచ్చి చూస్తున్నారు. మా ఆఫీసుకు వచ్చి కొందరు తొంగి చూడసాగారు.

వాళ్ళందరి ముందు ప్రొడ్యూసరుకు తలకొట్టేసినట్టయింది. ముందు భయపడ్డా చుట్టూ తన వాళ్ళను చూసుకుని, తమాయించుకుని,

"నువ్వేంట్రా నన్ను పొమ్మనేది? ఇది నా ఆఫీసు. ఇది నా బ్యానర్! నువ్వే బయటకు నడువ్!" అంటూ లోపలికి రాబోయాడు.

నేను తలుపుకు అడ్డంగా నిలబడి, పకపకమని నవ్వి,

"ఒక్కసారైనా బుర్ర ఉపయోగించరా! ఫ్లాట్ లీజ్ నా పేరు మీద ఉంది. ఇంకో మూడు నెల్ల వరకు ఇది నాదే. తర్వాత నువ్వు కాళ్ళు పట్టుకుని బతిమిలాడినా ఇక్కడ ఉండను. ఈ బ్యానర్ కూడా నాదే. కౌన్సిల్లో నా పేరు మీదనే రిజిస్టర్ అయింది. వెళ్ళి నీ కౌన్సిల్ ఫ్రెండ్సును అడిగి తెలుసుకో. మళ్ళీ ఒకసారి చెప్తున్నా! కేసు వాపసు తీసుకునే సమస్యే లేదు. నువ్వు ఇప్పుడు ఇంతమందితో కలిసి నా మీదకు దాడికి వచ్చిన దృశ్యాలు, నాతో మాట్లాడిన మాటలన్నీ రికార్డ్ అయ్యాయి. నువ్వు ఇంకో క్షణం ఇక్కడున్నా, మరోసారి కేసు గురించి మాట్లాడినా, ఇదంతా పోలీస్‌స్టేషన్‌లో ఇస్తాను. అప్పుడు నువ్వు కూడా ఆ డైరెక్టరుతో కలిసి జైల్లో కూర్చుని 'జైలు పక్షులు' అనే సినిమాకు స్క్రిప్ట్ రాసుకోవాల్సిందే! గెటౌట్ ఫ్రం మై ఆఫీస్!" అని అరిచాను.

"చూస్తా! నీ సంగతి చూస్తా!" అంటూ వాళ్ళందరూ వెళ్ళిపోయారు.

అంత గొడవ జరిగినా నాకు చాలా సంతోషంగా ఉంది. ఎన్నాళ్ళుగానో మనసులో పేరుకుపోయిన కసి అంతా కరిగి పోయినట్టయింది. సినిమా మొదలు కావడానికి మొదట్లో నన్ను ఆరు నెలల పాటు పిచ్చికుక్కలా తిప్పి, నన్ను పురుగులా ట్రీట్ చేసిన విషయాలన్నీ నేను మర్చిపోలేదు. ఈనాటితో వాటన్నింటికీ స్వస్తి పలకొచ్చునని మనసులో అనుకున్నాను.

శ్రావణికి అన్యాయం చేయాలని చూసిన ఎవణ్ణో ఒకణ్ణి పట్టుకుని జాడించి పారేసినందుకు ఆనందంగా ఉంది.

నేనంత వయొలెంటుగా రియాక్టవుతానని ఆ ప్రొడ్యూసరు ఊహించలేదనుకుంటా. అభిషేకం గారయితే నిశ్చేష్టులై పోయారు.

వాళ్ళందరూ ఏమో గానీ, అసలు నా లోపల అంత కసి, కోపం, ఆక్రోశం గూడుకట్టుకుని ఉన్నాయని నేనే ఊహించలేదు. ఇప్పుడు అవన్నీ బయటపడి మనసు ప్రశాంతంగా ఉంది.

భయంభయంగా చూస్తున్న అభిషేకం గారిని చూసి నవ్వాను. అటెండర్‌ను పిలిచి కాఫీ తెమ్మన్నాను.

ఆ గొడవలో చూసుకోలేదు గానీ నా చొక్కా రెండు మూడు చోట్ల చిరిగిపోయింది. దాన్ని విప్పి కప్‌బోర్డులో నుంచి మరో చొక్కా తీసుకుని వేసుకున్నాను.

అయితే, ఈ విషయం ఇంతటితో ఆగదని నాకు తెలుసు. దీనికి తప్పక ప్రతీకారచర్య ఉంటుందని నా సిక్త్స్‌సెన్స్ చెబుతూనే ఉంది.

దానిక్కూడా ఎక్కువ టైం పట్టనే లేదు.

ఓ గంట తర్వాత బ్యాంక్ మేనేజర్ నుండి ఫోన్ రానే వచ్చింది.

"సార్! మీ ప్రొడ్యూసర్‌గారు బ్యాంకుకు వచ్చి నా ముందు కూర్చుని ఉన్నారు. మీరు మీ బ్యానరు పేరు మీద ఉన్న బ్యాంక్ కరెంట్ అకౌంట్ ఆపరేట్ చేయకూడదనీ, మీ సిగ్నేచర్ చెల్లదనీ లెటర్ ఇచ్చారు సార్!" అని చెప్పాడు.

నేను ఫక్కుమని నవ్వాను.

"ప్రొడ్యూసరుకు డబ్బులున్నాయి గానీ, బుర్ర లేదు సార్!" అని ఆగాను.

"అంటే?" ప్రశ్నించాడు బ్యాంక్ మేనేజర్.

"సార్! వాడంటే ఇల్లిటరేట్ ఫెల్లో! వాడి మాటలు మీరు ఎట్లా పట్టించుకుంటారు సార్! ఆ కరెంట్ అకౌంట్ ఎవరి పేరు మీద ఉంది?" అడిగాను.

"బ్యానర్ పేరు మీద!"

"ఆ బ్యానరు ఎవరిది?"

"మీది!"

"మరి నా బ్యానర్ పేరు మీదున్న బ్యాంక్ అకౌంటును ఆపరేట్ చేయకూడదని ఎవడో కోన్కిస్కాగాడు చెబితే, పూర్తిగా చెక్ చేసుకోకుండా మీరు ఆ లెటర్ తీసుకోవడం, నాకు ఫోన్ చేయడం ఏమిటి సార్! అంతా రిడిక్యులస్‌గా అనిపించడం లేదా మీకు?" గద్దించాను.

"కానీ.. కానీ..." అంటూ బ్యాంకు మేనేజరు నీళ్ళు నమిలాడు.

"చెప్పండి!" అన్నాను.

బ్యాంకు మేనేజరు నేనడిగిన ప్రశ్ననే ప్రొడ్యూసరును అడిగి,

"మీ అకౌంట్లో డబ్బులు తనే డిపాజిట్ చేశానంటున్నాడు" సమాధానం చెప్పాడు.

అతని వాదన బలహీనంగా ఉందని అతనికి అర్థమైనట్టుంది. కానీ, అవతలి వ్యక్తిని శాటిస్‌ఫై చేయడానికి నాతో మాట్లాడుతున్నాడని నాకర్థమైంది. ఎందుకంటే ప్రొడ్యూసర్ చెప్పింది నిజమే! అతనికి ఆ బ్యాంకులో చాలా అకౌంట్లు, వాటిలో చాలా డిపాజిట్లు ఉన్నాయి. అతని అకౌంటులో నుంచే మా బ్యానర్ అకౌంటులోకి డబ్బులు ట్రాన్స్ఫర్ చేశాడన్నది కూడా నిజమే. అయితే ఒకసారి నా అకౌంట్లో జమ అయినాసరే దానిమీద ప్రొడ్యూసరుకు ఏ అధికారం ఉండదని బ్యాంకు మేనేజరుకు కూడా తెలుసు. కానీ, హై వాల్యూడ్ కస్టమర్లతో డీల్ చేసేటప్పుడు కొంచెం జాగ్రత్తగా ఉండాలి కాబట్టి నాతో అలా మాట్లాడుతున్నాడని

## అమలాపాల్‌కి పిచ్చి పట్టిందా?



అవుననే అంటున్నారు సినీ జనాలు. ఎంతగానో ప్రేమించి పెళ్ళిచేసుకున్న భర్తతో ముచ్చటగా మూడు సంవత్సరాలు కలిసి ఉండకుండానే విడాకుల కోసం కోర్టు మెట్లు ఎక్కింది. అది కూడా భర్తతో విభేదాలు కాకుండా అత్తింటి వారితో సరిపడడం లేదని కారణాలు చూపించింది. అవన్నీ ఓకే అనుకున్నా, ఇప్పుడు యోగా పేరుతో బుద్ధుడిని అవమానించింది అంటూ ఆమె అభిమానులే కాదు, మిగతా వారు కూడా ఆమె మీద యుద్ధానికి సన్నద్ధం అవుతున్నారు. ఇంతకీ అసలు సంగతేమిటంటే....బుద్ధుడి ముఖం మీద కాలు పెట్టి యోగా చేస్తున్నట్టు ఫోజు ఇచ్చింది. ఆ ఫోటో ఓ గోడకు ఉంది. బ్యాలెన్స్ కోసం గోడకి కాలు ఆన్చింది అనుకున్నా బుద్ధుడి ముఖం మీద తప్ప మరెక్కడా ఆమెకు చోటు దొరకలేదా? అంటూ ఆమె మీద మండిపడుతున్నారు. గత వివాదాలతో ఇప్పుడిప్పుడే బయటపడుతూ సినిమాల్లో బిజీ అవుతున్న అమల మెడకి ఈ కొత్త వివాదం కాస్త గట్టిగానే చుట్టుకునేటట్టు ఉంది అంటున్నారు సినీ జనాలు. ఏది ఏమైనా ఒక పని చేసే ముందు కాస్త వెనుకా ముందూ ఆలోచించి చేస్తే మంచిదని ఆమె సన్నిహితులు సైతం అమలకు సలహా ఇస్తున్నారట!

నాకు అర్థమైంది. అందుకే,

"ఆc చేస్తే" ప్రశ్నించాను.

బ్యాంకు మేనేజర్ మౌనం వహించాడు.

రెండు నిమిషాల తర్వాత "సారీ సర్! లీగల్‌గా అతనికి బ్యానర్ బ్యాంకు అకౌంటు మీద ఎలాంటి హక్కూ లేదు. నేనే ఫ్యాక్ట్స్ వెరిఫై చేసుకోకుండా మీకు ఫోన్ చేశాను. సారీ!" అన్నాడు.

"ఇట్స్ ఓకే!" అన్నాను.

మా సంభాషణ పూర్తయినా ఫోన్ కట్ కాలేదు. ఇంకా ఏమైనా మాట్లాడతాడేమోనని వెయిట్ చేస్తుంటే,

"సారీ సార్! మీరు చెప్పింది నిజమే అయినా, లీగల్‌గా మేమేం చేయలేం సార్!" అన్న మాటలు నాకు ఫోన్లో వినిపించాయి. ఆ మాటలు ప్రొడ్యూసరుకు చెప్పినట్టుంది. ప్రొడ్యూసర్ దానికి సమాధానంగా ఏదో అరుస్తూ వెళ్ళిన తర్వాత,

"సార్! సార్! లైన్లో ఉన్నారా?" బ్యాంక్ మేనేజర్ అడిగాడు.

"ఊc!" అన్నాను.

"నేను ప్రొడ్యూసర్‌గారితో చెప్పిన మాటలు మీరు వినాలనే ఫోన్ ఆఫ్ చేయలేదు. మీరు విన్నారా?"

"విన్నాను" అని నేను నవ్వుకున్నాను.

"సార్! ఒక్క మాట. ఇఫ్ యూ డోంట్ మైండ్, ఒక ప్రశ్న అడగనా సార్?" అన్నాడు.

"అయ్యో! ఎంత మాట, తప్పక అడగండి సార్!" అన్నాను. కానీ, అతడేం అడుగుతాడో నేను ముందే ఊహించాను.

"ఆయన బ్యాలెన్స్ ఎంతుందో చెప్పమని అడిగాడు. నేను చెప్పలేదనుకోండి. కానీ, నేను చెక్ చేస్తే అకౌంట్లో యాభై వేలు సం ఛేంజ్ మాత్రమే ఉంది. యాభై వేలకే ఇంత గొడవ ఎందుకు సార్?" అన్నాడు ఆశ్చర్యంగా.

నేను కూడా ముసిముసిగా నవ్వుతూ, "అదే నాకూ తెలియడంలేదండీ! యాభై వేల కోసం ఎందుకంత పట్టుబడుతున్నాడో?" అని ఫోన్ పెట్టేశాను.

నేను ఫోన్ పెట్టేసి ఫక్కున నవ్వాను.

నేను మొన్న ఒక్క రోజే అరవై లక్షల రూపాయలు నెట్ బ్యాంకింగ్ ద్వారా అందరికీ ట్రాన్స్ఫర్ చేసేశాను. నా పర్సనల్ అకౌంట్లోకి ట్రాన్స్ఫర్ చేసిన డబ్బుల నుంచే అమ్మకు, శ్రావణికి నగలు కొనడానికి కొంత మొత్తం డ్రా చేశాను. ఐటీ ఆఫీసర్ గారు, ప్రొడ్యూసరే రెయిడ్ చేయించాడనగానే, ఇట్లాంటిదేదో జరుగుతుందనే మొత్తం అకౌంట్లోని డబ్బులన్నీ ఊడ్చి పడేశాను. లేకపోతే, పోస్ట్ ప్రొడక్షన్ పనులు ఆగిపోయే ప్రమాదముండేది. ఇవాళ, బ్యాంకు మేనేజరుగారు చట్టబద్ధంగా వ్యవహరించారు. అలా కాకుండా ప్రొడ్యూసర్ ఒత్తిడికి లొంగి ఏదో ఒక లీగల్ పాయింట్ సృష్టించి అకౌంట్ సీజ్ చేస్తే, నేను చేయగలిగిందేమీ ఉండేది కాదు. కోర్టులో తేల్చుకోవచ్చు గానీ దానికి ఏళ్ళు పడుతుంది. అందుకే, నేను ముందు జాగ్రత్తగా చేసిన పని వల్ల ప్రొడ్యూసర్ ముఖం మాడిపోయింది.

నాకు చాలా సంతోషంగా ఉంది. నేను కూడా ఎత్తుకు పై ఎత్తు వేయగలనని నమ్మకం కుదిరింది.

ఈ లోకంలో కేవలం మంచిగా ఉంటే సరిపోదు. మంచివాళ్ళను బలహీనులుగా, అసమర్థులుగా, బుద్ధూలుగా జమకట్టే వ్యవస్థలో ఉన్నప్పుడు కొంత లౌక్యం ప్రదర్శించాల్సిందే.




నేను అమాయకంగా ఉండి ఉంటే, పోలీసు కేసు వాపసు తీసుకుని, రోజువారీ ఖర్చులకు, సినిమా పూర్తి చేయడానికి ప్రొడ్యూసర్ ఇంటి ముందు కుక్కలా కాపలా కాయాల్సి వచ్చేది.

ఇప్పుడు నేను రైట్ రాయల్‌గా ఆత్మవిశ్వాసంతో పని చేసుకోగలను. అయినా, ఇందులో నేను ఎవరినీ మోసం చేయలేదు. నా హక్కును నేను కాపాడుకున్నాను. శ్రావణి ఆభిజాత్యాన్ని కాపాడగలిగాను. అందుకే, ఇవ్వాళ్టి సంఘటనల వల్ల నేను గిల్టీగా ఫీల్ కావడం లేదు.

****

టాలీవుడ్ అంతా ఉద్రిక్తంగా ఉంది. ఒక నిశ్శబ్ద ఫర్మానా జారీ చేయబడినట్టుగా నివురుగప్పిన నిప్పులా అయింది. నన్ను ఏ విధంగానైనా ఇరికించి దారిలోకి తెచ్చుకోవాలని చేసిన మూడు ప్రయత్నాలూ బెడిసి కొట్టడంతో మా ప్రొడ్యూసరూ అతని ఫ్రెండ్సూ కలిసి నన్ను డైరెక్టర్ల అసోసియేషన్ నుండి బహిష్కరించాలని కంకణం కట్టుకున్నారు. వారం రోజుల తర్వాత వచ్చే ఆదివారం నాడు షూటింగులు ఉండవు కాబట్టి ఆ రోజు అసాధారణ సర్వసభ్య సమావేశం(Extraordinary General Body Meeting) ఉంటుందని మెసేజ్ వచ్చింది. ఆనాటి మీటింగులో నన్ను అసోసియేషన్ నుండి బహిష్కరించడం ఒక్కటే అజెండా.

ఛానళ్ళు, పేపర్లు ఈ వార్తకు చిలవలు పలవలు కల్పించి మసాలాలు జోడించి టెన్షన్లు, టెంపరు పెంచాయి.

ఒక పెద్ద వ్యవస్థలో అనేక రకాల మనస్తత్వాలున్న వ్యక్తులుంటారు, మా డైరెక్టర్స్ అసోసియేషన్లో కూడా. మాది సృజనాత్మకతకు పెద్ద పీట వేసే విభాగం కాబట్టి, చాలామంది సభ్యులు ఎక్కువగా మీటింగులకు రారు. కానీ, వచ్చినప్పుడు మాత్రం సమావేశాలు రసవత్తరంగా సాగుతాయి. ప్రతీవాళ్ళకి ఒక స్థిరమైన అభిప్రాయం ఉంటుంది. కాబట్టి పై నుంచి ఓ ఉత్తర్వు జారీచేసి అందరూ దాన్నే ఫాలో కావాలంటే మా యూనియన్లో సాధ్య పడదు. అస్సలే ఒప్పుకోరు.

అందుకే, నన్ను బహిష్కరించడమనే ఎజెండాతో మీటింగ్ అనగానే, నాకు అంతవరకు తెలియని అనేకమంది డైరెక్టర్లు, అసోసియేట్, కో, అసిస్టెంట్ డైరెక్టర్లు రోజూ మా ఆఫీసుకు వచ్చి నాకు సానుభూతి తెలిపి, తమ సపోర్ట్ నాకే ఉంటుందని చెప్పి వెళ్తున్నారు. ఇంకో ఆశ్చర్యకరమైన విషయం ఏమిటంటే చాలామంది ప్రొడ్యూసర్లు కూడా ఫోన్ చేసి నాకు అండగా ఉంటామని, తర్వాతి సినిమా తమకే తీసి పెట్టాలని, కానీ ఇప్పుడు మాత్రం వెనుకంజ వేయవద్దని చెప్తున్నారు.

ఆదివారం ఇంకా చాలా దూరం ఉండగానే అనూహ్యంగా నాకు సపోర్ట్ పెరిగింది. కానీ, ఇంకా చాలామంది బహిరంగంగా నాకు సపోర్టుగా రావడానికి సంకోచిస్తున్నారు.

అభిషేకం గారు కూడా నాకు సపోర్ట్ సంపాదించడానికి తన శక్తియుక్తులన్నీ వినియోగిస్తున్నారు.

ఇండియా, పాకిస్థాన్ మధ్య T20 వరల్డ్ కప్ ఫైనల్ మ్యాచ్ జరుగుతున్నంత టెన్షన్ వాతావరణం నెలకొని ఉంది.

**(ఇంకా వుంది)**

## సినీవాలి
### కూపన్ నెం.25 విజేత

**పి. చంద్రిక**
**గాంధీచౌక్, ఖమ్మం**

ఉద్యోగనిర్వహణలో ఉన్నవారికి ఉదయం లేచి కూరగాయలు తరుక్కుని వంట చేసుకునేందుకు తగిన సమయం ఉండదు. అందుకుని చాలామంది సాయంత్రం సమయంలోనే ఆఫీసు నుంచి వచ్చాక ముందే కట్ చేసి పెట్టుకుంటుంటారు. అయితే అలా కట్ చేసిన కూరగాయల్లో కొన్ని రకాలు తాజాగానే ఉన్నా మరికొన్ని మాత్రం పాడవుతుంటాయి. బోలెడు డబ్బులు పోసి కొన్న కూరగాయలు అలా పాడయితే బాధగానే ఉంటుంది. అందుకే కట్ చేసిన కూరగాయలను ఎలా భద్రపర్చుకోవాలో తెలుసుకోండి!



# కూరగాయలను భద్రపర్చుకోండి ఇలా!

కూరగాయలను అన్నింటినీ ఒకే కవర్‌లో వేసి భద్రపరిస్తే అవి పాడవుతుంటాయి. అందుకే వాటిని విడివిడిగా ఫ్రిజ్‌లో పెట్టుకోవాలి. ఎలా అంటే.

### ఆకుకూరలు:

ఆకుకూరలు ఫ్రిజ్‌లో భద్రపర్చడానికి ముందే వాటి ఆకులను కొమ్మల నుంచి వేరుచేయాలి. ఈ విధంగా వేరు చేసిన ఆకుల్లో కూడా ఎండిపోయినవి. వాడిపోయినవి, కుళ్లినట్లు ఉన్నవాటిని వేరుచేసి పక్కకు తీసేయాలి. ఇప్పుడు మిగతా తాజా ఆకుల్ని ఫ్రిజ్‌లో పెట్టొచ్చు. దీనికోసం ఒక పేపర్ టవల్ లేదా పలుచని కాటన్ వస్త్రం తీసుకుని అందులో ఈ ఆకులు వేసి చుట్టేసి ఫ్రిజ్‌లో పెట్టాలి. అయితే ఈ ఆకుకూరలు సాధారణంగా రెండు రోజులు మాత్రమే తాజాగా ఉంటాయి.

### దుంపజాతివైతే

ఆలుగడ్డ, ముల్లంగి, చిలగడదుంప, క్యారెట్ ఇలాంటి కూరగాయల్ని కట్ చేసి ఎక్కువ రోజులు ఫ్రిజ్‌లో పెట్టడం వల్ల అవి మృదుత్వాన్ని కోల్పోతాయి. వాటి రంగు కూడా మారుతుంది. వాటిల్లో ఉండే తేమ శాతం తగ్గిపోవడం వల్ల వాటి రుచి కూడా మారుతుంది. అందుకే ఇలాంటి వాటిని నీరు పోసిన గిన్నెలో వదులుగా మూతపెట్టి భద్రపర్చాలి. కానీ ఇవి ఒకరోజు మాత్రమే తాజాగా ఉంటాయి. అందుకని వీటిని వండే ముందురోజు మాత్రమే కట్ చేసుకోవడం ఉత్తమం.

### క్యాబేజీ, కాలీఫ్లవర్ లాంటివి

క్యాబేజీ వంటి కాయగూరల్ని కట్ చేసిన వెంటనే ఒక ప్లాస్టిక్ కవర్‌లో వేసి ఫ్రిజ్‌లో భద్రపరుచుకోవాలి. కాలీఫ్లవర్, బ్రొకోలీ వంటివాటిని కట్‌చేసినా వాటి తేమ త్వరగా పోదు కాబట్టి వాటిని గాలి తగలని డబ్బాలో వేసి భద్రపరుచుకోవాలి. బ్రొకోలిని ముక్కలుగా చేసిన తర్వాత నెట్‌తోవున్న కవర్స్ పెడితే తాజాగా ఉంటాయి.

### వంకాయలు, ఉల్లిపాయలు

వంకాయలు సాధారణంగా అప్పటికప్పుడే కట్ చేసుకుని వేసేసుకుంటారు. ఎందుకంటే అవి రంగు మారుతాయని. అయితే వాటిని కట్ చేసిన తర్వాత పసుపు, నిమ్మరసం కలిపిన నీటిని చల్లితే అవి రంగు మారకుండా తాజాగా ఉంటాయి. ఒకవేళ వంకాయల్ని కట్ చేసి దాచుకోవాలంటే వాటిని గుండ్రంగా కోసి ముక్కల్ని పేపర్ టవల్స్ మధ్య వేసి ఒక డబ్బాలో పెట్టి ఫ్రిజ్‌లో పెట్టాలి. ఇలా చేయడం వల్ల అవి రెండు, మూడు రోజులపాటు తాజాగా ఉంటాయి. ఇక ఉల్లిపాయలైతే వాసన వస్తాయని చాలామంది అప్పటికప్పుడు కట్ చేసుకుంటుంటారు. ఉల్లిపాయలు కోసిన వెంటనే వాటిని గాలి తగలని డబ్బాలో వేసి ఫ్రిజ్‌లో పెట్టుకుంటే రోజుమొత్తంలో ఎప్పుడైనా వాడుకోవచ్చు. ఒకరోజు దాటితే అవి తాజా దనాన్ని కోల్పోతాయి. విషపూరితం కూడా కావచ్చు.

### ఇవి ఫ్రిజ్‌లో పెట్టకూడదు

చాలా పదార్థాలను మనం ఫ్రిజ్‌లో పెడుతుంటాం కానీ కొన్ని రకాల పదార్థాలను ఫ్రిజ్‌లో అసలు పెట్టకూడదు. అలాంటి వాటిల్లో అరటి పండ్లు, ఖర్బూజా, తర్బూజా, ఆలుగడ్డలు, కేక్స్, బన్, కాఫీ, తేనె, ఉల్లిపాయలు, అవగాడో, వెల్లుల్లి, ఉల్లిలాంటివి అసలు ఫ్రిజ్‌లో పెట్టవద్దు. దీనివల్ల ఆపదార్థాల రుచి మారిపోవడమే కాక, హానికారకంగా మారే అవకాశాలున్నాయి.

### ఇతర కూరగాయలు

టమాటాలు ఎక్కువగా అన్నింట్లోనూ వాడుతుంటాం. కట్ చేసిన టమాటా ముక్కలు ఎక్కువ సమయం నిలువ ఉండవు. అందుకే వాటిని భద్రపర్చుకోవాలంటే ఒక గిన్నెలో వాటిని వేసి పైన వదులుగా మూతపెట్టాలి. అయితే ఇవి కేవలం 24 గంటలు మాత్రమే తాజాగా ఉంటాయి. వీలైనంత వరకు అప్పటికప్పుడు కట్ చేసుకోవడమే ఉత్తమం. ఇక మిరపకాయలని కూడా కట్ చేసుకున్న తర్వాత వాటిని గాలి తగలకుండా భద్రపరుచుకుంటే ఒక రోజు ఆగుతాయి. ఎందుకంటే ఫ్రిజ్‌లో పెట్టినప్పుడు ఆ తేమ వల్ల జిగురుగా మారి తొందరగా పాడైపోతాయి. ఇక కీరాదోస ముక్కలను ఎక్కువసమయం బయటపెడితే వాటి తాజాదనాన్ని కోల్పోతాయి. వాటిని కట్ చేసి గాలి తగలని డబ్బాలో టైట్‌గా పెడితే మూడు రోజుల వరకు కూడా అవి తాజాగా ఉంటాయి.

–కీర్తి



# మెరుపులు - మరకలు

-రావాడ శ్యామల

**రాత్రి ఎనిమిదవుతోంది. ఒంటరిగా ఇంట్లో విసుగ్గా ఉంది. పండుగ సెలవులివ్వడంతో సాయంత్రమే తమ్ముడొచ్చి పిల్లలిద్దరినీ ఊరు తీసుకెళ్ళిపోయాడు. శ్రీవారు ఆఫీసు పనిమీద బెంగళూరు వెళ్ళారు. రెండురోజుల వరకు రారు. నాకింకా నాలుగురోజుల వరకు స్కూల్ ఉంది. తర్వాతే సెలవులు. "బావ వచ్చాక ఇద్దరూ కలిసి రండక్కా" అని చెప్పేసి వెళ్ళాడు తమ్ముడు.**

పిల్లలు ఉన్నంతసేపూ రణగొణధ్వనితో దద్దరిల్లే ఇల్లు ఇప్పుడు బోసిపోయి ఉంది. వాళ్ళు వెళ్ళి ఇంకా నాలుగు గంటలు కాలేదు. నాకప్పుడే బోర్‌గా ఉంది. ఇంకా నాల్రోజులు ఎలా ఉండాలో ఏమిటో. వాళ్ళు బయటకు వెళితే ఈ పని చెయ్యొచ్చు ఆ పని చెయ్యొచ్చు అని ప్లాన్ చేసుకున్నాను కానీ, వాళ్ళు వెళ్ళాక ఇంట్లో స్తబ్ధత వల్ల ఏ పనీ చేయబుద్ధి కాలేదు. నా ఒక్కదానికే అన్నం, కూర ఏం చేసుకుంటాలెమ్మని, ఉల్లిపాయలు బాగా వేసుకొని సేమ్యా, ఉప్మా చేసుకొని, టీవీ ముందు కూర్చున్నాను. టీవి ఆన్ చేశాను.

ఒక ఛానల్‌లో పిల్లల ప్రోగ్రామ్ పాటల పోటీలు వస్తున్నాయి. ఆరోజు ఎలిమినేట్ రౌండ్ అట. చిన్న అబ్బాయి ఎలిమినేట్ అయ్యాడు. బాబుకన్నా వాళ్ళ అమ్మే ఎక్కువ ఏడుస్తోంది. ఏడుపులు ఓదార్పులతో ఛానల్‌వాడు టి.ఆర్.పి పెంచుకోవాలని చూస్తున్నాడు. ఇంకో ఛానల్ మార్చాను. పిల్లల డాన్సు ప్రోగ్రామ్ వస్తోంది. ఐదేళ్ళ పిల్ల చీలికలు పీలికల్లాంటి బట్టలేసుకుని, ఒక సిన్మాలోని బూతు పాటకు తెగ ఊగుతూ డాన్స్ చేస్తోంది. ఆ బూతు పాటకు అర్థం కూడా తెలియదు ఆ పిల్లకు. కాని, పేరెంట్స్‌కి తెలియదా? మధ్య మధ్యలో ఆ పిల్ల అమ్మ, నాన్నని చూపిస్తున్నారు. వాళ్ళు కేరింతలు కొడుతున్నారు. పాట పూర్తయినాగానీ జడ్జీలకి పాట తాలూకు మైకం ఇంకా దిగలేదు. వాళ్ళూ సీట్లోంచి లేచొచ్చి ఆ పిల్లతో పాటు గెంతులేస్తున్నారు. విసుగొచ్చింది. ఇంకో ఛానల్ మార్చాను. భయంకరమైన సీరియల్స్. అమ్మోరులా మెళ్ళో అరకేజీ బంగారం వేసుకున్న అత్త, కోడళ్ళని ఆరళ్ళు పెట్టే సీరియల్. ఇంకోచోట విపరీతమైన మేకప్ వేసుకుని కోడళ్ళే, ఆడవిలన్ల రోల్ చేస్తున్నారు. వాళ్ళ మూతివిరుపులు, కళ్ళెగరేయడాలు, హత్య ఎలా చేయాలో పథకాలు వేయడాలు.. మరీ చాణక్యుణ్ణి మరపించే రణనీతి చూపించేస్తున్నారు. కోపం వచ్చేస్తోంది నాకు. ఇంకో ఛానల్ పెట్టాను. క్రైం వాచ్ వస్తుంది. జరిగిన అపరాధాలన్నీ మళ్ళీ టీవీలో చూపించడం కోసం తీసిన సీరియల్స్ లాంటివి. స్కూల్‌లో టీచర్స్ చూస్తుంటారు. అందుకే చూద్దాంలెమ్మని చూస్తున్నాను.

పద్నాలుగేళ్ళ అమ్మాయి స్కూల్ నుండి వస్తుంది. ఆమెని దారిలో ఒక పోకిరీ వెధవ రోజూ అల్లరి పెడుతుంటాడు. అమ్మాయి తెల్లగా, బొద్దుగా చాలా బాగుంది. చూడగానే ఎక్కడో చూసినట్టనిపించింది. ఆ పోకిరి వెధవ మాత్రం మేకప్ అలా వేశారో లేక వాడి రూపం, చేష్టలు అలానే ఉన్నాయో తెలియదుగానీ వాణ్ణి చూస్తేనే అసహ్యం వేస్తోంది. వాడి చూపులు అమ్మాయిని ఎలా తడిమి చూస్తున్నాయో, కెమెరాలో అమ్మాయి శరీరాన్ని వివిధ కోణాల్లో చూపిస్తున్నారు. వాళ్ళు పాత్రలో లీనమై నటిస్తున్నారు. అమ్మాయి వాళ్ళ పేరెంట్స్‌కి చెపుతుంది. వాళ్ళు అ అబ్బాయింటికి వెళ్ళి గట్టిగా వార్నింగ్ ఇస్తారు. ఆ పోకిరి నాల్రోజులు వరకు అమ్మాయి జోలికి రాడు.

'హమ్మయ్య' అని ఊపిరి పీల్చుకుంటుంది అమ్మాయి. అయిదో రోజు అమ్మాయి స్కూల్‌కి వెళుతుంటే ఎదురుపడి సారీ చెపుతూ, పక్కనే ఆగి ఉన్న కారులోకి లాగి, ఆమె నోరు మూసేస్తాడు. వాడి ఫ్రెండ్ కారుని డ్రైవ్ చేస్తుంటాడు. మీ పేరెంట్స్ మా దగ్గరే ఉన్నారు. నువ్వు అరిచావంటే వాళ్ళని చంపేస్తానని బెదిరిస్తాడు. ఫోన్‌లో ఏదో రికార్డెడ్ వాయిస్ వినిపిస్తాడు. అమ్మాయి నిజంగా తనవాళ్ళ వాయిస్సే అని నమ్ముతుంది. వాడు అమ్మాయిని హోటల్‌కి తీసుకెళ్ళి అత్యాచారం చేస్తాడు. అలా అమ్మాయిని నెలరోజులు వేరే వేరే సిటీల్లోని హోటల్స్‌కి తీసుకెళ్ళి అనుభవిస్తాడు. తనని వదిలేయమని దీనంగా వేడకుంటుందా అమ్మాయి.

చూస్తుంటే నా కడుపు దేవినట్లయింది. ఏంటిది? నిజంగా జరిగిందే అయినా ఇంత నిర్లజ్జగా మళ్ళా అంతా చూపించాలా? నేరం చేసినవాడు ఎక్కడో ఒక క్లూ వదులుతాడు. (ఇది ఒకప్పటి నమ్మకం) అలా వాడు ఏ క్లూ వల్ల పట్టుపడ్డాడో పోలీసులు ఏ విధంగా ఛేజ్ చేసి వాణ్ణి పట్టుకున్నారో చూపించారు. ఇష్టంగా చేసుకున్న ఉప్మా తినబుద్ధి కాలేదు. కళ్ళముందు ఆ అమ్మాయే మెదులుతోంది. అమ్మాయి మొఖంలో జీవం లేదు. ఒక వంచకుడి చేతిలో బలైన పాత్ర పోషిస్తున్న అమ్మాయిని ఎక్కడ చూశానో గుర్తుకొచ్చింది.

మూడేళ్ళ కిందట వేరే జిల్లాలోని స్కూల్‌లో పని చేస్తున్నప్పుడు అమ్మాయి ఆ స్కూల్‌లో సెవెంత్ క్లాసు చదివేది. పేరు శ్వేత. వాళ్ళ నాన్న ఏదో మిల్లు వర్కర్. వాళ్ళమ్మ చాలా బాగుంటుంది. వాళ్ళ అమ్మనాన్నలది లవ్ మ్యారేజ్. అతనికి లేని వ్యసనం లేదు. ప్రేమ మైకం దిగిన





తరువాత ఆమెకి తను చేసిన తప్పేమిటో తెలిసింది. కానీ అప్పటికే జరగవలసిన అనర్థం జరిగిపోయింది. ముగ్గురు పిల్లల తల్లయింది. గౌరవప్రదమైన తన కుటుంబం నుండి వెలివేయబడింది. ఫలితం వీళ్ళకు నా అన్నవాళ్ళు లేక దారిద్ర్యంలో కొట్టుమిట్టాడే వాళ్ళు. ఆ ఇంట్లో పెద్దమ్మాయి శ్వేత చాలా చురుకైనది. చదువులో, ఆటపాటల్లో ఫస్టు వచ్చేది. అమ్మాయితో నాకు రెండేళ్ళ పరిచయం. నాకు ట్రాన్స్‌ఫర్ కావడంతో సొంతూరు దగ్గర్లోకి వచ్చేశాను. అప్పటినుండి అమ్మాయిని చూడలేదు. మళ్ళా ఇదిగో ఇప్పుడు ఇలా టీవీలోనే చూడ్డం. నా మనసంతా పాడైపోయింది. రాత్రంతా నిద్రపట్టలేదు. స్కౌండ్రల్, అమ్మాయిని ఎంత టార్చర్‌పెట్టి అనుభవించాడు. అది నిజంగా జరిగిన కథకి రూపాంతరంగా చూపించారు. కాని, అది చూస్తుంటే సహజంగా అనిపిస్తోంది. వాడి వెకిలి నవ్వు చూపులు... చూస్తున్న మనకే కంపరం కలిగిస్తున్నాయి. ఆ అమ్మాయి ఎలా భరించిందో! అది యాక్టింగ్ కావచ్చుగానీ, నాకెందుకో ఏదో అసహజంగా అనిపించింది.

మరుసటి రోజు స్కూల్ లంచ్ అవర్లో ఇదే టాపిక్. క్రైమ్ వాచ్ బాగుంది. అమ్మాయి ఆ పాత్రలో జీవించేసింది. అమ్మాయేనా... వాడు కూడా. వాణ్ణి చూస్తుంటే, వాడి పీక పిసికేయాలన్నంత కోపం వచ్చేసింది. టీచర్స్ మాట్లాడుకుంటున్నారు. నాకు కళ్ళముందు శ్వేతే కనిపిస్తోంది. అమ్మాయి రూపాన్ని మరువలేక పోతున్నాను. సడన్‌గా నాకు, నాతో పాటు ఆ ఊర్లో పనిచేసిన నా కొలీగ్ సురేఖ గుర్తుకొచ్చింది. ఆమె ఇప్పటికీ అదే స్కూల్‌లో పని చేస్తోంది. వెంటనే సురేఖకి ఫోన్ చేశాను.

"క్రైమ్ వాచ్‌లో యాక్ట్ చేసింది శ్వేతే కదా" అడిగాను.

"అవునే.... చూశావా.. బాగా యాక్ట్ చేసింది కదూ"

"ఇదేనా టీవీలో ఫస్టు యాక్టింగ్ చేయడం.."

"ఇంతకుముందు క్రైం వాచ్‌లో చిన్నచిన్న క్యారెక్టర్స్ వేసింది. ఈసారి ప్రత్యేకంగా ఈ అమ్మాయితో ఈ ఎపిసోడ్ చేశారు" అంది.

"అసలు శ్వేత యాక్టింగ్ వైపు ఎలా వెళ్ళింది?" ఆవేదనగా అడిగాను.

"రెండేళ్ళ క్రితం వాళ్ళమ్మకి జాండిస్ వచ్చి చనిపోయింది. వాళ్ళ నాన్నే చూసుకుంటున్నాడు. సంవత్సరం క్రిందట ఊర్లోకి ఎవరో టీ.వీ. ప్రొడక్షన్ వాళ్ళు వచ్చారు. పిల్లల డాన్స్ ప్రోగ్రామ్‌లు పెట్టారు. అందులో పార్టిసిపేట్ చేసింది. మరి ఎవరో అవకాశం ఇస్తామన్నారు కాబోలు.

అసలే పిల్ల ఎర్రగా బుర్రగా ఉంటుంది. ఇప్పుడు వాళ్ళకేం. పిల్ల బాగా సంపాదిస్తోంది, రేపు టీవీ స్టారో సిన్మాస్టారో అయిపోతుంది" సురేఖలో అసూయో, అసంతృప్తో మాటల్లో కనిపించింది. "వైజాగ్‌లో షూటింగ్‌లో ఉందంట. ఈ మధ్య వాళ్ళ నాన్న కలిసినప్పుడు చెప్పాడు" అంది.

"రేఖా... ప్లీజ్ కొద్దిగా అమ్మాయి ఎక్కడుంటుందో అడ్రస్ కనుక్కొని చెప్పవా, ప్లీజ్"

"ఎందుకో! నువ్వు టీవీలో యాక్ట్ చేస్తావా ఏంటీ" వెటకారంగా నవ్వింది.

"నోరు ముయ్యవే, గౌరవప్రదమైన వృత్తిలో ఉన్నాం. అది చాలు నాకు. చిన్న పనుంది అమ్మాయితో అందుకే... నేను మళ్ళా సాయంత్రం ఫోన్ చేస్తాను. కనుక్కొని చెప్పు ప్లీజ్" అన్నాను. "సరేనే" అంది.

సాయంత్రం ఫోన్ చేశాను. షూటింగ్ ఎక్కడ జరుగుతోందో ఆ అడ్రస్ ఇచ్చింది. నోట్ చేసుకున్నాను. స్కూల్ నుండి తిన్నగా నా ఫ్రెండ్ నీలవేణి ఇంటికి వెళ్ళాను. ఆమె శిశు సంక్షేమాధికారిగా పని చేస్తోంది. శ్వేత విషయం చెప్పాను. తను వెంటనే యూట్యూబ్‌లో ఆ ప్రోగ్రాం చూసింది. చూసి నాలాగే ఆవేశంతో ఊగిపోయింది. వాడు ఆ అమ్మాయిని ఎక్కడెక్కడ కళ్ళతో తడిమి చూశాడో ఆ క్రైమ్ కథ చిత్రీకరించిన డైరెక్టర్‌కి చెప్పాడా? ఇది మనమే కాదు. అలాంటి స్కౌండ్రల్స్ కూడా చూస్తారు. వీడు ఏ తప్పు చేసి పట్టుబడిపోయాడో జాగ్రత్తగా గమనించి వాళ్ళు అటువంటి పొరపాట్లు చేయకుండా నూటికి నూరుశాతం పక్కా ప్లాన్‌తో ఇంకా ఇంకా ఇలాంటి క్రైమ్స్ చేస్తుంటారు. పోలీసులకి పట్టుబడినవీ, వార్తల్లో కెక్కినవీ చాలా తక్కువ. సాల్వ్‌కాని కేసులు చాలా ఎక్కువ. జరిగిన విషయాన్ని అంత పబ్లిక్‌గా చూపించక్కరలేదు. న్యూస్‌లో చూస్తున్నారు. అర్థం అవుతుంది. ఇలాంటి సంఘటనలు జరుగుతుంటే బాధితులు ఏం చేయాలో, ఎలా రియాక్టవ్వాలో చెపితే, ఆడపిల్లలకు ఉపయోగంగా ఉంటుంది. ఇది కేవలం నేరస్తుల్ని ఎలా తయారుచెయ్యాలో నేర్పుతున్న ట్రైనింగ్‌లా ఉంది. ఇదే కాదు. భార్యని రోకలితో హతమార్చడం, ప్రియురాల్ని వంచించడం ఇలాంటివి ఎన్నో చూపిస్తున్నారు. సాక్ష్యం లేకుండా నేరం ఎలా చెయ్యాలో దీని ద్వారా నేర్చుకుంటున్నారు.

**ఇంట్లో ఒంటరిగా ఉందామె. టీవీ ఛానల్స్ మారుస్తూ అన్నీ గమనిస్తోంది. ఏదీ నచ్చడంలేదు ఆమెకు. ఒక ఛానల్‌లో క్రైమ్‌స్టోరీ వస్తోంది. జరిగిన క్రైమ్‌ను మళ్ళీ కథలా తీశారు. అందులో నటిస్తున్న అమ్మాయిపట్ల సీన్ రక్తికట్టించే పేరుతో ఎంతో అసభ్యంగా ప్రవర్తిస్తున్నాయి విలన్ పాత్రలు. ఆ సీన్లు చూశాక ఆమె కడుపులో దేవినట్టయింది. ఆగ్రహం పెల్లుబికింది. ఇక ఊరుకోలేదు. మరి ఏం చేసిందామె?**

ఆవేశంగా మాట్లాడింది. ఆమె చెప్పింది నిజమే. ఇద్దరం చాలాసేపు మాట్లాడుకున్నాం. ఇద్దరం కలిసి వైజాగ్‌లోని షూటింగ్ స్పాట్‌కి వెళ్ళాలని నిర్ణయించుకున్నాం. మరుసటి రోజు నేను స్కూలుకి సెలవు పెట్టి, నీలవేణితో కలిసి వైజాగ్ వెళ్ళాను. సిటీకి చివర నిర్మానుష్యమైన చోట షూటింగ్ జరుగుతోంది. శ్వేత మీదే షూట్ చేస్తున్నారు. కాలేజీ అమ్మాయి పాత్రలో శ్వేత ఆ చుడీదార్‌లో చూడముచ్చటగా ఉంది. కాలేజీ నుండి వస్తున్న ఆమెని దార్లో నలుగురు దుండగులు కార్లో బలవంతంగా ఎక్కించుకుని అత్యాచారం చేసి కార్లో నుండి విసిరేస్తారట. అది ఆ రోజు చెయ్యాల్సిన షూటింగట!

నలుగురు దుండగులు ఆమెని కార్లోకి బలవంతంగా లాక్కెళుతున్నారు. నలుగురూ వీధి రౌడీల్లా పరమ అసహ్యంగా ఉన్నారు. శ్వేత అరుస్తోంది, ఆమె నోరు మూసేశారు. కెమెరామేన్ బబుల్‌గమ్

నములుతూ తనకి కావాల్సిన యాంగిల్స్‌లో కెమేరా తిప్పుతున్నాడు.

ఇలా చెయ్యాలి, అలా చెయ్యాలి అని అమ్మాయి మీద అందరూ చేతులేస్తున్నారు. రీ టేక్ చేస్తున్నారు. చూడడానికి మాకే కంపరంగా ఉంది.

నీలవేణి ఆ డైరెక్టర్‌ని పిలిచి అంది. "మీరు చేస్తున్నదేమిటి? ఇది సెక్సువల్ హెరాస్మెంట్ కదా. చిన్నమ్మాయిని మీరు ఇబ్బంది పెడుతున్నారు. కంప్లయింట్ చేస్తా జాగ్రత్త" అని హెచ్చరించింది.

శ్వేత నన్ను చూడగానే "టీచర్ బాగున్నారా" అంటూ వచ్చి కావలించుకుంది. తల్లి గుర్తుకొచ్చిందేమో కన్నీళ్ళు పెట్టుకుంది.

శ్వేత వాళ్ళ నాన్నతో మాట్లాడాను. "చిన్నమ్మాయి చేత ఇలాంటి సీన్లు చేయించడమేమిటి? మీరు తండ్రి కదా, అమ్మాయి అవస్థ అర్థం చేసుకోలేరా" అడిగాను.

"అమ్మా టీచరమ్మా... నీకో దండం, అది సుబ్బరంగా యాక్టింగ్ చేస్తుంటే ఇబ్బందంటావేంటీ? మాకు లేని బాధ మీకెందుకు, వెళ్ళండి" అంటూ అక్కడ నుండి వెళ్ళిపోతూ, "మనుషులు బాగుంటే




చూడలేరు. కళ్ళల్లో నిప్పులు పోసుకుంటారు. మాయదారి మనుష్యులు" అని వెనక్కి తిరిగి వెకిలి నవ్వు నవ్వాడు.

శ్వేత నా వైపు చూసింది. "టీచర్ మీరు ఏ స్కూల్లో పనిచేస్తున్నారు?" అడిగింది.

టాపిక్ మార్చాలని అలా అడిగిందనుకున్నాను. యాంత్రికంగా ఏదో మాట్లాడి నీలవేణితో కలిసి బయటకు వచ్చేశాను.

"డర్టీ రోగ్.. ఏమనుకుంటున్నాడు. వాడు పబ్లిక్‌గా పిల్ల మీద యాక్టింగ్ పేరుతో సెక్సువల్ హెరాస్మెంట్ చేస్తున్నాడు. వాణ్ణి వదలను, మీడియా ముందు నిలబెడతాను. ఊచలు లెక్కపెట్టిస్తాను. రోజూ పేపర్‌లో న్యూస్‌లు వస్తున్నాయి చాలదా...ఎలా జరిగిందో మళ్ళీ ఇలా విపులంగా చూపించి ఇంకొందర్ని సైకోలుగా తయారుచేయడానికి కాకపోతే ఎందుకిలాంటి ప్రోగ్రామ్స్ ? ఆవేశంగా నీలవేణి చెప్పుకుపోతోంది. నాకు శ్వేత రూపమే గుర్తుకొస్తోంది.

రెండో రోజు క్లాస్‌లో ఉండగా నీలవేణి తమ్ముడు ఫోన్ చేశాడు. నీలవేణికి ఆక్సిడెంట్ అయి హాస్పిటల్‌లో ఉందని చెప్పాడు. మా హెచ్.ఎం. దగ్గర పర్మిషన్ తీసుకొని వెంటనే హాస్పిటల్‌కి వెళ్ళాను.

స్కూటీ మీద వస్తున్న ఆమెను, లారీ వచ్చి డీ కొట్టిందట. నీల రోడ్డు సైడు పొదల్లో పడిపోయింది. అందుకే బతికి బయట పడింది. స్కూటీ నుజ్జు నుజ్జు అయిపోయింది. అయితే ఆమెకి దెబ్బలు బాగా తగిలాయి. మాట్లాడేస్థితిలో లేదు. షాక్‌లో ఉందామె. నాతో ఏదో చెప్పాలని ప్రయత్నించింది. కాని చెప్పలేక పోతోంది. ఆమె కళ్ళు మాత్రం ఏదో భయంకరమైన దృశ్యం చూసినట్టు వణుకుతున్నాయి. హాస్పిటల్‌లో ఒక గంట కూర్చుని వచ్చేశాను.

మూడో రోజు స్కూల్ లంచ్ అవర్లో పోస్ట్‌మాన్ వచ్చాడు.

"వాణి మేడమ్ ఎవరూ?....' అంటూ.

నేనేనని ముందుకు వచ్చాను. నా చేతిలో కవరు పెట్టి వెళ్ళిపోయాడు. స్కూల్ అడ్రస్‌కి వచ్చిన కవరు. ఫ్రమ్ అడ్రస్ లేదు.

కవరు తీసి చూశాను. ముత్యాల్లాంటి అక్షరాలు. నాకు పరిచయమైన రైటింగ్....

ఎస్, ఇది శ్వేత రైటింగ్. ఆత్రంగా చదవడం ప్రారంభించాను.

వాణి టీచర్ గారికి నమస్కారం.

టీచర్. అన్నింట్లో ఫస్ట్ వస్తున్నానని అందరూ పొగుడుతుంటే బాగా గర్వం వచ్చేసింది. అందుకే ఈరోజు ఇలా దిగజారిపోయాను. టీచర్, టీవీ వాళ్ళు ఊర్లోకి వచ్చి డాన్స్ ప్రోగ్రామ్‌లు పెట్టారు. నేను బాగా డాన్స్ చేశానని మెచ్చుకున్నారు. నాన్న వాలకం చూసి "అమ్మాయి బాగుంది. సిన్మా యాక్టరు అవ్వొచ్చు. అందుకే ఇప్పటినుండీ టీవీ సీరియల్‌లో యాక్ట్ చేయిస్తే ఎక్స్‌పీరియన్స్ వస్తుంది. మరి ఇంక వెనక్కి చూడక్కరలేదు" అని చెప్పగానే నాన్న, నేను ఎగిరి గంతేశాం. అమ్మలేదు. మేం ఎవరి మాటా వినలేదు. తమ్ముణ్ణి, చెల్లెల్ని హాస్టల్లో ఉంచి మేం ఇక్కడికి వచ్చేశాం. ముందు నాకు చిన్నచిన్న రోల్స్ ఇచ్చారు. నాన్న నాకు పెద్ద వేషాలు ఇప్పించాలని అందరి దగ్గరికీ తిరిగేవాడు. క్రైం వాచ్ ప్రొడక్షన్ వాళ్ళు నన్ను తీసుకున్నారు. జరిగిన నేరాలని ఇలా తీస్తున్నాము అని చెప్పినప్పుడు బాగానే ఉందనిపించింది.

పాపం అన్యాయం జరిగిన అమ్మాయి పాత్ర చేస్తున్నాను అనుకున్నాను. కాని నేనే అన్యాయం అయిపోతాననుకోలేదు టీచర్. వీళ్ళ చూపులు నన్ను తినేసేలా చూస్తాయి. కెమెరాని నా వంటి మీద ఎక్కడెక్కడో ఫోకస్‌చేసి తీస్తారు. నా పట్ల చాలా చీప్‌గా ప్రవర్తిస్తున్నారు. నేను హీరోయిన్ అవుదామని వచ్చాను, కాని ఇలా అవుతానని అనుకోలేదు. ఇది మానేసి నేను మళ్ళా స్కూల్‌కి వెళదామన్నా కుదరదు.

ఇప్పుడు బయటవాళ్ళు కూడా ఏడిపిస్తున్నారు. చాలా అసహ్యంగా మాట్లాడుతున్నారు. "నువ్వు అంత బాగా రేప్ జరిగినట్లు ఎలా యాక్ట్ చేశావు. నిజంగా నీకు బాగా అనుభవం వచ్చేసింది. ఒక సారి మాతోరా. ఇంత ఇస్తాం, అంత ఇస్తాం" అంటారు. మా నాన్న కూడా అర్థం చేసుకోలేదు.

నేను ఏడిస్తే, మొదట్లోనే ఈ కష్టం ఉంటుందిరా, తర్వాత నువ్వో పెద్ద హీరోయిన్‌వి అయితే వీళ్ళంతా నీ కాళ్ళ దగ్గర పడి ఉంటారు అంటాడు. కెమెరామేన్‌ని సంతోషపెట్టావంటే నిన్ను అప్సరసలా తీస్తాడు. డైరెక్టర్‌ని కనికరించావంటే మంచి మంచి ఆఫర్స్ వస్తాయంటాడు. పచ్చిగా చెప్పాలంటే నాన్న నా చేత వ్యభిచారం చేయిస్తున్నాడు. తను జల్సాలు చేస్తున్నాడు. నాకు చచ్చిపోవాలనిపిస్తోంది. కానీ నా సంపాదన మీదే చెల్లి, తమ్ముడు చదువుతున్నారు. నేను ఆత్మహత్య చేసుకోను టీచర్. భయపడకండి. నాన్న అన్నట్లు నా టాలెంట్‌తో ఎప్పటికైనా స్టార్ అవుతాను. అప్పుడు ఈ.. నా...కొ.. ఏం చెయ్యాలో అదే చేస్తాను. ఒక్కణ్ణి కూడా వదిలిపెట్టను. రంగు రంగుల ప్రపంచం వైపు పరుగులు తీశానుగానీ, ఇదొక సాలెగూడులాంటిది టీచర్. చిక్కుకుంటే మళ్ళా బయటకు రాలేం. నన్ను బయటకు తీసుకు వస్తానని చెప్పారు, సారీ టీచర్ మీరు నా విషయంలో జోక్యం చేసుకోవద్దు. వీళ్ళు మంచివాళ్ళు కాదు. దేనికైనా తెగిస్తారు. మీరు నన్ను రక్షించడం కన్నా... ఇంకెవరూ ఈ సాలెగూడులో చిక్కుకు పోకుండా ముందుగానే కళ్ళు తెరిపించండి. ఈ మెరుపుల లోకంలోకి రానివ్వకండి. నాలాగా ఇక్కడ ఎందరో అమాయకులు బలైపోతున్నారు. ఈ మురికి కూపం నుండి బయటకు వచ్చినా మేం బ్రతకలేం. దీపం పురుగుల్లా ఈ మెరుపుల లోకంలో చిక్కుకుపోయాం. మా మొఖాలకి రంగు పూసుకొని బ్రతకడం అలవాటైపోయింది. ఇంకెప్పుడూ మీరు నన్ను కలవద్దు టీచర్.

ఇట్లు
మీ ప్రియమైన
శ్వేత

నా కళ్ళు వర్షిస్తున్నాయి. ఏం చేయాలి? నా కర్తవ్యం ఏంటి? ఆలోచిస్తున్నాను. ఒక తల్లిగా.. ఒక ఆడదానిగా...

**సెల్: 94943 29652**




## ఐస్‌క్రీంతో మరింత చురుకుదనం!

ఐస్‌క్రీం మాట చెవిన పడగానే ఏ వయస్సు వారికైనా నోట్లో నీళ్ళు ఊరతాయి. వయో భేదం, లింగభేదం లేకుండా అందరూ ఇష్టపడే ఒకే ఒక్క పదార్థం ఐస్‌క్రీం అని చెప్పుకోవచ్చు. అయితే రకరకాల కారణాల రీత్యా కొందరు దీనికి దూరంగా ఉండడమే కాకుండా పిల్లల్ని కూడా దూరంగా ఉంచుతారు. కానీ వారివన్నీ అర్థంలేని భయాలే అంటున్నారు జపాన్ శాస్త్రవేత్తలు. ఉదయం బ్రేక్‌ఫాస్ట్ కింద ఐస్‌క్రీం తీసుకుంటే రోజంతా చురుకుగా ఉండవచ్చు అన్న విషయం వీరి పరిశోధనలో వెల్లడైంది. సుమారు రెండువేల మంది మీద వీరు పరిశోధనలు నిర్వహించారు. వీరిని రెండు గ్రూపులుగా విభజించి ఒక గ్రూపు వారికి ఉదయం బ్రేక్‌ఫాస్ట్‌గా ఐస్‌క్రీం ఇచ్చారు. మరో గ్రూపు వారికి వారు రోజూ తీసుకునే బ్రేక్‌ఫాస్ట్‌ను అందించారు. అనంతరం వారికి కొన్ని పజిల్స్ ఇచ్చి పూర్తి చేయమన్నారు. ఐస్‌క్రీం తిన్న గ్రూపులో 60 నుంచి 70 శాతం మంది చాలా త్వరగా ఈజీగా పజిల్ పూర్తి చేయగా, రెండో గ్రూపు వారు దాన్ని పూర్తి చేయడానికి చాలా ఎక్కువ సమయం తీసుకున్నారు. ఈ వ్యత్యాసానికి కారణం బ్రేక్‌ఫాస్ట్ కింద ఐస్‌క్రీం తీసుకోవడమే అని పరిశోధకులు చెబుతున్నారు. అయితే ఈ విషయం మీద మరిన్ని పరిశోధనలు నిర్వహించాల్సి ఉందని వారు అంటున్నారు.

## పల్లీలతో గుండె పదిలం!

పల్లీలు ఆరోగ్యానికి మంచిది కాదు, వాటిని తీసుకుంటే కొవ్వు పెరుగుతుందనే అనుమానాలు చాలామందిలో ఉంటాయి. అవి కేవలం అపోహలు మాత్రమేననీ, పల్లీలు ఆరోగ్యాన్ని పరిరక్షిస్తాయి అంటున్నారు పరిశోధకులు. మధ్యాహ్నం భోజనంతో పాటు కొన్ని పల్లీలు నేరుగా లేదా షేక్ రూపంలో తీసుకుంటే గుండె ఆరోగ్యంగా ఉంటుందన్న విషయం వీరి పరిశోధనలో వెల్లడైంది. పదహారు మందిని రెండు గ్రూపులుగా విభజించి ఒక గ్రూపువారికి మధ్యాహ్నం భోజనం తరువాత గుప్పెడు పల్లీలు ఇచ్చారు. రెండో గ్రూపు వారికి సాధారణ డ్రింక్‌ను ఇచ్చారు కొన్ని గంటల అనంతరం వీరిని పరీక్షించగా, పల్లీలు తీసుకున్న వారిలో ట్రైగ్లిజరైడ్స్ తగ్గిన విషయాన్ని గుర్తించారు. మామూలుగా భోజనం అనంతరం రక్తంలో ట్రైగ్లిజరాయిడ్స్ స్థాయి పెరుగుతుంది. రక్తంలో వీటి స్థాయి పెరిగితే గుండె సంబంధిత సమస్యలు తలెత్తుతాయి. పల్లీలు తినడం వలన వీటి స్థాయి పెరగకుండా తగ్గడం అనేది గుండె ఆరోగ్యానికి చాలా మేలు చేస్తుందని పరిశోధకులు చెబుతున్నారు. అయితే చక్కెర వ్యాధిగ్రస్థులు పల్లీలు తీసుకునే విషయంలో వైద్యుల సలహా తీసకోవడం తప్పనిసరి అని వారు అంటున్నారు.





## సెల్ఫీ దిగితే అంతే..!

తాము ఎక్కడున్నా ఏం చేస్తున్నా సెల్ఫీలు దిగి సోషల్ మీడియాలో ఎప్పటికప్పుడు పోస్ట్ చేయడం చాలామందికి అలవాటు! ఇదే వారిని అనారోగ్యం బారిన పడేట్టు చేస్తుంది అంటున్నారు నిపుణులు. సెల్ఫీలు తరచూ దిగడం వలన చర్మ సంబంధ సమస్యలు తలెత్తే అవకాశాలు చాలా ఎక్కువ అని వారు చెబుతున్నారు. సెల్‌ఫోన్ నుంచి వెలువడే రేడియేషన్ కారణంగా చర్మం ముడతలు పడుతుందనీ, చర్మానికి హాని కలుగుతుందనీ వారు హెచ్చరిస్తున్నారు. సెల్‌ఫోన్ స్క్రీన్ నుంచి వెలువడే ఎలక్ట్రో మాగ్నటిక్ రేడియేషన్ కారణంగా చర్మం డిఎన్ఏ దెబ్బతినే అవకాశం ఎక్కువగా ఉందని వారు చెబుతున్నారు. సెల్ఫీలు దిగిన వెంటనే చర్మానికి జరిగే నష్టాన్ని గుర్తించడం కష్టమనీ, దీర్ఘకాలంలో దీని ప్రభావం తప్పకుండా కనిపించి తీరుతుందనీ వారు స్పష్టం చేస్తున్నారు.

## తలకి రంగు ప్రమాదమే!

జుత్తుకి రంగు వేసుకోవడం ఇప్పుడు ఓ ఫ్యాషన్ అయింది. కొన్ని సంవత్సరాల క్రితం వరకూ తలకి రంగు వేసుకోవడం నామోషీగా భావించేవారు. ఇప్పుడు అవసరం ఉన్నా లేకపోయినా ఫ్యాషన్ పేరుతో రకరకాల రంగులు జుత్తుకు అప్లయ్ చేయడం యువతకు అలవాటుగా మారింది. అదే వారికి ప్రాణాంతకమవుతోంది అంటున్నారు ఫిన్‌లాండ్ పరిశోధకులు. యువతులు తలకి రంగు వేసుకోవడం వలన వారికి రొమ్ము కేన్సర్ వచ్చే అవకాశాలు 23 శాతం ఉన్న విషయం వీరి అధ్యయనంలో వెల్లడైంది. గర్భనిరోధక సాధనాలు ఉపయోగించడం వలన, లేటు వయస్సులో బిడ్డకు జన్మనివ్వడం, పిల్లలకు పాలు ఇవ్వక పోవడం వంటివి రొమ్ము కేన్సర్‌కు కారణాలని వెల్లడైంది. ఇప్పుడు తలకి వేసుకునే రంగు కూడా రొమ్ము కేన్సర్ రావడానికి కారణం అవుతుందని వారు అంటున్నారు. ఈ రంగులలో ఉపయోగించే రసాయనాలు దీనికి ప్రధానకారణం కావచ్చని వారు అభిప్రాయపడుతున్నారు. ఈ విషయం మీద ఇంకా కొన్ని పరిశోధనలు నిర్వహించాల్సి ఉందని వారు చెబుతున్నారు.

—అవినాష్





# ఎండల్లో రక్షణ

**ఏప్రిల్ నెల వచ్చేసింది. మేలో సూర్యుడు తన వీర ప్రతాపం చూపిస్తాడు. ఇక ఎండలు మండిపోతున్నాయి . ఉదయం పదకొండు దాటిన తర్వాత బయటకు వెళ్ళాలంటేనే భయం కలిగేలా ఉంది. ఒకవేళ ఏదైనా పని ఉండి బయటకు వెళ్ళామా ఎండ వేడిమికి చర్మం కందిపోతుంది. నల్లగా మారిపోతుంది. అలా మారకుండా ఉండడానికి చాలామంది సన్‌స్క్రీన్ లోషన్లు రాసుకుంటారు. కానీ ఆ లోషన్ల కన్నా కూడా తీసుకునే ఆహార పదార్థాలే ఎక్కువగా ఉపయోగకరం అంటున్నారు ఆరోగ్య నిపుణులు. అవి చర్మాన్ని కాపాడటమే కాకుండా శరీరానికి అవసరమైన శక్తిని కూడా అందిస్తాయట. మరింకేం ఆ పదార్థాలేంటో మీరూ తెలుసుకుని ఫాలో అయిపోండి!**

ఎండ కారణంగా చర్మం కందిపోకుండా ఉండటానికి పండ్లు చాలా ఉపయోగపడతాయి. ముఖ్యంగా దానిమ్మ, స్ట్రాబెర్రీ, జామ వంటి పండ్లలో ఉండే పోషకాలు సహకరిస్తాయి. దానిమ్మలో ఎక్కువగా దొరికే ఎల్లాజిక్ ఆమ్లం సూర్యరశ్మి నుంచి వెలువడే అతినీలలోహిత కిరణాలు మేనుపై పడకుండా అడ్డుకుంటుంది. అలాగే చర్మంలో కొత్త కణాలను ఉత్పత్తి చేసి చర్మ ఆరోగ్యాన్ని పెంపొందిస్తుంది. ఇక స్ట్రాబెర్రీలో ఎక్కువగా ఉండే విటమిన్ సి కూడా ఈ సమస్య దరిచేరకుండా కాపాడుతుంది. అలాగే బ్లూబెర్రీ, రాస్‌బెర్రీ వంటివి కూడా ఎండ నుంచి చర్మాన్ని రక్షించడంలో సమర్థవంతంగా పనిచేస్తాయి. జామలో ఎక్కువగా ఉండే యాంటీ ఆక్సిడెంట్లు, విటమిన్ సి ఎండ నుంచి చర్మాన్ని రక్షించడంతో పాటు చర్మ కేన్సర్ ఇతర మేని సంబంధిత సమస్యలు రాకుండా సంరక్షిస్తాయి.

## టొమాటోతో గుడ్ బై

మార్చి నుంచి జూన్ వరకు మూడునెలల పాటు సూర్యుడు తన వీర ప్రతాపం చూపిస్తాడు. చర్మాన్ని ఎండ నుంచి సంరక్షించుకోవాలంటే కొద్దిగా ఆలివ్ నూనెలో పావు కప్పు టొమాటో పేస్ట్ కలిపి రోజూ తీసుకోవడం వల్ల సూర్యరశ్మి వల్ల చర్మం కందిపోకుండా జాగ్రత్త పడవచ్చు. ఎందుకంటే టొమాటోలో ఎక్కువగా లభించే లైకోపిన్ అనే యాంటీ ఆక్సిడెంట్ అతినీలలోహిత కిరణాల నుంచి చర్మానికి అధిక సమయం రక్షణ కల్పిస్తుంది. అంతేకాదు ఈ రెండు పదార్థాలూ ఆరోగ్యానికి ఎంతో మంచివి.

వీటితో పాటు పుచ్చకాయ, కివీ, యాపిల్‌వంటి పండ్లు చర్మానికి ఎండ నుంచి రక్షణ కల్పిస్తాయి.

## గ్రీన్ టీ తాగితే

అధిక బరువు సమస్యతో బాధపడేవారు, ఆరోగ్యకరమైన జీవనశైలిని అనుసరించేవారు ఈ గ్రీన్ టీ ఎక్కువ తాగుతుంటారు. ఇది ఒత్తిడిని నివారిస్తుంది కూడా. ఇందులో ఉండే పోషకాలు ఆరోగ్యం, ఫిట్‌నెస్ పరంగా దోహదం చేయడం మాత్రమే కాదు, ఎండ నుంచి చర్మానికి తగిన రక్షణ సైతం కల్పిస్తాయి. ముఖ్యంగా ఇందులో ఉండే టానికామ్లం, ఇతర సమ్మేళనాలు ఎండ కారణంగా చర్మం కందిపోకుండా కాపాడతాయి. కాబట్టి ఎవరైతే రోజూ గ్రీన్‌టీ తాగుతారో వారికి సన్‌బర్న్ సమస్య చాలా తక్కువగా ఉంటుందంటున్నారు చర్మ వైద్య నిపుణులు.

## దుంపలుండగా దిగులొద్దు

బంగాళాదుంపతో చేసిన వంటకాలంటే మనలో చాలామందికి ఇష్టం. అయితే ఇది సూర్యరశ్మి నుంచి చర్మాన్ని కాపాడడంలో బాగా సహకరిస్తుంది. ముఖ్యంగా ఇందులో ఉండే పిండి పదార్థాలు ఎండ వల్ల చర్మం కందిపోకుండా రక్షిస్తాయి. దీనికి మీరు చేయాల్సిందల్లా ఒకటే, ఏమీ లేదండీ ఒక బంగాళాదుంపను మెత్తగా చేసుకుని చర్మంపై ఎండ తగిలే ప్రదేశంలో రాస్తే సరి. అంతేకాదు ఇది మేని మెరుపుదనానికి కూడా ఉపయోగపడుతుంది.

## ఇవి పాటించండి

1. కీరదోస ఎండ వేడి నుంచి ఉపశమనం కలిగించి చల్లదనాన్ని ఇవ్వడం మాత్రమే కాదు సూర్యరశ్మి నుంచి కూడా చర్మాన్ని కాపాడుతుంది. అందులో అధికంగా ఉండే నీటి శాతమే దీనికి కారణం.
2. క్యారట్లు, చిలగడ దుంపలో ఉండే బీటా కెరోటిన్ కూడా సూర్యరశ్మి ప్రభావం చర్మంమీద పడకుండా కాపాడుతుంది.
3. కొంతమంది సలాడ్లు తినడానికి ఎక్కువ ఆసక్తి చూపిస్తుంటారు. అలాంటివారు బాదం, పొద్దుతిరుగుడు విత్తనాలు వంటివి సలాడ్లలో భాగం చేసుకోవాలి. ఫలితంగా వీటిలో ఉండే విటమిన్ ఇ, యాంటీ ఆక్సిడెంట్లు వంటివన్నీ ఎండవల్ల చర్మం కందిపోకుండా రక్షిస్తాయి.
4. ముదురు రంగుల్లో ఉండే కూరగాయలు, ఆకుకూరల్ని సైతం ఆహారంలో భాగం చేసుకోవాలి. తద్వారా ఇందులో ఉండే యాంటీ ఆక్సిడెంట్లు, పోషకాలు, ఫ్రీరాడికల్ డ్యామేజ్ నుంచి చర్మాన్ని రక్షిస్తాయి. వీటన్నింటితో పాటు కలబంద, ఓట్స్, మజ్జిగ వంటివి కూడా ఎండ కారణంగా చర్మం కందిపోకుండా సంరక్షిస్తాయి. వీటన్నింటినీ ఆహారంలో భాగం చేసుకుంటే ఎండకు చర్మం కందిపోకుండా సురక్షితంగా ఉండేలా చూసుకోవచ్చు.

– నివేదిత




**కావ్యకి కంటి మీద కునుకు రావటం లేదు.**

**నైరాని ఎవరు కిడ్నాప్ చేశారో ఆన్‌లైన్ డిటెక్టివ్ తేల్చి చెప్పగానే నిద్రంతా ఎగిరిపోయింది.**

**టైమ్ చూసుకుంది.**

**అర్ధరాత్రి మూడవుతోంది.**

**ఎవరితో చెప్పాలి! సీరియస్‌గా ఆలోచిస్తోంది.**

**కాసేపటికి ఒక నిర్ణయానికి వచ్చింది. ఎవరికో ఎందుకు? అక్షయ్ నంబరుందిగా. అతనితోనే చెప్పాలి. అయిదయితే అక్షయ్ నిద్ర లేస్తాడు. అప్పటివరకూ వెయిట్ చేయదల్చుకుంది. దుప్పటి కప్పుకుని మంచం మీద వాలింది.**

ఎప్పుడు నిద్ర పట్టిందో తెలీదు.

మర్నాడు మధ్యాహ్నం పన్నెండింటికి మెలకువొచ్చిందామెకి.

టైమ్ చూసుకుని ఉలిక్కిపడింది. అక్షయ్‌కి ఫోన్ చేసింది.

ఫోన్ రింగవుతోంది.

ఎత్తటం లేదు.

ఏదైనా పనిలో ఉన్నాడేమో!

తన పనులు ముగించుకుని మళ్ళీ చేసింది.

ఫోన్ ఎత్తట్లేదు ఎన్నిసార్లు చేసినా.

కొద్దిగా అవమానంగా అనిపించిందామెకి.

"అదే సీమ చేస్తే ఎత్తడా?" ఉడుకుమోత్తనంగా అనిపించింది.

కాసేపయ్యాక మరో టెన్షన్ బయలుదేరిందామెలో.

అక్షయ్ బాగానే ఉండి ఉంటాడా? లేకపోతే అతను కూడా నైరా లాగే ఏదైనా ప్రమాదంలో పడ్డాడా?

మళ్ళీ ఫోన్ చేసింది.

ఈసారి ఫోన్ కట్ చేశాడు అవతల్నుంచి.

తన మీద తనకే జాలేసింది కావ్యకి.

టీవీ చూస్తుండగా ఫోన్ మోగింది.

ఎగిరి దూకి ఫోన్ అందుకుంది.

"హర్ష" ఫోన్ మీద అక్షరాలు కనపడుతున్నాయి.

అక్షయ్ ఫ్రెండ్ అయినందుకు ఇదివరకా పేరు కనబడితే ఆత్మీయంగా అనిపించేది. ఇంత నమ్మక ద్రోహం చేస్తాడా?

కుత కుత ఉడికిపోయింది కావ్య.

విసురుగా ఫోనెత్తి "చెప్పు హర్షా!" అంది.

ఆమె స్వరంలో వినబడిన కాఠిన్యానికి కొద్దిగా ఆశ్చర్యపోయాడు హర్ష.

"ఆర్ యూ ఆల్‌రైట్?" అడిగాడు.

సర్దుకుంది కావ్య. ఇప్పుడే బయట పడకూడదు అనుకుంది.

"ఎందుకు హర్షా? నేను బాగున్నాను" అమాయకంగా అంది.

"ఓకే. పొద్దుటి నుంచి అక్షయ్‌కి ఫోన్స్ చేస్తున్నావంట. బిజీగా ఉండి ఎత్తట్లేదట. ఏదైనా అర్జంటేమో నన్ను కనుక్కోమన్నాడు".

ఒళ్ళు మండిపోయింది కావ్యకి.

తన ఫోన్ ఆన్సర్ చేయటానికి టైమ్ ఉండదు కానీ హర్షకి చేసి తనెందుకు చేసిందో కనుక్కోమంటాడా?

అంతే. హర్షలాగా వెన్నుపోటు పొడిచేవాళ్ళనే అక్షయ్‌లాంటి వాళ్ళు నమ్ముతారు.

తనకి అతనంటే పిచ్చని తెలుసు కదా!

అందుకే చులకన.

"పొరబాటున డయల్ అయినట్లుంది. ఫోన్‌లో ఏదో ప్రాబ్లమ్" ముభావంగా చెప్పింది.

హర్ష ఫోన్ పెట్టేశాక మంచం మీద దిండులో తల పెట్టుకుని భోరుమంది.

సాయంత్రం ఆరవుతోంది.

కొద్దిగా చీకటి పడుతోంది.

దిగులుగా ఉందామెకి.

ఇంతలో సడన్‌గా వచ్చిందామెకి ఆలోచన.

ఒకవేళ హర్ష అక్షయ్‌ని కూడా ఏమయినా చేసుంటాడా? తను ఫోన్లు చేస్తుంటే కంగారు పడి కట్ చేసి తన ఫోన్‌తో చేశాడా?

ఆమెలో డిటెక్టివ్ నిద్ర లేచాడు.

హర్షకి ఫోన్ చేసింది.

ఎత్తగానే "అక్షయ్‌కి ఇవ్వవా ఫోన్?" అంది.

ఏంటో ఇవాళ ఈ పిల్ల తిక్కతిక్కగా ప్రవర్తిస్తోంది అనుకున్నాడు హర్ష.

"అక్షయ్ ఇక్కడ లేడు" చెప్పాడు.

"సరే!" ఫోన్ పెట్టేసింది.

రాత్రి పదవుతుండగా ఫోన్ వచ్చింది అక్షయ్ నుంచి.

'అక్షయ్' అన్న అక్షరాలు ఫోన్ మీద చూడగానే సంతోషంతో మాటలు రావట్లేదామెకి.

అత్యుత్సాహంతో ఫోన్ ఎత్తబోయి కింద పారేసుకుంది. ఫోన్ కట్ అయిపోయింది.

మళ్ళీ తనే చేసింది వెంటనే.

"కావ్యా! ఏం కావాలి?" మృదువుగా ఉందతని గొంతు.

అప్పటివరకూ అతను తన ఫోన్ ఎత్తలేదనే

### జరిగిన కథ

*అక్షయ్, కావ్య, సీమ, హర్ష ఓ మల్టీ నేషనల్ కంపెనీలో పనిచేస్తుంటారు. అక్షయ్ వాళ్ళ అక్కా, బావ యాక్సిడెంట్‌లో చనిపోవడంతో, వారి కూతురు నైరాని తన సంరక్షణలోకి తీసుకుంటాడు అక్షయ్. ఒకరోజు నైరా కనిపించకుండా పోతుంది. పోలీస్ ఇన్వెస్టిగేషన్ మొదలవుతుంది. పేపర్లలో వచ్చిన వార్తల ఆధారంగా, సీసీ ఫుటేజ్‌ల ద్వారా, ఇన్‌స్పెక్టర్ శ్రీకాంత్ ఇచ్చిన సమాచారం ఆధారంగా నైరా ఆచూకీ కోసం రకరకాలుగా ప్రయత్నిస్తుంటాడు అక్షయ్. ఆ ప్రయత్నాల్లో భాగంగా ఎంతో మంది చిన్న పిల్లలను కాపాడతాడు. ఓ పెద్ద బిజినెస్ మాగ్నెట్ మనవరాలికి హార్ట్ ట్రాన్స్‌ప్లాంట్ చేస్తున్నారని తెలుసుకొని, డోనర్‌గా ఆ హాస్పిటల్లోకి ప్రవేశిస్తాడు అక్షయ్. అక్కడ నలుగురు పిల్లలని క్షేమంగా బయటకు పంపించి, ఆ హాస్పిటల్‌ని మూయించేస్తాడు. నైరా ఆచూకీ కోసం కావ్య ఒక ఆన్‌లైన్ డిటెక్టివ్ ఏజెన్సీని కాంటాక్ట్ చేస్తుంది. ఆన్‌లైన్ డిటెక్టివ్ వద్దనుంచి ఓ ప్రైవేట్ మెసేజ్ వస్తుంది. నైరాని హర్ష కిడ్నాప్ చేసుండొచ్చని చెబుతాడు డిటెక్టివ్.*

*ఆ తర్వాత...*

విషయం మర్చిపోయిందామె.

"అక్షయ్ నైరాని కిడ్నాప్ చేసిందెవరో తెలిసింది" ఉద్వేగంగా ఉందామె గొంతు.

"ఏంటీ?" అరిచినట్లుగా ఉందతని గొంతు.

"ఎలా ఉంది నైరా? విడిపించారా?" ప్రశ్న మీద ప్రశ్న వదులుతున్నాడు.

"మొత్తం విను మరీ" సాగదీసింది కావ్య.

తను నైరా కిడ్నాప్ గురించిన వార్త ఆన్‌లైన్ డిటెక్టివ్‌ల వెబ్‌సైట్‌లో పోస్ట్ చేయటం, వాళ్ళు రీసెర్చ్ చేసి తనకు ఎవరయ్యుండవచ్చో చెప్పటం మొత్తం చెప్పింది.

చివరలో చాడీగా చెప్పింది.

"ఇదంతా చేసింది హర్ష అట!"

"ఫోన్ పెట్టేయి" కోపంగా అన్నాడు అక్షయ్.

బిత్తరపోయింది కావ్య.

"ఇంకెప్పుడూ పిచ్చిపిచ్చి వార్తలు మోసుకురాకు. నిజంగా నైరా ఎక్కడుందో తెలిసిందను కున్నాను. వాడొక్కడే నాకున్నది. వాడిని కూడా దూరం చేయకు" ఫోన్ పెట్టేశాడు.

"అక్షయ్ ఇంత మూర్ఖంగా నమ్ముతున్నాడేమిటి హర్షని. అసలు తనని ఎందుకు తిట్టినట్లు?" ఆమెకి కాసేపు ఏమీ అర్థం కాలేదు.

అక్షయ్‌కి ఏమీ తెలీదు. అమాయకుడు.

హర్ష విషయం పరిశోధించి తనే అతని గుట్టు రట్టు చేయాలి.

డిసైడయి పోయింది.

***

రాత్రి పదవుతోంది.

శ్రీనగర్‌కాలనీ మెయిన్‌రోడ్.

వీధిలైట్లతో ఇంకా వెలుతురుగా, సందడిగా కనబడుతోందా ప్రాంతం.

అప్పుడప్పుడూ వేగంగా జూబ్లీహిల్స్ వైపు దూసుకుపోతున్నాయి వాహనాలు.

ఇప్పుడంటే సిటీ మొత్తం హైటెక్ సిటీ వైపు షిఫ్ట్ అయిపోవటంతో తగ్గింది కానీ ఒకప్పుడు చాలా రద్దీగా ఉన్న ప్రాంతమది. అర్ధరాత్రి వరకూ పట్టపగలు లాగే అనిపించేది.

'బిగ్‌బైట్' బేకరీ షట్టర్స్ దించటం కనబడుతోంది.

నైరా దొరికాక 'బిగ్‌బైట్'కి తీసుకెళ్ళాలొకసారి అనుకున్నాడు అక్షయ్.

జేబుల్లో చేతులు పెట్టుకుని తలకు హుడ్ వేసుకుని, జీన్స్, స్లిప్పర్స్‌తో ఉన్నాడతను.

శ్రీనగర్‌కాలనీ పార్క్ కనబడుతోంది.

ఎదురుగా శ్మశానవాటిక.

ఒకపక్కగా అన్ని బ్యాంక్‌లకి చెందిన ఏటిఎమ్ సెంటర్లు, బ్యూటీ పార్లర్లు ఉన్న బిల్డింగ్. అక్కడే మెట్ల మీద కూర్చుని ఎదురుచూస్తున్నాడు అక్షయ్.

రోడ్ మీద సందడి తగ్గుతున్న కొద్దీ పార్క్‌లో కదలికలు మొదలవడం గమనిస్తున్నాడు.

డ్రగ్ మాఫియా అమ్మకాలతో సహకరించటానికీ, స్మగ్లింగ్ ప్యాకింగ్ లాంటి పనులకూ చిన్న పిల్లల్ని వాడుతోందని అంతకుముందే ఆన్‌లైన్ న్యూస్‌లో చదివాడతను.

చిన్నపిల్లలను ఎవరూ అనుమానించరనేది దీనికి ప్రధాన కారణమట.

కొంతమంది పిల్లల్ని ప్రలోభపెట్టి డబ్బు ఆశ చూపించి బిజినెస్‌లో దించితే, మరికొందరిని ఎత్తుకొచ్చి బలవంతంగా ఈ పనులు చేయిస్తారట.

ముఖ్యంగా విదేశీయులతో డీల్స్ కుదుర్చుకోవటానికి, వారితో సంభాషణలు జరపటానికి ఇలా కిడ్నాప్ చేయబడిన చదువుకున్న పిల్లల్ని వాడతారు.

ఓపిగ్గా ఎదురు చూస్తున్నాడు అక్షయ్.

ఏవైనా లీడ్స్ దొరుకుతాయని రీసెర్చ్ చేస్తున్న క్రమంలో సాఫ్ట్‌వేర్ ఫీల్డ్‌లో, తమ ఆఫీస్‌లో వాళ్ళెంత మంది క్రాక్, హెరాయిన్ లాంటి వాటిని సరదాగా వీకెండ్స్‌లో తీసుకుంటారో తెలుసుకుని ఆశ్చర్యానికి లోనయ్యాడతను.

దాదాపు పన్నెండు దాటాకా బైక్స్ మీద దిగారు నలుగురు.

అలవాటయిన కష్టమర్సేమో... వాళ్ళ దగ్గరకు పరిగెత్తుతున్నట్టు వెళ్తున్నారు.

డబ్బులు చేతులు మారుతున్నాయి.

తెల్లటి పొడి సిగరెట్ల ఆకారంలో పేపర్లలో చుట్టి ఉంది.

పోలీస్‌జీప్ సైరన్ కొడుతూ మరో వైపునుంచి దూరంగా వెళ్తోంది.

ఆ పూటకి డ్రగ్స్ దొరికిన వారిలో చెప్పలేనంత ఆనందం.

అక్కడే పార్క్‌లో చెట్ల వద్ద కూలబడి పోతున్నారు, ఆగలేనట్లు.

కొందరా డ్రగ్స్‌ని తగరపు కాగితంలో పోసి, లైటర్‌తో వెలిగించుకుని నోటితో లోపలికి పీలుస్తున్నారు. మరికొందరు ముక్కుతో పీలుస్తుంటే, ఇంకొందరు డ్రగ్స్‌ని ఇంజక్ట్ చేసుకుంటున్నారు.

మెల్లిగా ఒకతని దగ్గరకు చేరుకున్నాడు అక్షయ్.

అప్పుడే ఇంజెక్ట్ చేసుకున్నట్లున్నాడతను.

మరేదో లోకంలో ఉన్నట్లు ప్రవర్తిస్తున్నాడతను.

పదిహేను నిమిషాల నుంచీ అరగంట వరకూ మాత్రమే ఉండే వాటి ప్రభావం కోసం మనుషులు ఎందుకు వాటికి బానిసలవుతారో అర్థం చేసుకోవడం కష్టం.

జీవితంలో ఒత్తిళ్ళను తట్టుకోవటానికీ, ఫెయిల్యూర్స్‌ని మర్చిపోవడానికీ సిగ్గు, తమ మీద తమకు నమ్మకం లేకపోవటం ఇటువంటి వాటన్నిటికీ ముందుగా మొదట్లో దాన్ని ఆశ్రయిస్తారు. రానురాను అదే వ్యసనంగా మారుతుంది.

పక్కనే కూర్చుని పలకరించాడతణ్ణి అక్షయ్.

కళ్ళు అరమోడ్పులుగా చేసి చూశాడు.

సంతోషంగా ఉందతని మోహం.

ఎంతో సాధించిన వారి మొహాల్లో కనబడే



**అక్షయ్‌కి ఫోన్ చేసింది కావ్య. నైరాని కిడ్నాప్ చేసిందెవరో తెలిసిందని ఉద్వేగంగా చెప్పింది. అది విని నైరా ఎలా ఉందంటూ ప్రశ్నల మీద ప్రశ్నలు వదిలాడు అక్షయ్. అన్నీ వివరంగా చెప్పిందామె. నైరాని కిడ్నాప్ చేసింది హర్ష అనికూడా చెప్పింది. ఆమె మాటలు అక్షయ్ నమ్మాడా? ఆ తరువాత అతడు ఎలాంటి యాక్షన్ తీసుకున్నాడు?**

తృప్తి. ఒలింపిక్ గోల్డ్ మెడలిస్ట్, మొహంలో కనబడే సెన్స్ ఆఫ్ అఛీవ్‌మెంట్ కనబడుతోందతని మొహంలో.

'యు ఫోరియా' అనుకున్నాడు అక్షయ్.

మరో పది నిమిషాలకి మామూలుగా అయ్యాడు అతను.

ఇంకో షాట్ తీసుకోబోతూ ప్రశ్నార్థకంగా చూశాడు అక్షయ్ వైపు.

"కొకెయిన్ కావాలి. నేనీ ఊరికి కొత్త" చెప్పాడు అక్షయ్.

తల ఊపాడతను.

కాసేపాగమన్నట్లు సైగ చేశాడు.

అతని చేతులు మొత్తం ఇంజక్షన్స్ గాట్లు, గుర్తులు ఉండటం గమనించాడు అక్షయ్. కళ్ళ చుట్టూ నల్లటి వలయాలు.

కొద్దిసేపయ్యాక ఏదో నంబర్‌కి ఫోన్ చేశాడు.

తన స్నేహితుడికి సప్లయ్ అవసరమని ఫోన్లో చెప్తున్నాడు.

తర్వాత అక్షయ్‌కి ఫోన్ నంబరు ఇచ్చాడు.

ఆ టైమ్‌లో సప్లయ్ ఎక్కడ దొరుకుతుందో చెప్పాడు.

థాంక్స్ చెప్పి వెళ్ళబోతూ చీకట్లో బాణం వేశాడు అక్షయ్.

"కొన్నాళ్ళ క్రితం ఇక్కడొక చిన్నపిల్లవాడు సప్లయ్ చేసేవాడు. అతనుండటం లేదా ఇప్పుడు?"

నవ్వాడతను గట్టిగా.

"పోలీస్ గస్తీ ఎక్కువగా ఉండే ప్రాంతాల్లో అమ్మకాలకు చిన్నపిల్లల్ని వాడతారు. ఇది వరకు పోలీసుల కన్ను ఈ ఏరియా మీద ఎక్కువ ఉండేది. ఒకో ఏరియాలో పోలీసువాళ్ళని డ్రగ్ మాఫియా కొనేస్తుంది. అటువంటి చోట్ల బహిరంగంగానే అమ్మకాలు జరుగుతాయి. ఇప్పుడిది మీకు సేఫ్ ఏరియా" కన్ను వింక్ చేశాడు.

***

అతను చెప్పిన ప్రదేశానికి చేరుకున్నాడు అక్షయ్.

పోలీస్‌స్టేషన్‌కి కూతవేటు దూరంలో ఉందా గల్లీ.

చిన్న, చిన్న రేకుల ఇళ్ళున్నాయి అక్కడంతా.

ఇళ్ళ మధ్యగా పెంకులతో వేసిన దారి.

ఒక లైట్ మాత్రమే వెలుగుతోంది ఆ వీధిలో.

చీకటిగా, నిర్మానుష్యంగా ఉంది.

ముందుకు నడుస్తున్నాడు అక్షయ్.

సడన్‌గా శబ్దం వినిపించి ఆగిపోయాడు.

పక్కనే ఉన్న సందులో నుంచి వినబడుతోంది.

అక్కడే ఆగిపోయాడతను.

గోడ చాటున నిలబడి చూడసాగాడు.

ఎవరో ముగ్గురు కలిసి ఒక మనిషిని చితక బాదుతున్నారు.

"పోలీసులకి ఇనఫర్మేషన్ ఎందుకిచ్చావ్?" కొడుతున్నారు.

ముక్కు, నోరంతా రక్తం కారుతోందతనికి.

మోకాళ్ళ మీద కూర్చున్నాడు.

చేతులు రెండూ జోడించి బతిమాలుతున్నాడు.

"నేను కావాలని ఇవ్వలేదు. డ్రగ్స్ అమ్ముతూ వాళ్ళకు దొరికిపోయాను. వాళ్ళు పోలీస్ స్టేషన్‌లో పెట్టిన చిత్రహింసలకు తట్టుకోలేక చెప్పాల్సి వచ్చింది".

కాలితో తన్నాడొకతను.

కిందపడి లుంగచుట్టుకుపోతున్నాడు.

"ఇంకెప్పుడూ చేయను. వదిలేయండి" బతిమాలుతున్నాడు.

"ఏంచేద్దాం రా?" అడిగాడు ఒకతను మరో వైపు చూస్తూ.

ఆ ప్రాంతం నీడగా ఉండటంతో అప్పటి వరకూ అక్షయ్‌కి కనబడలేదు.

కొద్దిగా ముందుకొచ్చాక ఒక పిల్లవాడు వెలుతురులో కనిపిస్తున్నాడు. పన్నెండేళ్ళ వయసుంటుంది.

చేతిలో గన్.

గన్‌ని కింద పడి ఉన్న అతని కణతకి ఆనించాడతను.

మరుక్షణం గన్ పేలింది. సైలెన్సర్ వల్ల పెద్దగా శబ్దం రాలేదు. రక్తం మడుగులు కడుతోంది.




"నో మెర్సీ!" అన్నాడు మిగతావాళ్ళ వైపు చూస్తూ.

ఆ పిల్లవాడి తల మీద చేయి వేసి నిమిరాడు ఆ గ్రూప్‌లో లీడర్‌గా కనబడుతున్న వాడు.

తర్వాత పెద్దగా నవ్వి అందరూ చేతులు కలుపుకున్నారు.

అక్కణ్నుంచీ వాళ్ళు కదిలారు.

అక్షయ్‌కి కడుపులో తిప్పుతోంది. వాంతి అయ్యేట్టుగా ఉంది.

"చిన్నపిల్లల్లో ఇంత క్రూరత్వమా?'

కింద కూలబడిపోయాడు.

***

కెఫెటేరియాకి వెళ్ళటానికి లిఫ్ట్‌లోకి ఎక్కాడు హర్ష.

రోజూ పదకొండవగానే అతను టీ బ్రేక్ తీసుకుంటాడు.

అదే సమయంలో లిఫ్ట్ కిందకి వెళ్తోంది. కావ్య ఆఫీసుకి వచ్చి, తమ ఫ్లోర్‌లోకి వెళ్ళటానికి ఎలివేటర్ ఎక్కింది.

అనుకోకుండా ఫోర్త్‌ఫ్లోర్‌లో రెండు లిఫ్ట్‌లూ ఆగాయి.

లిఫ్ట్‌లు రెండూ ఎదురు బొదురుగా ఉన్నాయి.

హర్ష కావ్యని చూసి చెయ్యి ఊపాడు.

కావ్య స్టిఫ్‌గా అయింది.

ఆమెలో డిటెక్టివ్ ఆమెని కుదురుగా ఉండనీయట్లేదు.

హర్ష కిందికెళ్తున్నాడు. ఎలాగైనా నైరాని ఎక్కడ దాచారో కనిపెట్టాలి. అతని గుట్టు రట్టు చేయాలి. అక్షయ్ కళ్ళలో ఆనందం చూడాలి.

ఫైవ్ ఫ్లోర్‌లో లిఫ్ట్ ఆగగానే బయటకు దూకింది.

కిందకి వెళ్ళటానికి బటన్ ప్రెస్ చేసింది.

ఒక నిముషం గడిచింది.

ఎంతకీ లిఫ్ట్ రావటం లేదు. ప్రతి ఫ్లోర్‌లో ఆగుతూ, పడుతూ లేస్తూ వస్తున్నట్లుంది.

ఆగలేక మెట్లున్న వైపు దారి తీసింది.

గబగబా మెట్లు దిగి కెఫెటేరియా దగ్గర బాడ్జ్ స్వయిప్ చేసింది. తలుపు కొద్దిగా తోసి తల మాత్రం లోపలికి పెట్టి చూడసాగింది.

హర్ష టీ కౌంటర్ దగ్గరకెళ్ళి టీ తెచ్చుకున్నాడు. అక్కడే ఒక టేబుల్ దగ్గర కూర్చుని న్యూస్ పేపర్ తిరగేస్తున్నాడు.

కాసేపు పరిశీలనగా చూశాక వెనక్కి తిరిగిన కావ్య ఉలిక్కిపడింది.

ఆమె వెనుక పెద్ద లైన్ తయారయింది.

అందరూ శబ్దం చేయకుండా కుతూహలంగా కెఫెటేరియాలోకి చూస్తున్నారు.

"ఎనీథింగ్ ఇంటరెస్టింగ్?" వెనకున్నామె అడిగింది.

కావ్యని అడుగుతుందే కానీ ఆమె దృష్టంతా లోపలకే ఉంది. ఒక్కసెకనులో ఏదయినా అద్భుతాన్ని మిస్ అవుతానేమో అన్నంత ఆసక్తి.

"ఏమీలేదు. డోర్ స్టక్ అయింది" చెప్పి లోపలికి నడిచింది కావ్య.

ఒక టేబుల్ దగ్గర కూర్చుని ల్యాప్‌టాప్ ఓపెన్ చేసింది.

స్క్రీన్ వెనక తల దాచుకుని అతణ్ణి గమనిస్తోంది అప్పుడప్పుడూ.

ఎవరికీ ఫోన్లు కూడా చేయట్లేదు అతను.

ఈ అక్షయ్, అతని ఫ్రెండ్స్ ఇంత బోరింగ్ క్యారెక్టర్స్ ఏంటి? చిరాగ్గా ఉంది కావ్యకి. ఎంతసేపు న్యూస్ చదువుతాడు?

ఉన్నట్లుండి తలెత్తి చూసిన కావ్య అదిరిపడింది. ఎప్పుడు వచ్చాడో ఎదురుగా కూర్చున్నాడు హర్ష.

ఆమె కంగారు పడుతుండటం చూసి ఆశ్చర్యపోయాడు హర్ష.

"కావ్య, ఆర్ యూ ఓకే?" అడిగాడు.

తల అడ్డంగా, నిలువుగా ఊపింది. ఏమి చెప్పాలో అర్థం కాలేదామెకు. ఇలా డైరెక్టుగా వచ్చి అడుగుతాడనుకోలేదు ఆమె. ప్రిపేర్డ్‌గా లేదు.

"ఏదయినా టెక్నికల్ ఛాలెంజెస్ ఉంటే నన్ను అడుగు. ఎనీ టైమ్" చెప్పాడు.

లేచి రెండడుగులు ముందుకు వేసి మళ్ళీ వెనక్కొచ్చి అన్నాడు.

"అక్షయ్‌ని మిస్ అవుతున్నావు కదా?"

ఒక్క క్షణం సిగ్గుపడబోయింది కావ్య.

ఇంతలోకి గుర్తొచ్చింది అక్షయ్‌కి ద్రోహం చేసింది అతనే. తమతో తీయగా మాటలు చెప్తున్నాడు.

మొహం మాడ్చి "నేను వెళ్ళాలి" అంది.

భుజాలు ఎగరేసి 'ఓకే' అన్నాడు.

వింతగా చూసి కెఫెటేరియాకి ఉన్న రెండో డోర్ తెరుచుకుని బయటికి వెళ్ళాడు.

ఒక్క నిముషం వెయిట్‌చేసి అతను వెళ్ళిన వైపే పరుగెత్తింది. కానీ ఈ టైమ్‌లో బయటికి ఎందుకెళ్తున్నాడు? ఏదో జరుగుతోంది. చెట్ల చాటున నక్కుతూ అతన్ని ఫాలో చేసింది.

కొంతదూరం నడిచాక స్మోకింగ్‌రూమ్ దారి పట్టాడు అక్షయ్.

స్మోకింగ్ రాయుళ్ళకోసం విడిగా ఒక రూమ్ లాంటిది ఉందక్కడ. ఎక్కడపడితే అక్కడ సిగరెట్లు తాగకుండా, ఆ పొగతో చుట్టుపక్కల ఉన్నవాళ్ళు సెకండ్ హాండ్ స్మోక్ బారిన పడకుండా, ఆఫీస్ ఆవరణ సిగరెట్ పీకలతో నిండకుండా ఉండటానికి చేసిన ఏర్పాటది.

ఇదివరకు చాలాసార్లు విన్నది కానీ అటు రావటం అదే మొదటిసారి.

రూమ్ లోపలనుంచి బాయిలర్ పొగలా ఆవిర్లు బయటికి వస్తున్నాయి. చుట్టూ తెల్లని పొగ.

ఈ రూమ్‌లోనే ఆఫీస్‌లోని అత్యంత కాన్ఫిడెన్షియల్ విషయాలు పెదవి దాటేది. దమ్ముకొట్టి కళ్ళు అరమోడ్పులు చేసి ఎంతటి రహస్యాన్నయినా, ఆటో స్మోకర్ పట్ల పాజిటివ్ దృక్పథంతో బయట పెట్టేస్తారు. ఆఫీస్‌లో రాబోయే కొద్ది నెలల్లో జరగబోయే ఛేంజెస్, కొత్తగా ప్రవేశపెడ్తున్న ప్రొడక్ట్స్, సరికొత్త టెక్నాలజీ ట్రెండ్స్, లీడర్‌షిప్ టీమ్ చేస్తున్న వ్యూహాత్మక తప్పిదాల నుంచీ, సినిమాలు, రాజకీయాలు అన్నీ ఎటువంటి సంకోచాలు లేకుండా చర్చిస్తారు.

పై స్థాయి అధికారుల నుంచి, కొత్తగా ఉద్యోగంలో చేరిన ఫ్రెషర్స్‌వరకూ భాయీ భాయీ అనుకుంటారక్కడ.

కొత్తగా ఏవయినా జాబ్ పోస్టింగ్స్ పడినా, ప్రమోషన్లు కావాలన్నా ముందుగా అక్కడి వాళ్ళకే ప్రాధాన్యం ఉంటుంది. అక్కడ జరిగే నెట్‌వర్కింగ్ కోసం కొంతమంది బలవంతంగా స్మోకింగ్ అలవాటు చేసుకుంటారట.

కాసేపు బయట వెయిట్ చేసింది కావ్య.

ఎంతకీ హర్ష బయటికి రావటం లేదు. లోపలకు వెళ్ళతగిన ప్రదేశం కాదు. కొద్దిసేపు అక్కడే తచ్చాడి వెనక్కొచ్చేసింది.

అసలు విషయం మర్చిపోయిందామె. ఆమెను తీవ్రంగా ఆలోచింపచేస్తున్న విషయం.. స్మోకింగ్ రూమ్‌లో యాష్‌ట్రేలు ఉంటాయా? లేకపోతే పెద్ద, పెద్ద డస్ట్‌బిన్స్ చుట్టూ కూర్చుని స్మోక్ చేస్తూ మాట్లాడుకుంటారా?

***

'టీమ్ అవుటింగ్' ఈమెయిల్ వచ్చింది అందరికీ. ప్రతి సంవత్సరం సేవింగ్స్‌ని బట్టి, వచ్చే లాభాలను బట్టి టీమ్స్ వారీగా బడ్జెట్ కేటాయిస్తారు. దాన్ని బట్టి ఆ సంవత్సరం ఎన్నిసార్లు టీమ్‌ని అవుటింగ్‌కి కానీ, లంచ్ లేదా డిన్నర్‌లకి కానీ తీసుకెళ్ళొచ్చు అనేది మేనేజ్‌మెంట్ నిర్ణయిస్తుంది.

'లియోసియా రిసార్ట్స్'కి తీసుకెళ్తారట ఈసారి. ఓవర్‌నైట్ స్టే.

శనివారం పొద్దున బయల్దేరి వెళ్ళి ఆదివారం రాత్రి వచ్చేలా ప్లాన్ చేశారు.

"సెలవు రోజుల్లో కూడా ఈ ఆఫీస్ వాళ్ళ మొహాలు చూడాలా?" విసుగ్గా అనిపించింది కావ్యకి. ఇన్విటేషన్ ఈమెయిల్ డిక్లయిన్ కొట్టింది.

మరుక్షణం ఆమె ముందున్నాడు రాజేష్.

ఆఫీస్‌లో అందరితో కలిసిమెలిసి ఉండాలనీ, ఇలాంటి అవుటింగ్స్ వల్ల బెరుకుపోయి అందరితో పరిచయాలు ఏర్పడతాయనీ, టీమ్ స్పిరిట్, తొక్క, తోలు అని పెద్ద ఉపన్యాసం ఇచ్చాడు.

"సాంబగారు ఫొటోతో సహా ఏమయిపోయాడో, వీడు మళ్ళీ రెచ్చిపోతున్నాడు" విచారంగా అనుకుంది కావ్య.

తప్పకుండా వస్తానని ఒట్టేయించుకుని కదిలాడు.

సీమ ఎక్కడినుంచీ వచ్చిందో రాజేష్ ఎదురుగా నిలబడింది.

ఉత్సాహంగా ఉందామె.

"రాజేష్, అవుటింగ్ ప్లాన్ చేసినందుకు థాంక్యూ!" చెప్పింది.

బలవంతంగా నవ్వాడతను.

ఆ రోజు రెస్టారెంట్‌లో డిన్నర్‌కి వెళ్ళినప్పుడు కావాలనే తనని కొట్టిందో, నిజంగా తాగిన మత్తులో అలా ప్రవర్తించిందో ఇప్పటికీ అతనికి మిస్టరీయే.

ఆ మర్నాడు ఆఫీస్‌కి రాగానే అసలేమీ తెలీనట్లు అమాయకంగా మాట్లాడించింది. ఒకవేళ మత్తులో కొట్టి ఉంటే ఇంటికి మాత్రం ఎలా సురక్షితంగా చేరింది?

రోజూ ఒక అరగంట సమయాన్ని ఆ రోజుటి సంఘటనను నెమరు వేసుకుని, విశ్లేషించడానికి వాడుతున్నాడతను. అయినా లాభం లేకపోయింది. అన్నీ అంతుచిక్కని ప్రశ్నలే.

"ఫన్ ఈవెంట్స్, గేమ్స్, స్పోర్ట్స్ ప్లాన్ చేద్దామా?" అడుగుతోంది ఉత్సాహంగా.

రాజేష్‌కి ఆమె కళ్ళల్లోని ఆ మెరుపు చూసిన ప్రతిసారీ భయం వేస్తోంది.

కరుడుకట్టిన తీవ్రవాది ఎక్కుపెట్టిన గన్ నుంచి వస్తున్న లేజర్ కిరణాల్లా అనిపిస్తున్నాయతనికి.

మొదటిసారిగా అతనికి అందమైన ఆడపిల్లను చూస్తే వెన్నులో నుంచీ వణుకుపుడుతోంది. అప్పుడు తట్టిందతనికి.

కావ్య తనను చూసి ఎంతగా భయపడుతుందో, తను సీమను చూసి అంతకంటే రెట్టింపు భయపడుతున్నాడు.

అతను గుడ్లప్పగించి చూస్తుండగానే ఈవెంట్ మేనేజ్‌మెంట్ బాధ్యత అంతా నెత్తికెత్తుకుంది సీమ.

**(ఇంకా వుంది)**

## మనమీదేనర్రోయ్!

సరసి








ఏప్రిల్ 12 నుంచి
ఏప్రిల్ 18 వరకు

శ్రీ బిజుమళ్ళ బిందుమాధవశర్మ



### మేషం (మార్చి 21 - ఏప్రిల్ 20 మధ్య పుట్టినవారు)

వేడుకలు, వృత్తి, వ్యాపారాలు, పెట్టుబడులపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురు, శుక్రవారాల్లో పన్నులు, బీమా, పెన్షన్ వ్యవహారాలపై దృష్టి సారిస్తారు. రుణాలు మంజూరవుతాయి. పెట్టుబడులు లాభిస్తాయి. ఆర్థిక పరిస్థితిని సమీక్షించుకుంటారు. 15, 16 తేదీల్లో బంధుమిత్రుల వైఖరి ఆవేదన కలిగిస్తుంది. ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. సంకల్పం ఫలిస్తుంది. 17, 18 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో కొత్త వ్యూహాలు అమలు చేసి సత్ఫలితాలు సాధిస్తారు. ప్రముఖులను కలుసుకుంటారు. కొత్త ప్రాజెక్టుల ప్రారంభానికి తగిన సమయం.



### వృషభం (ఏప్రిల్ 21 - మే 21 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, రుణప్రయత్నాలు, విద్యా విషయాలు, సమావేశాలకు ఈ వారం ప్రాధాన్యం ఇస్తారు. బుధ, గురు, శుక్రవారాల్లో వేడుకల్లో పాల్గొంటారు. భాగస్వామికి సంబంధించి కీలక సమాచారం అందుకుంటారు. న్యాయ, రక్షణ, విదేశీ వ్యవహారాల రంగాల వారికి శుభప్రదం. ప్రియతములతో ప్రయాణాలు, చర్చలు ఉల్లాసం కలిగిస్తాయి. 15, 16 తేదీల్లో గత అనుభవాలతో ఆర్థికపరమైన లక్ష్యాలు సాధిస్తారు. రుణప్రయత్నాలు ఫలిస్తాయి. సంస్మరణల్లో పాల్గొంటారు. 17, 18 తేదీల్లో ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలకు అనుకూలం. శుభకార్యాల్లో పాల్గొంటారు. బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు.



### మిథునం (మే 22 - జూన్ 21 మధ్య పుట్టినవారు)

వేడుకలు, పెట్టుబడులు, ఉన్నత విద్య, సమావేశాలు, బృంద కార్యక్రమాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురు, శుక్రవారాల్లో బంధుమిత్రులతో విందు వినోదాల్లో పాల్గొంటారు. కొత్త పరిచయాలు లక్ష్య సాధనకు ఉపకరిస్తాయి. వృత్తి, వ్యాపారాల్లో ఆర్థికంగా ప్రోత్సాహకరం. 15, 16 తేదీల్లో పెట్టుబడుల్లో ఆచితూచి వ్యవహరించాలి. ప్రియతముల కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. పోటీల్లో విజయం సాధిస్తారు. 17, 18 తేదీల్లో ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. రుణప్రయత్నాలు ఫలిస్తాయి. షేర్లు, బ్యాంకు లావాదేవీలు లాభిస్తాయి. బహుమతులు ఇచ్చిపుచ్చుకుంటారు.



### కర్కాటకం (జూన్ 22 - జులై 22 మధ్య పుట్టినవారు)

వృత్తి, వ్యాపారాలు, శ్రీవారు, శ్రీమతి విషయాలు, పెట్టుబడులపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురు, శుక్రవారాల్లో వృత్తి వ్యాపారాల్లో సృజనాత్మకంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. చిన్నారుల వైఖరి ఉల్లాసం కలిగిస్తుంది. పెద్దల సహకారంతో చేపట్టిన పనులు పూర్తి చేస్తారు. ప్రేమానుబంధాలు బలపడతాయి. 15, 16 తేదీల్లో ఉద్యోగ వ్యాపారాల్లో ప్రోత్సాహకరంగా ఉంటుంది. పెద్దల ఆరోగ్యం కలవరపెడుతుంది. ఉన్నత పదవులు అందుకుంటారు. 17, 18 తేదీల్లో ప్రముఖులను కలుసుకుంటారు. సమావేశాలు, వేడుకల్లో గౌరవ మన్ననలు అందుకుంటారు. సంకల్పం ఫలిస్తుంది.



### సింహం (జులై 23 - ఆగస్టు 23 మధ్య పుట్టినవారు)

శుభకార్యాలు, విద్య, ఆర్థిక వ్యూహాలు, సమావేశాలకు ఈ వారం అనుకూలం. బుధ, గురు, శుక్రవారాల్లో రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారికి ప్రోత్సాహకరం. వేడుకలు, సమావేశాలకు ఏర్పాట్లు చేస్తారు. బంధుమిత్రులతో ఇల్లు సందడిగా ఉంటుంది. 15, 16 తేదీల్లో ఉన్నత విద్యా విషయాల్లో ప్రోత్సాహకరం. చిన్నారులు, ప్రియతముల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. పెట్టుబడుల్లో ఆచితూచి వ్యవహరించాలి. 17, 18 తేదీల్లో సహోద్యోగులతో సమావేశాలు సత్ఫలితాలనిస్తాయి. వృత్తి, వ్యాపారాలకు సంబంధించి కీలక సమాచారం అందుకుంటారు. విందు వినోదాల్లో పాల్గొంటారు.



### కన్య (ఆగస్టు 24 - సెప్టెంబర్ 22 మధ్య పుట్టినవారు)

రుణప్రయత్నాలు, కొనుగోళ్లు, పెట్టుబడులు, చిన్నారుల విషయాలు దూరప్రయాణాలకు ఈ వారం ప్రోత్సాహకరం. బుధ, గురు, శుక్రవారాల్లో విద్యకు అవసరమైన నిధులు సర్దుబాటవుతాయి. ఆర్థికపరమైన చర్చలు, ప్రయాణాలు ఫలిస్తాయి. సన్నిహితుల ఆంతరంగిక విషయాల్లో జోక్యం చేసుకోవాల్సి రావచ్చు. 15, 16 తేదీల్లో ఇంటి కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. రుణ ప్రయత్నాలు ఫలిస్తాయి. సంస్మరణల్లో పాల్గొంటారు. 17, 18 తేదీల్లో చిన్నారులు, ప్రియతముల కోసం విలువైన వస్తువులు సమకూర్చుకుంటారు. వడ్డీలు, బోనస్‌లు అందుకుంటారు. పన్నుల వ్యవహారాలు పరిష్కారం అవుతాయి.



### తుల (సెప్టెంబర్ 23 - అక్టోబర్ 23 మధ్య పుట్టినవారు)

కాంట్రాక్టులు, విద్యా విషయాలు, భాగస్వామి విషయాలకు ఈ వారం ప్రాధాన్యం ఇస్తారు. బుధ, గురు, శుక్రవారాల్లో పెట్టుబడులు లాభిస్తాయి. ప్రియతముల కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. షేర్లు, మ్యూచువల్ ఫండ్ లావాదేవీలకు అనుకూలం. 15, 16 తేదీల్లో చర్చలు, సమావేశాల్లో తొందరపాటు తగదు. సోదరీ సోదరుల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. జనసంబంధాలు విస్తరిస్తాయి. 17, 18 తేదీల్లో కుటుంబ వ్యవహారాల్లో శుభపరిణామాలు సంభవం. రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారికి సంకల్పం నెరవేరుతుంది. శుభకార్యానికి ఏర్పాట్లు చేస్తారు.



### వృశ్చికం (అక్టోబర్ 24 - నవంబర్ 22 మధ్య పుట్టినవారు)

ప్రమోషన్లు, ఇంక్రిమెంట్లు, ఉద్యోగ ప్రయత్నాలు, ఇంట్లో వేడుకలకు ఈ వారం ప్రాధాన్యం ఉంటుంది. బుధ, గురు, శుక్రవారాల్లో వృత్తి, వ్యాపారాల్లో ప్రోత్సాహకరం. విందు వినోదాల్లో పాల్గొంటారు. పరిశ్రమలు, హోటల్, వైద్యరంగాల వారు కీలక నిర్ణయాలు తీసుకుంటారు. 15, 16 తేదీల్లో అదనపు ఆదాయం కోసం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. ఆర్థిక విషయాల్లో సహోద్యోగులు మొహమాటపెట్టే అవకాశం ఉంది. ప్రమోషన్లు, ఇంక్రిమెంట్ల కోసం ప్రయత్నిస్తారు. 17, 18 తేదీల్లో ఇంటర్వ్యూలలో విజయం సాధిస్తారు. సన్నిహితుల ఆరోగ్యం మెరుగుపడుతుంది. వృత్తి, వ్యాపారాలకు సంబంధించి కీలక సమాచారం అందుకుంటారు.



### ధనుస్సు (నవంబర్ 23 - డిసెంబర్ 21 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, చిన్నారులు, ప్రియతములు, విద్యా విషయాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురు, శుక్రవారాల్లో విద్యార్థులకు శుభప్రదం. సినీ, రాజకీయ రంగాల వారికి ఆర్థికంగా ప్రోత్సాహకరం. ప్రియతములకు సంబంధించి రహస్య సమాచారం అందుకుంటారు. బ్యాంకింగ్, ఉన్నత విద్య, ఫొటోగ్రఫీ, గ్రానైట్ రంగాల వారికి శుభప్రదం. 15, 16 తేదీల్లో చిన్నారుల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. సృజనాత్మకంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. ప్రేమానుబంధాలు బలపడతాయి. 17, 18 తేదీల్లో పెట్టుబడులు, పొదుపు పథకాలు లాభిస్తాయి.



### మకరం (డిసెంబర్ 22 - జనవరి 20 మధ్య పుట్టినవారు)

గృహారంభ ప్రవేశాలు, వేడుకలు, పెట్టుబడులపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురు, శుక్రవారాల్లో సమావేశాలు, వేడుకలకు ఏర్పాట్లు చేస్తారు. బంధుమిత్రులతో విందుల్లో పాల్గొంటారు. బ్యాంకులు, ఆస్పత్రులు, హోటల్ రంగాల వారికి ఆర్థికంగా లాభదాయకం. 15, 16 తేదీల్లో రియల్ ఎస్టేట్ రంగంలోని వారు ఆచితూచి వ్యవహరించాలి. దూరాలలో ఉన్న బంధుమిత్రుల రాకతో ఇల్లు సందడిగా ఉంటుంది. వేడుకల్లో పాల్గొంటారు. 17, 18 తేదీల్లో బదిలీలు, మార్పులకు అనుకూలం.



### కుంభం (జనవరి 21 - ఫిబ్రవరి 18 మధ్య పుట్టినవారు)

సమావేశాలు, వేడుకలు, గృహారంభ ప్రవేశాలు, ప్రేమానుబంధాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురు, శుక్రవారాల్లో ప్రముఖులతో చర్చలు ఫలిస్తాయి. ఇంటర్వ్యూలలో విజయం సాధిస్తారు. వృత్తి, వ్యాపారాలకు సంబంధించి కీలక సమాచారం అందుకుంటారు. 15, 16 తేదీల్లో బృందకార్యక్రమాల్లో మాటపడాల్సి వస్తుంది. జనసంబంధాలు విస్తరిస్తాయి. ఆర్థిక విషయాల్లో సన్నిహితుల సహకారం లభిస్తుంది. 17, 18 తేదీల్లో దూరప్రయాణాలు, చర్చలు ఫలిస్తాయి. రాజకీయ, సినీరంగాల వారు కీలక సమాచారం అందుకుంటారు. విద్యార్థులకు ప్రోత్సాహకరం.

### మీనం (ఫిబ్రవరి 19 - మార్చి 20 మధ్య పుట్టినవారు)



పెట్టుబడులు, వేడుకలు, ఉన్నత విద్యా విషయాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురు, శుక్రవారాల్లో ఆర్థిక విషయాల్లో ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. పెట్టుబడులకు సంబంధించిన సమాచారం సేకరిస్తారు. ప్రయాణాలు, చర్చలు లాభిస్తాయి. బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. 15, 16 తేదీల్లో ప్రమోషన్లు, ఇంక్రిమెంట్ల విషయంలో కొంత నిరుత్సాహానికి లోనవుతారు. పెద్దల సహకారంతో లక్ష్యాలు సాధిస్తారు. 17, 18 తేదీల్లో పెట్టుబడులు లాభిస్తాయి. బ్యాంకులు, ఆర్థిక సంస్థలతో పనులు పూర్తవుతాయి. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు.

# శ్రీదేవి కాపురంలో కలతలు?




జగదేక సుందరి కాపురంలో కలతలు సృష్టించింది ఎవరో కాదు, సాక్షాత్తు ఆమె కూతురు జాహ్నవి! ఈ గొడవలకు, జాహ్నవికి ప్రత్యక్ష సంబంధం లేకపోయినా, పరోక్షంగా ఆమె కారణమంటున్నారు బాలీవుడ్ జనాలు. ఇంతకీ అసలు సంగతేమిటంటే...జాహ్నవి సినీరంగ ప్రవేశంపై శ్రీదేవి బోలెడన్ని ప్లాన్లు వేసుకుంది.

ఓ అగ్ర దర్శకుడి చేత ఓ పెద్ద బ్యానర్‌లో కూతురి అరంగేట్రం చేయించాలన్నది ఆవిడ గారి ఆశ. తల్లిగా ఆవిడ కోరికలు ఆవిడకుంటే, తండ్రి బోనీకపూర్‌కి కూడా కూతురి విషయంలో చిట్టిపొట్టి కోరికలుంటాయి కదా! కూతురు నటించే మొదటి సినిమా తను నిర్మించాలన్నది ఆ తండ్రిగారి డ్రీమ్. ఇక్కడే భార్యాభర్తలకి తేడా కొట్టేసిందట!

బోని సినిమాలో నటిస్తే జాహ్నవి తన కెరీర్ ప్రారంభంలోనే అటకెక్కేస్తుందని శ్రీదేవి తెగ భయపడుతోందట! కూతురి సినిమాలో కలగ చేసుకోవద్దని శ్రీదేవి, తండ్రిగా అది తన బాధ్యత అంటూ బోనీకపూర్ ఇద్దరూ ప్రతిరోజూ గొడవ పడుతున్నారట! ఈ గొడవ చిలికి చిలికి విడాకుల దాకా వెళ్ళినా ఆశ్చర్యపోనక్కర్లేదు అంటున్నారు సినీ జనాలు.



## రాజకీయాల్లోకి మాధవన్?

మాధవన్ పేరు తెలుగు ప్రేక్షకులకు పెద్దగా తెలియకపోవచ్చు కానీ, కోలీవుడ్, బాలీవుడ్ ప్రేక్షకులకు మాధవన్ సుపరిచితుడే! ఒకప్పుడు బిజీ బిజీగా సినిమాలు చేసిన ఈ హీరోగారు ఇటీవలి కాలంలో జోరు తగ్గించారు. ఎటూ ఖాళీ దొరికింది కదా....రాజకీయాలవైపు ఓ చూపు చూద్దామని అనుకుంటున్నాడట! తను బాగా తెలిసిన చెన్నై, ముంబయివైపు కాకుండా ఏపి పైన దృష్టి పెట్టాడు మాధవన్. తాజాగా జరిగిన ఏపి మంత్రివర్గం మార్పులపైన మాట్లాడాడు. ఏపి ముఖ్యమంత్రి ఉత్తమమైన జట్టును ఎంపిక చేసుకున్నారని ఓ స్థాయిలో పొగిడేశాడు. మాధవన్ పొగడ్తలన్నీ ఏపి రాజకీయాల్లోకి ప్రవేశించడానికే అంటున్నారు కోలీవుడ్ జనాలు. కోలీవుడ్‌లో తను ఎటూ నెగ్గుకు రాలేడన్న సంగతి తెలిసే మాధవన్ ఏపి వైపు మొగ్గు చూపాడంటున్నారు.

## విలన్‌గా మరో హీరోయిన్ భర్త!

మాజీ హీరోయిన్ల భర్తలు విలన్లుగా టాలీవుడ్‌లోకి ఎంట్రీ ఇవ్వడం ఇటీవలి కాలంలో తరచూ జరుగుతోందే! ఇప్పుడు కూడా మాజీ హీరోయిన్ స్నేహ భర్త ప్రసన్న టాలీవుడ్‌లో ఎంట్రీ ఇవ్వబోతున్నాడు. సాయిధరమ్‌తేజ్ హీరోగా నటిస్తున్న ఓ సినిమాలో ప్రసన్న విలన్‌గా చేయబోతున్నాడట! విలన్‌గా ఓ ఫ్రెష్ ఫేస్ అయితే బాగుంటుందని తేజ్ సినిమా యూనిట్ భావించిందట! మంచి విలన్ కోసం వెతుకుతున్న ఈ యూనిట్ దృష్టికి ప్రసన్న రావడం, వెంటనే అతగాడిని సంప్రదించడం, ప్రసన్న చేత ఓకే అనిపించుకోవడం వెంట వెంటనే జరిగిపోయాయట! అయితే ఈ మొత్తం ఎపిసోడ్ వెనుక స్నేహ హస్తం ఉందని అంటున్నారు. ఇటీవలి కాలంలో ప్రసన్నకు కోలీవుడ్‌లో డిమాండ్ తగ్గడం మొదలైంది. పూర్తిగా తగ్గేదాకా ఉండడం కన్నా పక్క భాషలోకి జంప్ అయితే బాగుంటుందని భర్తకు స్నేహ సలహా ఇచ్చిందట! దానికి ప్రసన్న ఓకే అనడంతో ప్రయత్నాలు ప్రారంభించి సక్సెస్ అయింది అంటున్నారు.





## వాణిశ్రీని మోసం చేశారట!

బయట వ్యక్తులు కాకుండా సొంతవారే మోసం చేశారని ఇటీవల ఓ ఇంటర్వ్యూలో వాణిశ్రీ వాపోయింది. హీరోయిన్‌గా బిజీగా ఉన్న సమయంలో తన ఆస్తిపాస్తులకు సంబంధించిన వివరాలు చూసుకోమంటూ ఆమె తన అక్కా బావలకు కొన్ని బాధ్యతలు అప్పగించిందట! రోజు రోజుకూ వాణిశ్రీ ఆస్తి పెరుగుతుండడంతో అక్కాబావ ఆమె ఆస్తిని కాజేయాలని చూశారట! తన ఆస్తిని దక్కించుకోవడానికి వాణిశ్రీ కోర్టు మెట్లు కూడా ఎక్కవలసి వచ్చిందట! ఎన్నో పరిణామాల అనంతరం అక్కా బావ తన ఆస్తిని తనకే తిరిగి ఇచ్చేశారట! అయినవారే తనను మోసం చేయడం అనేది చాలా బాధ కలిగించిందని చెప్పుకొచ్చింది వాణిశ్రీ.

# టాలీవుడ్ అమ్మలు
# రెమ్యునరేషన్ అదుర్స్











**టాలీవుడ్‌లో హీరోయిన్ల తరువాత తల్లుల పాత్రల మీదే ఎక్కువ ఫోకస్ ఉంటుంది. గతంలో హీరోయిన్ తల్లి అనగానే మామూలు చీరతో వయస్సు ఉన్నవారు తెర మీద కనిపించేవారు. క్రమేపీ సినిమాల్లో ఎన్నో మార్పులు వచ్చాయి. ఆ మార్పులు హీరోయిన్ తల్లుల మీద కూడా కన పడుతున్నాయి. ఇప్పటి తల్లి హీరోయిన్‌తో సమానంగా స్టయిల్‌గా ఉంటుంది. అందంగా ఉంటుంది. పేరుకే తల్లి కానీ, గ్లామర్‌తో కూతురితో పోటీ పడే తల్లులు ఇప్పుడు వెండితెరను ఏలుతున్నారు. తల్లులు ఎంత రిచ్‌గా కనిపిస్తారో వారి రెమ్యునరేషన్లు కూడా అంత రిచ్‌గానే ఉంటున్నాయి. తెరమీద తరచూ కనిపించే కొందరు తల్లుల రెమ్యునరేషన్ల గురించి...**

### హేమమాలిని

చాలా సంవత్సరాల తరువాత బాలీవుడ్ డ్రీమ్‌గర్ల్ హేమమాలిని 'గౌతమీపుత్ర శాత కర్ణి'లో రాజమాతగా టాలీవుడ్‌లో దర్శనమిచ్చింది. ఈ సినిమాకు ముందు చాలా మంది దర్శకనిర్మాతలు ఆమెను దక్షిణాది సినిమాల్లోకి తీసుకురావడానికి ప్రయత్నించినా వారి ప్రయత్నాలు ఫలించలేదు. అది దర్శకుడు క్రిష్ వల్లనే సాధ్యమైంది. ఈ సినిమాకు గాను హేమమాలినికి దాదాపు రెండు కోట్లు రెమ్యునరేషన్‌గా చెల్లించారు. తల్లి పాత్రకు అంత రెమ్యునరేషన్ తీసుకున్న మొదటి నటి ఆమే. బహుశా చివరి నటి కూడా ఆమే అని అంటున్నారు. పేరుకు బాలకృష్ణ తల్లే అయినా అందంలో శ్రియకి గట్టి పోటీ ఇచ్చింది.

### రమ్యకృష్ణ

ఓ దశలో టాలీవుడ్‌ని ఏలిన హీరోయిన్. హీరోయిన్‌గా విభిన్న పాత్రలు పోషించిన వారిలో రమ్యకృష్ణ పేరు తప్పనిసరిగా ఉండి తీరాల్సిందే. 'కంటే కూతుర్నే కను', 'ఆవిడే శ్యామల', 'నరసింహ' లాంటి సినిమాలు రమ్యకృష్ణలోని నట ప్రతిభకు మచ్చుతునకలు. దర్శకుడు కృష్ణవంశీని పెళ్ళి చేసుకున్న తరువాత కొంత కాలం నటనకు దూరంగా ఉన్నా, తిరిగి సెకండ్ ఇన్నింగ్స్ మొదలు పెట్టింది. సెకండ్ ఇన్నింగ్స్‌లో ఎక్కువగా అత్త పాత్రలు చేసినా, పెద్దగా గుర్తింపురాలేదు. రాజమౌళి 'బాహుబలి' మాత్రం రమ్యకృష్ణకు ఎనలేని పేరు తీసుకొచ్చింది. అప్పటివరకూ రోజుకి వేలల్లో తీసుకునే పారితోషికం లక్షల్లోకి చేరు కుంది. రమ్యకృష్ణ రోజువారీ రెమ్యునరేషన్ ఇప్పుడు రెండు లక్షలు. రమ్యకృష్ణతో సినిమా చేయాలనుకునేవారు అక్షరాలా రోజుకు రెండు లక్షలు సమర్పించుకోవలసిందే!

### నదియా

అందమైన అత్త, అమ్మ క్యారెక్టర్లకు నదియా కేరాఫ్ అడ్రస్ అయ్యింది. హీరోయిన్‌గా టాలీవుడ్‌లో పెద్దగా గుర్తింపు లభించకపోయినా, అమ్మ, అత్త క్యారెక్టర్లకు మాత్రం మంచి పేరు తెచ్చుకుంది. 'మిర్చి'లో ప్రభాస్‌కు తల్లిగా కనిపించిన నదియా ఆ తరువాత 'అత్తారింటికి దారేది'లో పవన్ కల్యాణ్ మేనత్తగా అలరించింది. ఏ పాత్ర చేసినా గ్లామర్ ఒలకబోయడంలో నదియా తరువాతే అంటారు సినీ జనాలు. ఇంత అందమైన అమ్మ రెమ్యునరేషన్ ఎంతో తెలుసు కుంటే దిమ్మ తిరిగిపోవలిసిందే! రోజుకు రెండు లక్షలు తీసుకునే నదియా ఇతర ఖర్చులు కూడా నిర్మాతే భరించాల్సి ఉంటుందట! ఒక్క తెలుగులోనే కాకుండా దక్షిణాదిన ఇతర భాషల్లో కూడా నదియా బిజీగానే ఉంది.

### జయసుధ

సావిత్రి తరువాత సహజనటి అన్న బిరుదును సొంతం చేసుకున్న ఒకప్పటి హీరోయిన్, ఇప్పటి అమ్మ జయసుధ. మధ్య మధ్యలో రాజకీయాలంటూ అటు వైపు వెడుతున్నా అమ్మ, నాయ నమ్మ పాత్రలకు బెస్ట్ ఛాయిస్‌గా నిలిచింది జయసుధ. పిండి కొద్దీ రొట్టె అన్న చందంగా జయసుధ సినిమాకు దాదాపు 20 నుంచి 25 లక్షలు, ఆ పైన సమర్పించుకోవలసిందే! పది నుంచి పన్నెండురో

జుల షూటింగ్ ఉంటే రోజుకు రెండు లక్షలు చొప్పున తీసుకుంటుంది. ఆ పైన ఒక్కో రోజు లక్ష అదనంగా చెల్లించాల్సిందేనట! అందుకే జయసుధతో షూటింగ్ అంటే దాదాపు పదిరోజుల లోపే ముగించేస్తారట దర్శక నిర్మాతలు. సీనియర్ నటి కనుక ఆ మాత్రం చెల్లించుకోవాల్సిందే అన్నది దర్శకనిర్మాతల మాట!



## రేవతి

వెండితెర మీదున్న టాలెంటెడ్ నటీమణులలో రేవతి పేరు చెప్పుకుని తీరవలసిందే! హీరోయిన్‌గా తెలుగులో చేసిన సినిమాలు తక్కువే అయినా మంచి హీరోయిన్ అని పేరు తెచ్చుకుంది. మిగతా అమ్మల మాదిరిగా రోజుకి ఇంత అని కాకుండా సినిమాకి 20 నుంచి 25 లక్షలు తీసుకుంటుంది రేవతి. రెమ్యునరేషన్ విషయంలో పెద్దగా ఇబ్బంది పెట్టకపోవడం వంటి కారణాలతో టాలీవుడ్‌లో చాలా సినిమాల్లో అమ్మ పాత్రలకు రేవతి మంచి ఛాయిస్ అని చెబుతారు.



## పవిత్ర లోకేష్

వయస్సు రీత్యా చిన్నదే అయినా ఇటీవలి కాలంలో పవిత్ర లోకేష్‌కి డిమాండ్ బాగా పెరిగింది. సాఫ్ట్‌గా నవ్వు ముఖంతో పెద్దరికంగా కనిపించే పవిత్ర డేట్ల కోసం దర్శకనిర్మాతలు క్యూ కడుతుంటారు. అమ్మ పాత్రలో ఎంత చక్కగా ఒదిగిపోతుందో రెమ్యునరేషన్ విషయంలో కూడా అంతే పట్టు విడుపుతో వ్యవహరిస్తుంది అంటారు సినీ జనాలు. రోజుకి 50 నుంచి 60 వేలు తీసుకుంటుంది.

## రాశి

చైల్డ్ ఆర్టిస్టు నుంచి హీరోయిన్‌గా ఎదిగింది రాశి. హీరోయిన్‌గా మంచి ఫామ్‌లో ఉండగానే పెళ్ళి చేసుకుని కొంత కాలం సినిమాలకు దూరమైంది. ఆ తరువాత బరువు విపరీతంగా పెరిగి పోవడంతో చిన్న వయస్సులోనే క్యారెక్టర్ ఆర్టిస్టుగా అవతారం ఎత్తాల్సి వచ్చింది. అక్కా, అమ్మ, వదిన ఇలా తనకు తగిన క్యారెక్టర్లు చేస్తోంది. ప్రస్తుతం రాశి రోజుకు 75 వేల రూపాయల చొప్పున తీసుకుంటుంది.





## మధుబాల

'రోజా' సినిమా పేరు తలుచుకోగానే ముందుగా మదిలో మెదిలేది ఆ సినిమా హీరోయిన్ మధుబాల! దేశవ్యాప్తంగా ఎంతో మంది అభిమానులను సంపాదించుకున్న మధుబాలకి హీరోయిన్‌గా అనుకున్నంత పేరు రాలేదు. అదంతా ఆమె స్వయంకృతాపరాధమే అంటారు ఆమె సన్నిహితులు. ఆ సినిమా తరువాత తెలుగులో తక్కువ సినిమాలు చేసింది మధుబాల. పెళ్ళి తరువాత టాలీవుడ్‌లో అమ్మగా ఓ సినిమా చేసింది. రోజుకు 75 వేల చొప్పున తీసుకునే మధుబాలకు టాలీవుడ్‌లో కన్నా కోలీవుడ్‌లోనే అవకాశాలు ఎక్కువగా వస్తుంటాయి. డైటింగ్ చేస్తున్న అమ్మలాగా ఉండే మధుబాలకు ఇప్పటికీ తల పొగరు ఎక్కువే అన్న అపవాదు ఉంది.

## రోహిణి

తెలుగులో రోహిణి హీరోయిన్‌గా చేసిన సినిమాలు తక్కువే అని చెప్పుకోవాలి. నటిగా కన్నా కూడా డబ్బింగ్ ఆర్టిస్ట్‌గా రోహిణి బాగా పాపులర్ అయింది. చాలా మంది హీరోయిన్లకు తన గాత్రాన్ని అరువు ఇచ్చే రోహిణి అమ్మ, అక్క, ఆంటీ పాత్రల్లో ఎక్కువగా కనిపిస్తూ ఉంటుంది. ఇదే కాకుండా రోహిణిలో మరో యాంగిల్ కూడా ఉంది. అదే మేకప్ ఆర్టిస్ట్. ఇన్ని కళలు సొంతం చేసుకున్న రోహిణి ఒక్కో సినిమాకి రోజుకి 50 నుంచి 60 వేల చొప్పున తీసుకుంటుంది.



## శరణ్య

కోలీవుడ్‌లో ఫేమస్ అమ్మ శరణ్య. తెలుగులో తక్కువ సినిమాల్లో తల్లి పాత్రలు పోషించింది శరణ్య. 'ఇంద్రుడు', 'రఘువరన్ బీటెక్' సినిమాలతో బాగా పేరు తెచ్చుకుంది శరణ్య. సినిమా కుటుంబం నుంచే వచ్చినా హీరోయిన్‌గా కన్నా కూడా తల్లి పాత్రల ద్వారానే శరణ్య బాగా పేరు తెచ్చుకుంది. రోజుకి 40 నుంచి 50 వేల వరకూ రెమ్యునరేషన్ తీసుకుంటుంది.

## తులసి

సంప్రదాయ తమిళ కుటుంబంలో పుట్టిన తులసి చైల్డ్ ఆర్టిస్ట్‌గా 'శంకరాభరణం'లో నటించింది. ఆ సినిమాతో తులసి పేరు మారుమోగిపోయింది. చైల్డ్ ఆర్టిస్ట్ నుంచి హీరోయిన్‌గా మారి పలు సినిమాల్లో నటించినా అనుకున్న గుర్తింపు మాత్రం రాలేదు. పెళ్ళి చేసుకున్న తరువాత చాలా సంవత్సరాలకు సెకండ్ ఇన్నింగ్స్ మొదలుపెట్టింది తులసి. అమ్మ, అక్క పాత్రలు చేస్తోంది. తులసి రెమ్యునరేషన్ కూడా రోజుకి వేలల్లోనే ఉంటుంది.



## ఇతర అమ్మలు

వీళ్ళే కాకుండా ప్రగతి, హేమ, సుధ లాంటి అందమైన అమ్మలు టాలీవుడ్‌లో చాలా మందే ఉన్నారు. వీరందరి రెమ్యునరేషన్ కూడా రోజుకి వేలల్లోనే ఉంటుంది.

–చిన్ని

